# ఆంధ్ర ప్రదేశ్ లో

| | |
|---|---|
| జనాభా | 4,35,03,000 |
| షెడ్యూలు కులాలవారు | 57,75,000 |
| షెడ్యూలు జాతులవారు | 16,58,000 |
| విస్తీర్ణం (చ.కి.మీ.) | 2,76,754 |
| జిల్లాలు | 21 |
| తాలూకాలు | 195 |
| పట్టణాలు, నగరాలు | 224 |
| పల్లెలు | 27,221 |
| పంచాయతీలు | 15,920 |
| పంచాయతీ సమితులు | 324 |
| పార్లమెంటు సభ్యులు | 59 |
| శాసన సభ సభ్యులు (ఒకనామినేటెడ్ సభ్యునితోసహా) | 288 |
| శాసన పరిషత్తు సభ్యులు | 90 |
| విశ్వవిద్యాలయాలు | 5 |
| అక్షరాస్యులు | 1,06,90,000 |

# ఆంధ్రప్రదేశ్


సంపుటి : 19 | అక్టోబర్, 1975 ఆశ్వీయుజ—కార్తీక, 1897 | సంచిక : 12

ప్రధాన సంపాదకులు
శ్రీ రాజ్యం సిన్హా

సంపాదకులు
యన్. వి. గోపాలశాస్త్రి


అంతర్జాతీయ మహిళా సంవత్సర ప్రత్యేక సంచిక

నా తెలుగుతల్లి నిరతమ్ము నాదు గుండె
లోపలను వెల్గు నిర్వాత దీపకళిక
నా నయన సుధా వర్తిక నాదు మేన
చలువ లీనుచు పేటెత్తు చందనంబు

— నాయని కృష్ణకుమారి

మొదటి కవరు పేజీ : రెక్క విప్పిన మహిళోద్యమ విహంగం

మధ్యపేజీల్లో : ఆంధ్ర మహిళాసభ దృశ్యాలు

మూడో కవరు : సంతలో గిరిజన మహిళలు


సాలు చందా : ఆరు రూపాయలు

వెల: 50 పైసలు

రిజిస్టరు నెం: హెచ్/హెచ్. డి. 81


## ఈ సంచికలో...

# మహిళలు స్వశక్తితో ముందంజ వేయాలి

## ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ



ప్రజలు పూనుకోవాలి

ప్రధాన మంత్రి ఎవరు అనేది కాదు ప్రశ్న; ప్రధానమైన, ప్రయోజనాత్మక మైన స్థానాల నాక్రమించేందుకు ఎంతమంది మహిళలు ముందుకు వస్తున్నారూ అని. స్త్రీల హోదానూ, వారు నిర్వహించాల్సిన పాత్రనూ పరిశీలిద్దాం. ఇదే అంతర్జాతీయ మహిళా సంవత్సరం లక్ష్యమని నా భావన. ప్రపంచమంతటా మహిళల హోదా మారింది; దీనినే అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో పునః పరిశీలించాలి. కాని పరిస్థితి అన్నిచోట్లా ఒకే రీతిగా లేదు. ఇతర దేశాల మహిళలకన్నా మన దేశంలో మహిళలకు ఎక్కువ హక్కులున్నప్పటికీ, వారు తమ హక్కులను తెలుసుకోకపోవడం చేత చాలా ప్రాంతాల్లో కష్టాలు పడుతున్నారు. తమ హక్కులు గుర్తించిన వారు సైతం పోటీ తట్టుకోవడానికి రెట్టింపు కృషి చేయాల్సి వస్తోంది.

దేశంలోని స్త్రీలందరికీ తమశక్తి సామర్థ్యాలను పూర్తిగా వినియోగించి ఏదోరీతిగా అంతోయింతో జాతికి మేలు చేసే అవకాశం వుండాలి.

అంతర్జాతీయ మహిళా సంవత్సర కార్యక్రమం నిరంతరం జరిగే కార్యక్రమంలో భాగమే. సంఘాలు ఏర్పడి పటిష్ఠం కావాలి........... శాసనాలు వున్నాయి. కాని శాసనాలతో సహా విద్యా విషయిక ఉద్యమం రావాలి. ఆ విధంగానే మహిళలు స్వచ్ఛందంగా ముందుకు రాగలుగుతారు. ప్రభుత్వం ప్రతీదీ చేయలేదు. ఉదాహరణకు బాల్య వివాహాల నిషేధ చట్టం తీసుకోండి ఇది ప్రభుత్వానికే రీతిగానూ లాభించదు; అయినా యిది జాతి సంక్షేమానికి అవసరం. ఇట్లాంటి చోట మహిళా సంస్థలు కొంత చేయగలుగుతాయి. ప్రజలు...మహిళలు విద్యావంతులు కావాలి, యిదీ సమగ్రమైన విద్య కావాలి. మహిళలు తమకు తాముగా శాసనాలను గురించి తెలుసుకుంటే గాని మనం యేమీ సాధించలేం. ఈ విషయంలో మనం కొన్ని నిర్దిష్టమైన చర్యలు తీసుకుంటున్నాం.



మహిళాభ్యుదయానికి సంబంధించిన అన్నిరంగాల్లోనూ ప్రయత్నించి ఎంతో సాధించుకోవాలి వినియోగదార్ల ఉద్యమం నడుపుకోవాలి అలాగే సమాన వేతనాల విషయంలో నేను చాలా ఉత్సుకతతో వున్నాను ఇందులో ఎంత మంచిని సాధించగలమనేది చూడాలి. చాలామంది స్త్రీ కూలీలను తొలగిస్తారు. స్త్రీలు కూడా ఎక్కడ ఉద్యోగం పోతుందోనని భయపడతారు. శాసనాలు అమలు జరగకుండాపోయే. ఉద్యోగం నిలిస్తే చాలని భావిస్తారు. ఈ విధంగా, ఉద్యోగాలిచ్చే వారి వల్ల శాసనాల లక్ష్యం దెబ్బతింటోంది ప్రాంతీయ మహిళా సంస్థలు యీ విషయాల నాశింపు చేసుకుని, వీటినెప్పుడూ ఓకంట కని పెడుతూ ప్రజాభిప్రాయాన్ని పటిష్టం చేయ్యాలి

న్యాయస్థానాలకు పోనవసరం లేకుండానే స్త్రీలు తమ సమస్యలను పరిష్కరించుకునేందుకు న్యాయసంబంధమైన సహాయాన్నందించి. ప్రత్యేక ట్రిబ్యునల్స్ ఏర్పాటు చేయాలని చూస్తున్నాం.

సాధారణ విద్య సాంప్రదాయిక విద్యాస్థానాన్ని ఆక్రమించుకోలేవని నేనెప్పుడూ భావిస్తూ వచ్చాను. ఉద్యోగం లక్ష్యంగా చదివే చదువులు నిజమైన విద్య కానేరవు. ప్రపంచం సాంకేతికంగా సాధించిన ప్రగతి వల్ల, ఉద్యోగ అవధులు మారడం వలన, మౌలికమైన భావనాశక్తిని, సాధన సంపత్తిని యిచ్చే సాంప్రదాయిక విద్య ఎక్కువ ప్రయోజనకరమైనదిగా భవిష్యత్తులో నిరూపింపబడుతుంది.

**విద్య అలంకార ప్రాయంకాదు**

విద్య కేవలం అలంకారప్రాయంకారాదు. విద్య అంటే మనిషి యింకా ఉత్తమంగా పరిణతి పొందడం ప్రాచీన భారతీయ విధానం, బళ్ళోకి పోవడం కన్నా ఎంతో ఉత్తమమైన గుణగణాలను వ్యక్తిలో తీర్చిదిద్దింది ప్రపంచంలో అగ్రగణ్యులైన ఎంతో మంది తమబడి చదువు పూర్తిచేయనేలేదు అంతవరకూ ఎందుకు— శాస్త్రజ్ఞులు అసాధ్యమని వదిలి పెట్టినతర్వాత ఇద్దరు సైకిలు రిపేరు చేసేవాళ్ళు మొట్ట మొదట విమానాన్ని పైకి పంపారు. చూడండి-నేను విద్యకు వ్యతిరేకిని కాను. కాని ఒకేగాడిలో పడి పోవడం విద్యకాదు నిజమైన విద్య సమాజ జీవితంలో ఒక భాగం అట్లాంటి విద్య మన యువతరానికి అవసరమని నేను భావిస్తున్నాను.

ఇప్పుడున్నస్థితి ప్రపంచంలో కల్లా ఉత్తమమైందనీ, ఇంక విముక్తి అవసరం లేదనీ స్త్రీలనుకుంటున్నారు. మనం బాధలు పడతాం. మనదేశంవంటి దేశంలో వృథాఅయిన సమయాన్ని పూరించుకోవాల్సివుంది.

జాతిలో సగభాగం జీవనప్రవాహానికి దూరంగా వుండిపోవడం మంచిదికాదు. తరతరాలుగా మన మహిళలు జీవితం అంటే యిదే, మన బ్రతుకింతే—అని అనుకునేట్టుగా మలచబడ్డారు.

ఇప్పుడిప్పుడు భారత స్త్రీ బౌననిపించుకుంటోంది. మగవారి పోకడ మారి, ఉదార స్వభావం పెరుగుతోంది. మంచి లక్ష్యంకోసం చేసే యే పోరాటానికీ ఓటమి లేదు.

**స్వానుభవం**

ఆడపిల్లలను ఆటలు పట్టించడం, ఏడిపించడం (ఈవ్ టీజింగ్) పై ఈ మధ్య ఒక టెలివిజన్ కార్యక్రమం ప్రసారమైంది. ఆడపిల్లలు అదోరకంగా దుస్తులు వేసుకోవడంవలన వెటకారానికి గురవుతోన్నట్లు అందులో తేలింది. ఇట్లాంటి సమస్యల్ని స్త్రీలే పరిష్కరించుకోవాలి. ఎట్లాగంటే, నేను స్వానుభవాన్ని చెబుతాను చాలా సంవత్సరాలక్రితం నేను శాంతినికేతన్‌లో చదువుకొనేప్పటి మాట. ఇంట్లో నాకు తగినంత స్వాతంత్ర్యం వుండేది. మా కుటుంబంలో ఇట్లాంటి వాటిగురించి పట్టించుకొనే తీరిక ఎవరికీ లేదు. ఓయువకుడు నాకేసి అదోలా చూడడం ఆరంభించాడు. మొదటో ఈ విషయాన్ని అల్లానే పోనివ్వడానికి ప్రయత్నించాను; అతనినుండి దృష్టి మరల్చుకున్నాను కూడా. కాని అతడు నా వెంటబడసాగాడు. అందుచేత ఓ రోజు అతడి కెదురుతిరిగి కర్యం వేసుకున్నాను. నిజంగా అతడిని దులిపి వదిలిపెట్టాను. ఆ అబ్బాయి నిశ్చేష్టుడయ్యాడు. ఆడపిల్లలు యిల్లాంటివాటికి యిష్టపడతారనుకున్నానన్నాడు. "మంచిది. యీ అమ్మాయి అల్లాంటిది కాదు" అన్నాను.

కాబట్టి ఈ విషయంలో స్త్రీలు తమంతట తామే జోక్యం చేసుకోవాలి. రక్షకభటులు కూడా కొంత చేస్తారు; పాఠశాల స్థాయినుండి దీన్ని మనం ఎదుర్కోవాలి. ఉపాధ్యాయులు, పరిస్థితులు యిందుకు అనుగుణంగా వుండాలి. పాశ్చాత్య దేశాలలోని విశృంఖలత యీవ్ టీజింగ్ కి మూలకారణం మన సినిమాలు కూడా కొంతవరకు దీనికి దోహదం చేస్తున్నాయి.

**మహిళలు శ్రద్ధ వహించాలి**

మన దేశం యిప్పుడు గడ్డుపరిస్థితుల నెదుర్కొంటూంది. అత్యవసర వస్తువుల ధరల పెరుగుదల, కొరతలు అన్ని దేశాలలో వున్నాయి. కాని ఇండియాలో యివి మరింత దుర్భరంగా వున్నాయి. ప్రజలు పేదవారు—చాలా దేశాల్లో ప్రజలు సమస్యలను అవగాహన చేసుకుంటారు. కాని మన దేశంలో ప్రతిపక్షాలవారు అన్నింటికీ నేనే కారణమంటారు. ఒక చిన్న ఉదాహరణ మాయింటి ముందు ఓ కూరగాయలమ్మే స్త్రీ వుంది. ఆమెను మా స్నేహితులు ధర అడిగారు. ధర చాలా విపరీతంగా చెప్పింది. అంతఎక్కువ ధరా అని అడిగితే, ఇందిరాగాంధీని అడగమని తకీమని జవాబుచెప్పింది. కరువు వస్తేనూ, వానలు కురవకుంటేనూ ధరలు హెచ్చుతాయి కాని తరచుగా వీటిని అదుపు చేయవచ్చు. ఇందుకు పురుషులకంటే స్త్రీలే హెచ్చుగా దోహదం చేయగలరు. నేను స్వయంగా చేశాను. చాలాకాలం క్రిందట ప్రధానమంత్రిని కాకపూర్వం మేం కొంతమంది స్త్రీలం పంచదార ధర విపరీతంగా పెరిగిపోవటం చూసి సహించలేక అది దీపావళి కాలమైనాసరే కొనకూడదని నిశ్చయానికి వచ్చాం. నిజానికి దీని కొరతలేదు కనుక ఆ తరువాత వెంటనే ధరలు తగ్గాయి. కనుక సామాన్యపౌరుడు శ్రద్ధ తీసుకోవాలి. భారతదేశం అభివృద్ధి దశలో వుంది. మనం కొంత నిర్మాణాత్మకంగా కృషి చేస్తూ వున్నాం. ప్రజలు ఎక్కువగా ఆశిస్తున్నారు. వారు ఇంతకుముందుకంటే ఎక్కువ కోరుతున్నారు. ఇది ప్రగతికి చిహ్నం.

క్రమశిక్షణ దెబ్బతిందని నిక్కచ్చిగా చెప్పవచ్చు. ప్రజాస్వామ్యాన్ని గురించి ప్రజలు తప్పుగా భావించడంవలన యిలా అయిందనుకుంటాను. "ఏది ఇష్టమయితే అది చేయడం" ప్రజాస్వామ్యానికి అర్థం అనుకుంటున్నారు యువతరం హక్కులు కోరుతోంది; కాని హక్కులతో పాటు బాధ్యతలను ఎంచి చూడడంలేదు. విద్యార్థులను విచ్ఛిన్నకర ధోరణిలో రెచ్చగొట్టే రాజకీయ పార్టీలవల్ల పరిస్థితి మరీ విషమించింది. కాని విద్యార్థులతో మాట్లాడినప్పుడు వారిలో ఎక్కువమంది మంచిని ఆకళింపు చేసుకోడానికి సిద్ధమైవుంటారు. అసలు కష్టానికి మూలకారణం వారిలో కొంతమంది మాత్రమే. ఇందువల్ల నష్టపోయేది వారు మాత్రమేననీ, పెద్దవారు కాదనీ తెలుసుకుంటారని తలుస్తాను.

**త్యాగభావంతో కృషిచేయాలి**

గాంధీజీ కాలంలో స్త్రీలకు బయట ప్రపంచంలో తక్కువ అవకాశాలుండేవి. అందుచేత వారు ఎక్కువ సంఖ్యలో ముందుకు వచ్చి పాల్గొన్నారు. ఇప్పుడు స్త్రీలకు పరిపాలన, వాణిజ్య పరమైన వ్యవహారాల్లో ఎక్కువ అవకాశాలు వున్నాయి. రాజకీయ పదవుల ప్రమేయం పెట్టుకోవటం లేదు. పూర్వం మహిళలు త్యాగం చేయడం మినహా మరొకటి ఆశించే ప్రశ్నే వుండేదికాదు. వ్యామోహంతో ముందుకొచ్చేవారికి రాజకీయాలు రుచించేవి కావు. ఈ రోజుల్లో ప్రతి ఒక్కరికి వెనువెంటనే ఫలితాలు కావాలి. రంగంలో అడుగుపెట్టిన వెంటనే అభ్యర్థి కావాలని ఆశిస్తారు. త్యాగం గురించి తలంపే లేదు. ఏదీ ఆశించకుండా వారు చేసేదేదో ముందుగా చేయాలని నేననుకుంటాను.

నేను రాజకీయాలను వృత్తిపరమైనవిగా భావించను. ఒకానొక సమయంలో నేను మంత్రి పదవి నధిష్ఠించడానికి యిష్టపడలేదు. రాజకీయాలనుండి నిష్క్రమించాను స్వాతంత్ర్యం సిద్ధించడంతో పని పూర్తయిందని భావించాను. కాని అప్పుడు యింకా దీక్షతో చేయాల్సినదెంతో వుందనీ, పని సంపూర్ణం కాలేదనీ అవగాహన చేసుకున్నాను.

లంచగొండితనం ప్రపంచమంతా వ్యాపించివుంది. మన దేశంలో మాత్రమే ఎక్కువగా లేదు. ప్రజలెప్పుడూ యీ విషయాన్ని గురించి చెప్పుకుంటూ వుంటారు : అంతే. ఇట్లా చెప్పుకోవడం లంచగొండితనాన్ని మరీ ఎక్కువ చేస్తోంది. లంచగొండితనాన్ని ఎదుర్కోవటానికి యీ మధ్య ఒక ఉద్యమం ఆరంభమైంది—కాని ఆ ఉద్యమంలోవున్న మనుషులు అంతా లంచగొండులుగా నిరూపించబడిన వారే. అవినీతి ఆరోపణలు వున్న మంత్రి నెవరినీ నేను అట్టిపెట్ట లేదు.

**గర్భస్రావం**

గర్భస్రావమనేది ఏ స్త్రీకీ మంచిది కాదు. ఎన్నో విషయాలను గురించి ఆలోచించు కోవల్సి వుంది. పెళ్ళికాని స్త్రీ తప్పుచేసి గర్భవతి అయినప్పుడు గర్భస్రావం పద్ధతి అవలంబించ వచ్చా ? ఆమె తప్పుచేస్తే, ఫలితాన్ని అనుభవించాలి ముందడుగు వేసి బిడ్డను కనాలి, పెళ్ళి ప్రసక్తి లేకున్నా సరే మనం చేసిన తప్పులకు ఏదో రూపంలో మనమంతా ఫలితం అనుభవించాలిసిందే. అమ్మాయి జీవితానికి ముప్పు వాటిల్లితే తప్పించి గర్భస్రావం కూడదు.

నా అనుభవం దృష్ట్యా నేను సంపూర్ణమైన, పరిపుష్టమైన జీవితం గడిపాను. నాకు ఏ చీకూ చింతా లేవు. భయపడను కూడా. నేను జ్యోతిష్యులను నమ్మను. నేనెప్పుడు వారితో సంప్రదించ లేదు. ఏదేదో జరుగనున్నదని కొంతమంది రాస్తూంటారు. కాని, వారంతా పరస్పర విరుద్ధమైనవి రాస్తారు. ఏదేమైనా, పిన్నవయస్సులో కూడా నేను మరణాన్ని గురించి ఎప్పుడూ భయపడలేదు బాహిరంగా వచ్చే ఆపదలను నేను తేలికగా తీసుకుంటాను. పర్వతారోహణ అంటే నాకు ఎప్పుడూ ఆపేక్ష వుండేది. నా పెంపకం జరిగిన తీరుకూ, యీ అభిరుచికీ ఏదో అవినాభావ సంబంధం వుందనుకుంటాను ...... నేను మంత్రిని కాక పూర్వం, నాకు పర్వతాలలో ఒక చిన్న యిల్లు వుండాలని వుండేది. ఎప్పుడూ ఏవో చిక్కుల్లో తలదూర్చడం నా విశేషం. ఉదాహరణకు, నేను పోర్చుగల్‌లో వున్న సమయంలో శరణార్థుల సమస్యలో తలదూర్చి, వ్యవహారం నిర్వర్తించాను. ఒంటరిగా వున్న సమయంలోనే కాదు, కొన్ని సమయాల్లో గుంపుల్లో వున్నప్పుడు కూడా కేవలం నా వ్యక్తిత్వంలోకి నేను పరిమితమై పోగలను. నేను ఏవో కొన్ని వ్యాయామాలు చేస్తాను. కాని, ప్రత్యేకంగా ఒక ప్రార్థన అంటూ ఏమీ లేదు.

**ఏ రోజు పని ఆరోజు చేయడం నాకు యిష్టం**

నేను నిద్రించే సమయాలకు ఒక క్రమం వుండదు, నాలుగు, అయిదు గంటలు నిద్రిస్తాను ; వీలైతే ఎనిమిది గంటలు, కాని యిది చాలా అరుదు. చాలా సార్లు రాత్రి మరీ వేళ మీరిన తర్వాత నిద్రపోవడం సంభవిస్తే, నేను అలసి పోతాను. యిదో తమాషా. కొన్నిసార్లు, సాయంత్రం అయిదు గంటలకే దారుణంగా అలిసి పోయినా, మళ్ళీ ఆరు గంటల వేళకే అంతకు ముందున్న అలసటనంతా మరచి పోతుంటాను. పని ఆరంభించటానికి ఉద్యుక్తమవుతాను...... రాత్రి తొమ్మిది గంటలకు పడుకుని, మళ్ళీ పది కొట్టేసరికి లేచి ఉదయం రెండింటివరకూ పనిచూసుకుంటాను, ఆరోజుపని అంతా పూర్తి చేయడమంటే నాకిష్టం.

అన్ని ప్రాంతాల్లో దొరికే అన్నిరకాల ఆహార పదార్థాలూ నాకిష్టమే. ప్రస్తుతం నేను శాకాహారిని, కాని మరీ బద్ధురాలను కాను. నేనెక్కడికయినా వెళ్ళినప్పుడు, నాకు ఆతిథ్యం యిచ్చే వారికి యిబ్బంది కలిగించలేను. వేసవికాలంలో పండ్లు, పండ్ల సలాడ్‌లు తింటాను. అప్పుడప్పుడు రక్త బలహీనతకు లోనయినప్పుడు మాంసాహారం తింటాను.

విరామ సమయాల్లో గళ్ళనుడికట్టు పూరించడం నా అభిరుచి. పిల్లలతో కాలక్షేపం చేస్తాను. పసివాళ్ళతో. కొంచెం పనికొచ్చే వ్యాపకం ఏదయినా పెట్టుకుంటాను. నిజంగా సమయం దొరికితే స్టాంపుల సేకరణ, క్రూరజంతువులను గురించి, వాతావరణం కలుషితం కావడం గురించి, ప్రకృతి దృశ్యాలను గురించి తెలుసుకోవడం నాకు యిష్టం.

( ఈవ్స్ వీక్లీ సౌజన్యంతో )



## మన సమాజంలో

# మహిళల స్థానం

శ్రీ జలగం వెంగళరావు

ఐక్యరాజ్యసమితి యీ సంవత్సరాన్ని అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా పరిగణించి మహిళాభ్యుదయానికి కృషి చేయాలని ప్రపంచ దేశాలన్నింటినీ కోరింది. స్త్రీ పురుషుల మధ్య సమానత్వం, సామరస్యం పెంపొందించడం, స్త్రీలు దేశాభివృద్ధి కార్యక్రమాల్లో పాల్గొనేందుకు ప్రోత్సాహం యివ్వడం, ప్రపంచ శాంతి సాధన కృషిలో మహిళల ప్రధానపాత్రను గుర్తించడం, యీ ఆశయంలోని ముఖ్యోద్దేశాలు.



అన్ని సమాజాలు, దేశాలు యీ నిర్ణయాన్ని హర్షించి స్త్రీ జనాభ్యున్నతికి అనేక కార్యక్రమాలను అమలు చేస్తున్నాయి. గత శతాబ్దిలో ప్రారంభమైన స్త్రీ సంక్షేమ ఉద్యమం యిప్పుడు పరిపక్వదశకు చేరుకొంది. ప్రస్తుతం మహిళ ఆర్థిక, వైజ్ఞానిక, విద్యా సాంస్కృతిక రంగాల్లో ముందంజ వేస్తోంది. సామాన్యస్త్రీకి సామాన్యపురుషునితో సమాన ప్రతిపత్తిని కల్పించడం స్త్రీ జనాభ్యుదయ ఉద్యమ లక్ష్యం. 1967 నవంబరులో ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ సంఘములో స్త్రీకి జరిగే అన్యాయాలను ఖండిస్తూ "డిక్లరేషన్ ఆన్ ది ఎలిమినేషన్ ఆఫ్ డిస్క్రిమినేషన్ ఎగినెస్ట్ వుమన్" (రిజల్యూషన్ నెం. 2263)ను ఏకగ్రీవంగా ఆమోదించింది. ఇది సంఘ సంస్కరణ చరిత్రలో ఒక మైలురాయి.

ఆదిమసమాజంలో స్త్రీ కుటుంబాధిపత్యం నిర్వహించేదని చరిత్ర చెబుతోంది. ప్రాచీన కాలంలో గార్గి, మైత్రేయి సంస్కృతికి శోభను కూర్చే రీతిగా రాణించారు. అప్పుడు సంఘంలో స్త్రీ స్థానం పురుషుని స్థానంతో సమంగా వుండేది. సమాజంలో ఎన్నో మార్పులు వచ్చాయి. మతాన్ని పెడద్రోవ పట్టించే మూఢనమ్మకాలు, అకృత్యాలు, పురుషుని అహంకారాగ్నికి స్త్రీ ఆహుతికావడం ప్రబలమయ్యాయి. రాజారామ్ మోహన రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, కేశవ చంద్రసేన్, పండిత రమాబాయి, ప్రభృతులు ఎన్నెన్నో ఘోర దురాచారాలను అరికట్టేందుకు కృషిచేసి సఫలులయ్యారు. స్త్రీ సంక్షేమానికి, ప్రగతికి బాటలు వేశారు.

## సంస్కరణ

మన తెలుగునాడులో స్త్రీ జీవితం మెరుగు పరిచేందుకు తన జీవితకాలమంతా వెచ్చించాడు కందుకూరి వీరేశలింగంగారు. బాల్య వివాహాలు, నిర్బంధవివాహాలు నిలుపుదల చేయడం, స్త్రీ విద్య, విధవావివాహాలు, స్త్రీ స్వాతంత్ర్యం ఆయన లక్ష్యాలు.

భారతీయ సంస్కృతి స్త్రీ ఔన్నత్యాన్ని గుర్తించి గౌరవించినా, సంఘంలో స్త్రీస్థానం గూర్చి ఏ తరానికా తరం కొత్త దృక్పథంతో పోరాడాల్సి వస్తోంది. సామాజికంగానూ, ఆర్థికంగానూ మన చుట్టూ పెనవేసుకొనివున్న పరిస్థితుల ప్రాబల్యంవల్ల సమస్యలు పుట్టుకొస్తుంటాయి. దేశాలు, జాతులు, వ్యక్తులు పరస్పరం ఒకరినొకరు అర్థంచేసుకొని, సహజీవనాన్ని ఆమోదించటంవల్ల యీ సమస్యల్ని పరిష్కరించుకోవచ్చు. స్త్రీ జనాభ్యుదయ సమస్య యీనాటిది కాదు. యుగాల తరబడి మానవజాతిని వెంటాడుతోన్నదే. స్త్రీ సంక్షేమం మన మారుతోన్న సాంస్కృతిక విలువల్లో ఒకభాగం. కుటుంబంలో వ్యక్తిగతంగా స్త్రీకి ప్రత్యేక ప్రతిపత్తివుంది. ఈ ప్రత్యేక ప్రతిపత్తికి అర్థం నాలుగుగోడల మధ్య బంధించబడి వుండటంకాదు. వ్యక్తిత్వ ఔన్నత్యం ఆమె యీవలికొచ్చి పనిచేసే ఏ రంగంలోనైనా సరే ప్రతిబింబిస్తూనే వుంటుంది. సోదరిగా, గృహిణిగా, తల్లిగా



అన్నిటికీ మించి "సహనశీలి"గా ఆమె తన సహచరుని కంటే ఒకమెట్టు పైనే వుంటుంది.

## త్రిశంకుస్వర్గం

మారుతోన్న సామాజిక స్థితిగతుల ప్రభావంవల్ల స్త్రీ జనాభ్యుదయానికి ఎన్నో ఆటంకాలు వచ్చాయి. త్రిశంకుస్వర్గంలాంటి మధ్యతరగతి కుటుంబంలో స్త్రీ ఎదుర్కోవాల్సి వస్తోన్న సవాళ్లు అనేకం. గడప దాటివచ్చి తన సంసారాన్ని ఆర్థికంగా ఆదుకొనేందుకు తగిన వాతావరణం యింకా సృష్టించబడలేదు. దశాబ్దాలుగా మధ్యతరగతి స్త్రీలను పట్టి పల్లారుస్తోన్న సమస్యలు-బాల్య వివాహాలు, వరకట్నం, ఆస్తిలో భాగం నిరాకరణ, చిక్కు ప్రశ్నలై నిలిచినవి. యీ దురాచారాలను అరికట్టడానికి ప్రభుత్వం చర్యలను తీసికొంది. అయితే యివి కేవలం శాసనాలద్వారాను, చట్టాల ద్వారాను తొలగిపోయేవికావు. ఏ కుటుంబానికాకుటుంబం యీ సమస్యలను మానవతాదృష్టితో అర్థం చేసుకొని కలిసికట్టుగా పరిష్కరించుకోవాలి. పై తరగతి వారికీ, క్రిందితరగతి వారికీ ప్రభుత్వం చేపట్టిన సంక్షేమ కార్యక్రమాలు ఏదోరూపంలో మేలు చేకూరుస్తూనే వున్నాయి. హరిజన, గిరిజన, దళిత జాతుల స్త్రీలకు, వెనుకబడిన వర్గాల స్త్రీలకు సాధారణ సంక్షేమ కార్యక్రమాలు ప్రణాళికల మూలంగానూ, స్వచ్ఛంద సంస్థల వల్లా అమలులోనికి వస్తున్నాయి. విద్యాలయాలు ఉపాధిసౌకర్యాలు, మహిళా మండలులు, సేవాగృహాలు, అనాథ శరణాలయాలు, వృత్తి శిక్షణ కేంద్రాలు మహిళల స్థానాన్ని మెరుగు పరచడానికి ఎంతగానో వినియోగపడుతున్నాయి. అందకుండా పొందకుండా, ఆర్థికంగా నానాటికీ క్రుంగిపోతోన్న మధ్య తరగతి మహిళకోసం, స్వచ్ఛంద మహిళా సంక్షేమసంస్థలు, గ్రామీణ మహిళా మండలి, సామాజిక అభివృద్ధి కేంద్రాలు, గ్రామీణ వృత్తి శిక్షణ కేంద్రాలు కొంతవరకూ ఆసరాగా వున్నాయి తగిన శిక్షణపొంది అర్హులయినస్త్రీలకు ప్రభుత్వం, బ్యాంకులు, రొక్కం రూపంలోను, వస్తు రూపంలోను, ఉపాధి కల్పన ద్వారాను యిచ్చే సహాయం అందుతోంది.

## పరిశీలనా సంఘాలు

అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా కేంద్రప్రభుత్వం జాతీయ స్థాయిలో ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ అధ్యక్షతన ఒక కమిటీని నియమించింది. దేశంలో మహిళల హోదా పై పరిశీలనకు నియమించబడిన సంఘం నివేదికను సమర్థించగా అది సాకల్యంగానూ, ప్రయోగాత్మకంగాను అమలు చేసే వుద్దేశంతో నిర్దిష్టమైన ప్రతిపాదనలను చేయమని సూచిస్తూ మరోకమిటీ నియామకం జరిగింది.

రాష్ట్ర స్త్రీ, శిశు సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో నిర్వహిస్తోన్న అనాథ శరణాలయాలు, సేవాగృహాలు, బాలవాడీలు అమల్లు చేస్తోన్న కార్యక్రమాలను పరిశీలించి వాటిని మెరుగు పరచేందుకు అభివృద్ధిపరంగా సూచనలను చేయమని నిర్దేశిస్తూ శాసన సభ్యురాలు శ్రీమతి వి. రాజ్యలక్ష్మమ్మ అధ్యక్షురాలిగా, రాష్ట్ర స్త్రీ, శిశుసంక్షేమ శాఖ డైరెక్టరు ప్రధానకార్యదర్శిగా ఒక కమిటీని నియమించడం జరిగింది. సంఘంలో వెలివేయబడిన స్త్రీలకు, పతనమైన వారికి, విధవలకు, దారితప్పిన పిల్లలకు స్త్రీ, శిశు సంక్షేమ శాఖ వివిధ సంరక్షణాలయాలను నిర్వహిస్తున్నది. ఈ శరణాలయాలలో జీవన భృతికి పనికి వచ్చే వివిధ వృత్తులను నేర్పుతారు. శిక్షణ పూర్తయిన తరువాత ఎవరికి వారు స్వశక్తితో జీవితం గడపడానికి ఉపాధి దొరుకుతుంది.

రాష్ట్రంలో స్త్రీ విద్యాభివృద్ధికోసం డా॥ యస్. శ్రీదేవి అధ్యక్షతన ఒక కమిటీ నియమింపబడింది స్త్రీల సమస్యలను పరిష్కరించి, వారి అభ్యున్నతికోసం నిర్మాణాత్మకంగా కృషిచేసే ఉద్దేశంతో మన రాష్ట్రంలో రూ. 10 లక్షల వ్యయంతో ఒక "మహిళా సంక్షేమ సంస్థ"ను స్థాపించేందుకు కృషి జరుగుతోంది.

ఈ అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో మహిళాభ్యున్నతి కోసం ఏర్పడ్డ స్వచ్ఛంద సంస్థలు, యువకులు, సేవా భావంతో కృషిచేసే మహిళా మండలులు అన్ని విధాలా స్త్రీ సంక్షేమం కోసం దీక్షతో పనిచేయాల్సివుంది. మన సాంస్కృతిక సంవత్సరంలో అంతర్జాతీయస్థాయిని జరుపుకొంటూన్న మహిళాభ్యుదయ కార్యకలాపాల్లో మన బాధ్యతను మనమూ నిర్వర్తించుకుంటున్నాం.

---

### గుంటూరులో మహిళల బ్యాంకు

ప్రపంచ మహిళా సంవత్సర కార్యక్రమ సందర్భంగా గుంటూరులో మహిళల కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంకు అవతరించింది. మన రాష్ట్రంలో పూర్తిగా మహిళలు నిర్వహించే బ్యాంకు ఏర్పాటు కావడం యిదే ప్రథమం. ఈ బ్యాంకులో వాటాదార్లు, డైరెక్టర్లు ఉద్యోగులు, ఇతర నిర్వాహకులు అందరూ మహిళలే. పట్టణంలో 116 మంది మహిళలు కలిసి స్వచ్ఛందంగా 35 వేల రూపాయలు వసూలుచేసి పెట్టుబడి సమకూర్చారు. త్వరలోనే 2 లక్షల రూపాయలు షేరు ధనం వసూలుచేయడానికి ప్రయత్నించాలని బ్యాంకు అధ్యక్షురాలు డా. శ్రీమతి విమలాచంద్రయ్య ప్రారంభోత్సవం చేస్తూ సలహాయిచ్చారు.



# ఇద్దరు గాంధీలు

—శ్రీ పి. రంగారెడ్డి
ఆర్థిక, సమాచార శాఖామాత్యులు

నూట ఏడు సంవత్సరాల క్రితం గుజరాతులో అంతగా వూరూ పేరూ లేని పోర్ బందర్ అనే ఓ మారుమూల గ్రామంలో ఒక శిశువు జన్మించాడు. ఏమి జన్మిస్తే? యీ కుర్రవాడు పుట్టడంలో ప్రత్యేకత ఏమిటి? ఏరోజుకారోజు లక్షోపలక్షలు పిల్లలు యీ భూమ్మీద పుడుతూనే వున్నారు కదా కాని యీ కుర్రవాడి పుట్టుకకు ఒక ప్రత్యేకత వున్నది. ఆ బాలకుని జననసంఘటన ప్రపంచంలోని అతి ప్రముఖమైన సంఘటనలలో ఒకటి. మనిషి ఆలోచననూ, మానవజాతి చరిత్రనూ ప్రభావితం చేయడానికి పుట్టిన కారణజన్ముడు ఆ బాలకుడు ఆ బాలకుడు పెరిగి పెద్దవాడై వేసిన అడుగుజాడలు దేశకాలాతీతమైనవి. అవి కాలప్రవాహంలో చెరిగిపోయేవి కావు మనకు గాంధీజీతోపాటు కలిగిన సమకాలీనతా భాగ్యం ఒక అద్భుతమైన సంఘటన. ఎక్కడో పురాణాల్లో విన్నది కాదు ప్రత్యక్షంగా అనుభవించినది ఆయన ఆత్మజ్యోతి దేశకాలాలతో నిమిత్తం లేకుండా యుగయుగాలుగా వెలుగుతూనే వుంటుంది.

గాంధీజీ సందేశానికి ఎల్లలు లేవు. అది సార్వజనీనము, సార్వకాలికము. అన్ని సాంఘిక అసమానతలకు అన్ని ఆర్థిక వ్యత్యాసాలకు ఆయన వ్యతిరేకి గాంధీజీ ఈ యుగంలో జన్మించిన ఒక మహా విప్లవకారుడు. పీడితజన స్వేచ్ఛా ప్రదాత, దరిద్రనారాయణ దాస్యవిముక్తి సంధాత

భౌతిక వాదాన్ని ఆధ్యాత్మిక వాదంతో ముడివేసిన ఒక అపూర్వమైన చింతన ఆయనది ప్రపంచం ఆయన మార్గాన్ని అనుసరిస్తే మనమంతా ఆశిస్తున్న ప్రపంచ శాంతి అచిరకాలంలోనే సిద్ధిస్తుంది అణగారిన ఆర్తుల అభ్యుదయానికి నిరంతరం ఉద్యమస్థాయిలో కృషిచేసి రాజకీయ స్వాతంత్ర్యాన్ని మాత్రమేగాక సాంఘిక విప్లవాన్ని సైతం సాధించిన మహనీయుడు గాంధీజీ. ఆర్థిక సమస్యల పట్లా, ఉపాధి సమస్యలపట్లా మనకున్న దృక్పథాన్నీ, వాటి పరిష్కార మార్గాలనూ విప్లవీకరించిన మహా మనీషి గాంధీజీ

## చైతన్యమూర్తులు

అహింస అంటే సర్వోదయం — సర్వజనులను జాగృతి పరచడం — అని గాంధీజీ భావించాడు గాంధీజీ ప్రవచించిన సర్వోదయ—సర్వ జనోద్ధరణనూ, ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్నీ మించిన సోషలిజం మరోటి లేదు. బాపూజీ జీవితంలో అంతిమ లక్ష్యం భగవంతుని తెలుసుకోవడం. మనం నిజంగా భగవంతుని అనుగ్రహాన్ని సంపాదించాలంటే సృష్టిలో అట్టడుగున వుండిపోయిన దరిద్ర నారాయణుణ్ణి అదుకుని సేవచేయాలని గాంధీజీ బోధించాడు సమైక్యత, సమానత్వం, కష్టపడి పనిచేయడంలో వుండే గౌరవాలపై ఆయనకు అపారమైన విశ్వాసం వుంది అన్ని కులాలు, అన్ని మతాలు, అన్ని జాతులు కలిసిమెలిసి జీవించాలని ఆయన వాంఛించాడు. "మీకొక చిట్కా చెప్తాను సందేహం ఏర్పడ్డప్పుడు యిలా చేసి చూడండి మీరు చూసిన కటిక దరిద్రుడూ దుర్బలుడయినవాని రూపు రేఖలు ఓసారి గుర్తుకు తెచ్చుకోండి. మీరు చేయదలచిన పని యీ వ్యక్తికి ఏమాత్రమైనా ప్రయోజనం కలిగిస్తుందో లేదో మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోండి మీరు చేసే పనివల్ల యీ వ్యక్తికి ఏవిధంగానయినా లాభం జరుగుతుందా? ఈ ప్రశ్నకు సమాధానం మీ సందేహాన్ని నివృత్తి చేస్తుంది" అన్నాడు గాంధీజీ నిర్మాణాత్మక కార్యక్రమం త్రివిధ మార్గాల్లో కొనసాగింది ఖాదీ కార్యక్రమంద్వారా ఆర్థిక పరంగానూ, అస్పృశ్యతా నివారణద్వారా సాంఘికంగానూ మద్యపాన నిషేధంద్వారా నైతికంగానూ కొనసాగింది "ఈ దేశం తమదేననీ, యీ దేశ నిర్మాణ కృషిలో తమకు కూడా శక్తివంతమైన పాత్ర వున్నదనీ దరిద్ర నారాయణులు భావించగలిగే భారతదేశం కోసం, ధనికవర్గం, దరిద్రవర్గం అనే హెచ్చుతగ్గులు లేని భారతదేశంకోసం నేను శ్రమిస్తాను" అన్నాడు గాంధీజీ మరో సందర్భంలో. ఆయన ఆర్థిక సమానత్వం అంటే ప్రతి ఒక్కరూ ఈ లౌకిక వస్తుసంపదను సమానంగా కలిగి వుండడంకాదు

ఉండడానికి యిల్లు, తినడానికి తగినంత పౌష్టికాహారం కట్టుకోడానికి తగినంత ఖాదీ ప్రతి ఒక్కరికీ వుండాలి అదీ ఆర్థిక సమానత్వం అంటే అన్నాడు గాంధీజీ ఈ లక్ష్యసాధనకే మనం కృషిచేస్తున్నాం. దేశాన్ని యీ మార్గంలోనే రూపొందించుకోవానికి శ్రమిస్తున్నాం

## సామాజిక ప్రగతికే వ్యక్తిస్వేచ్ఛ

పనిచేయడంపట్ల గాంధీజీకి అపారమైన నమ్మకం వున్నదనే విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. జీవితం అనేది నిరంతర కార్యక్రమాలతో నిండివుండేదని ఆయన ఉద్దేశం ఈ బాపూ సందేశాన్ని అర్థం చేసుకోవలసిన అవసరం యీనాడు మరింత ఎక్కువగా వున్నది " మానవ నిర్మితాలు కానివ్వండి. దైవనిర్మితాలుకానివ్వండి అన్ని నియమ నిబంధనలకు యిచ్ఛాపూర్వకంగా అంగీకరించేవ్యక్తికి ప్రజాస్వామ్యం దానంతట అదే సంక్రమిస్తుంది. వ్యక్తిగత స్వేచ్ఛకు నేను విలువ యిస్తాను అయితే ఆ వ్యక్తి సంఘంలో వుండాలనే విషయాన్ని మీరు విస్మరించకూడదు సామాజిక ప్రగతికి అనుగుణంగా తన వ్యక్తిత్వాన్ని సర్దుబాటు చేసుకోవడం అలవాటు చేసుకొనే యీనాటి స్థితికి మనిషి ఎదగగలిగాడు మొత్తం సమాజ సంక్షేమంకోసం సంఘానికి ఐచ్ఛికంగా తల ఒగ్గడంవల్ల అటు వ్యక్తికి యిటు ఆవ్యక్తితో కూడిన సంఘానికి ఉభయత్రా లాభదాయకమౌతుంది" అని గాంధీజీ చెప్పిన వాక్కులు ప్రస్తుత పరిస్థితుల్లో మరింత అర్థవంతమైనవి. ఆర్థికంగా, సాంఘికంగా పురోగమించడానికై మన వనరులన్నిటినీ సమీకరించుకొంటున్న ప్రస్తుత అత్యవసర పరిస్థితుల్లో యీ బోధలకు ఒకప్రత్యేకత, ప్రాముఖ్యత వున్నాయి.

గాంధీజీ పైనుండి ఊడిపడినవాడుకాదు. కోట్లాది సామాన్యుల మధ్యనుంచే వారి భాషలో మాట్లాడుతూ, వారి సమస్యలను చర్చిస్తూ, వారి మధ్యనే జీవించి సమున్నతమైన శిఖరాన్ని అధిరోహించారు. ఏకొద్దిమంది ప్రత్యేక వ్యక్తులకోసమో ఆయన శ్రమించలేదు స్వేచ్ఛా భారత దేశం అందించే అవకాశాలను అందుకోవడానికి ప్రజల్లో ప్రతి ఒక్కరికీ సమాన హక్కు వుండాలి మన ప్రధానమంత్రి ప్రకటించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమంలోని మౌలికాంశం కూడా యిదే మనల్ని రాజకీయదాస్యం నుంచి ఒకగాంధీ విముక్తుల్ని చేస్తే మరొకగాంధీ మన ఆర్థిక లక్ష్యాల సాధనకై మనల్ని నడిపించేందుకు తీవ్రంగా కృషిచేస్తున్నారు వారి నిజమైన వారసులమని మనం నిరూపించుకుందాం.



రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఫొటోగ్రఫీ అకాడమీ ప్రథమ ఫెలోషిప్‌ను ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. భగవాన్‌దాస్‌కు బహూకరించారు,

# రాష్ట్రంలో స్త్రీ శిశు సంక్షేమం

శ్రీమతి యం. లక్ష్మీదేవి

( స్త్రీ, శిశు సంక్షేమశాఖ మంత్రిణి )

స్త్రీలలో జాగృతిని కలిగించటం, వారిలో అభ్యున్నతి సాధించటం వారి ఉన్నతికోసం వివిధ పథకాలను నిర్వహించటం స్త్రీ శిశు సంక్షేమశాఖ ప్రధాన లక్ష్యాలు స్త్రీకి, శిశువుకి ఎంతో సన్నిహిత సంబంధం ఉంది. శిశువులకు అవసరమయిన సదుపాయాలను సమకూర్చనిఎడల స్త్రీలకు వారి సంక్షేమానికి సంబంధించిన కార్యకలాపాలన్నీ అసంపూర్ణంగా, అసంతృప్తిగా ఉండిపోతాయి అందుకని ఈ రెండు వర్గాలకు చెందినవారికి సంబంధించిన పథకాలన్నీ స్త్రీ శిశు సంక్షేమశాఖ నిర్వహిస్తుంది

సంఘంలో అగోచరంగా ఉన్న అధర్మాలకు గురై మళ్ళీ ఆ సంఘంచేతనే నీచంగా చూడబడే స్త్రీలను నైతికంగా విపత్కర పరిస్థితిలో ఉన్న స్త్రీలను, తమంతట తాముగా ఆశ్రయం కోరి వచ్చే స్త్రీలను స్త్రీ సదనాలలో చేర్చుకుంటారు ఈ సదనాలలో చేరిన స్త్రీలకు ఉచిత భోజన నివాస సౌకర్యాలను సమకూర్చి వాళ్ళు స్వయంగా బ్రతుకు తెరువు చూసుకోవడానికి అవసరమయిన విద్య లేదా ఇతర సాంకేతిక నైపుణ్యం గడించి మూడేళ్ళ లోపున పునరావాసం పొందేటట్లుచేయడం ఈశాఖ నిర్వహిస్తున్న ఈ సంస్థల యొక్క ముఖ్యలక్షణం ఒక్కొక్కప్పుడు తగిన సంబంధాలు కుదిరితే సదనాల్లో వివాహాలుచేసి వారు సంఘంలో గౌరవంగా బ్రతుక గలిగే పరిస్థితులను కలిగిస్తారు ఇలాంటి సదనాలు మొత్తం రాష్ట్రంలో నాలుగు నెలకొల్పబడ్డాయి. రాజమండ్రి, కర్నూలు, హైదరాబాదు, మహబూబునగరులలో ఉన్నాయి ఈ సదనాలలో గ్లాసు యాంపుల్స్ తయారీ, కవరు కాగితం సంచుల తయారీ, రెడీమేడ్ దుస్తుల తయారీ, ధర్మామీటర్ల తయారీ, రెక్జిన్, జనపనార సంచుల తయారీ, నవారునేత, వెదురుఫేమ్ పనులు, తుంగచాప అల్లిక మొదలగు వృత్తి శిక్షణా కేంద్రాలను నిర్వహిస్తున్నారు వీటిని నిర్వహించటంకోసం తగిన సాంకేతిక సిబ్బందిని కూడా నియమించారు.

## సేవా సదనాలు

ఈ సదనాలలో దిక్కులేని స్త్రీలను, నిస్సహాయులైన వితంతువులను, భర్తల అనాదరణకు గురయిన వాళ్ళను పతనానికి, ఆత్మహత్యకు దారితీసే పరిస్థితులలో చిక్కుకొనిఉన్న స్త్రీలను చేర్చుకొంటారు వీటిలో చేరిన స్త్రీలకు సామాన్యవిద్యగాని, సాంకేతిక విద్యగాని మూడేళ్ళపాటునేర్పించి సంఘంలో నలుగురితోపాటు గౌరవంగా జీవించడం కోసము జీవనోపాధిని కల్పిస్తారు లేదా తగిన వరుడు కుదిరితే వివాహం జరిపించి పంపిస్తారు ఈ సదనాలలో చేరిన స్త్రీలకు ఉచిత భోజన, నివాస సౌకర్యాలతోపాటు అన్ని ఏర్పాట్లు ఉచితంగా కలిగిస్తారు వీటిలో 18–35 సంవత్సరాల మధ్య వయస్సు గల స్త్రీలను చేర్చుకుంటారు, వీటిలో



చేరినవారు మూడేళ్ళు ఉండి విద్య నేర్చుకోవచ్చు షెడ్యూల్డు జాతులు, షెడ్యూల్డు తెగలకు చెందిన స్త్రీలు మాత్రం అయిదు సంవత్సరాలు ఉండవచ్చును ఈ సేవా సదనాలలో తల్లులతోపాటు రెండేళ్ళలోపు పిల్లలను కూడా చేర్చుకుంటారు ఇలాంటి సదనాలు రాష్ట్రంలో ఐదు నెలకొల్పబడ్డాయి ఇవి హైదరాబాదులోను, వరంగల్లులోను, అనంతపురం, కన్నాపురం, విజయవాడలలో ఉన్నాయి



ఈ సేవా సదనాలలో బుక్‌బైండింగ్, అట్టపెట్టెల తయారీ, తోలు పరిశ్రమ, గ్రాఫు శిక్షణ కార్డుబోర్డుల తయారీ, బనియన్లు, మేజోళ్ళతయారీ, బొమ్మల తయారీ మొదలగు సాంకేతిక విద్యలలో శిక్షణ గరుప బడుతుంది. వీటిని నిర్వహించటంకోసం తగిన సాంకేతిక సిబ్బందినికూడా నియమించారు.

## వృత్తి శిక్షణా కేంద్రాలు

మధ్యతరగతి కుటుంబాలకు చెందిన బాలికలు చాలామంది, కనీస విద్యార్హతలు సంపాదించిన మీదట అంటే ఎస్. ఎస్. సి కాని మెట్రిక్ గాని, పదవ తరగతిగాని పాస్ అయాక అటుపై చదువులకు పోలేక, ఇటు ఉద్యోగాలు సంపాదించలేక సందిగ్ధావస్థలో ఉండిపోతున్నారు. అలాంటి బాలికలకోసం ఈ కేంద్రాలు నిర్వహించబడుతున్నాయి. ఈ కేంద్రాలలో చేర్చుకోబడిన బాలికలకు టైపు, షార్టుహాండు, బ్యాంకింగ్, ఎకౌంటెన్సీ మొదలగు వృత్తులలో శిక్షణ యిస్తారు. ఒక్కొక్క కేంద్రంలో 30 మంది విద్యార్థినులను చేర్చుకుంటారు. కుటుంబంయొక్క ఆర్థిక పరిస్థితి బాగుగాలేని 20 బాలికలకు 30/- రూ. చొప్పున స్టయిపండు యిచ్చి వాళ్ళకోసం హాస్టళ్ళను పెట్టి భోజన, నివాస సౌకర్యాలను కలిగిస్తారు. మిగతా పది మంది రోజూ కేంద్రానికి వచ్చి ఉచితంగా శిక్షణపొంది ప్రభుత్వ పరీక్షలకు వెళ్ళవచ్చు ఇలాంటి కేంద్రాలు రాష్ట్రంలో ఏడుచోట్ల ఉన్నాయి. అవి హైదరాబాదు, వరంగల్లు, శ్రీకాకుళం, ఏలూరు, కడప, కర్నూలు, అనంతపురములలో నెలకొల్పబడ్డాయి.

ఈ కేంద్రాలలో స్త్రీలకు, బాలికలకు కుట్టుపని నేర్పించి సాంకేతిక అర్హతలను పొందిన మీదట పూర్తి కాలిక ఉద్యోగినులుగా నియమించబడటానికి అవసరమయిన మేరకు నైపుణ్యం పొందటానికి తగు శిక్షణ యివ్వబడుతుంది. ఇందులో చేరిన వారికి ఒక్కొక్కరికి 25/- రూ. చొప్పున స్టయిఫండు యిచ్చి భోజన, నివాస సౌకర్యాలను హాస్టళ్ళద్వారా కల్పిస్తారు. ఒక్కొక్క కేంద్రములో 50 మంది బాలికలు ఉండటానికి వసతి కల్పించబడింది. ఇలాంటి కేంద్రాలు మొత్తం రాష్ట్రంలో రెండు వున్నాయి. ఒకటి హైదరాబాదులోను మరొకటి కడపలోను

## వృద్ధ స్త్రీల సదనం

స్త్రీలూ, బాలికల కోసమేకాకుండా జీవితంలో ప్రశాంతంగా కాలం గడపటం తప్ప చేసేదేమీలేని, దిక్షతలేని వృద్ధ స్త్రీల కోసము కూడా ఒక సదనాన్ని ఈ శాఖ నిర్వహిస్తుంది ఈ సదనం చిత్తూరులో నెలకొల్పబడింది. దీనిలో 50 మంది వృద్ధ స్త్రీలను చేర్చుకోవడం కోసం వసతి కల్పించబడింది. నెలకు ఒక్కొక్కరికి 40/- రూ. చొప్పున మంజూరు చేయబడుతుంది ఈ సదనం ఆ జిల్లా స్త్రీ సంక్షేమాధికారిణి ఆధ్వర్యంలో నిర్వహించబడుతుంది.

తెలంగాణాలోని అన్ని జిల్లా ముఖ్య పట్టణాలలో ఈ కేంద్రాలను నెలకొల్పారు. ఒక్క హైదరాబాదులో తప్ప మిగతా ఎనిమిది జిల్లాలలో ఉన్నాయి. మధ్యతరగతి స్త్రీలు వారి తీరిక సమయాలలో బట్టలు కుట్టి వేతనాలు సంపాదించటం కోసం ఏర్పాటు చేయబడ్డాయి. ఉద్యోగ కల్పన ప్రధానోద్దేశంగా ఈ పథకం క్రింది ఎనిమిది కేంద్రాలను ప్రారంభించటం జరిగింది. ఈ కేంద్రాలలో ప్రభుత్వ శాఖలనుంచి, ఇతర సంస్థల నుంచి యూనిఫారం దుస్తులు కుట్టటానికి ఆర్డర్లను సేకరించి స్త్రీలచేత కుట్టించి వారికి తగిన వేతనాలు చెల్లిస్తారు.

## ఉద్యోగినుల హాస్టళ్లు

అన్ని దశల్లో ఉన్న స్త్రీల కోసం సదుపాయాలను కల్పిస్తున్న ఈ శాఖ ఉద్యోగాలు చేస్తూ తగిన నివాస సౌకర్యాలు లేక పట్టణాల్లో ఉండే స్త్రీల కోసం రెండు వసతి గృహాలను నిర్వహిస్తుంది. ఒకటి హైదరాబాదులోను మరొకటి విశాఖపట్టణంలోనూ ఉన్నాయి. ఒక్కొక్కగదిలోను స్థలాన్ని బట్టి ఇద్దరు లేక ముగ్గురికి వసతి ఏర్పాటు చేయబడుతుంది. ప్రతి ఒక్కరికి ఒక మంచము, వస్తువులను పెట్టుకోవడం కోసం ఒక కొయ్య బీరువా ఏర్పాటుచేయబడతాయి. వారికి ఉదయం ఫలహారం, టీ లేదా కాఫీ, మధ్యాహ్నం భోజనం, సాయంత్రం టీ, రాత్రి భోజనం యివ్వబడతాయి. ప్రతి హాస్టలులోను 50 మంది ఉద్యోగినులకు వసతి యేర్పాటు చేయబడింది. ఉద్యోగినుల నుంచి తగిన మొత్తాన్ని వసూలు చేస్తారు.

ఈ గృహాలలో నైతికంగా పతనం చెందిన స్త్రీలను చేర్చుకుంటారు. వ్యభిచార నిర్మూలన చట్టం 1956 క్రింద కోర్టు ద్వారా శిక్ష పొందిన స్త్రీలను ముఖ్యంగా ఈసదనాల్లో చేర్చుకొంటారు. వీటిలో చేరిన స్త్రీలకు కుట్టు మొదలైన చేతి పనులు నేర్పిస్తారు. వారు తిరిగి మామూలు జీవితాన్ని నడుపుకునేందుకు తగిన విధంగా తీర్చిదిద్దబడతారు. వారి వసతి భోజనాదులకై ఒక్కొక్కరికి 40/- రూ. మంజూరు చేయబడింది. అయిదవ పంచవర్ష ప్రణాళిక క్రింద ఇలాంటి సదనాలు రెండు–ఒకటి హైదరాబాదులోనూ మరొకటి విజయవాడలోనూ నెలకొల్పబడ్డాయి.

## స్త్రీ సంక్షేమ శాఖలు

ఈ సెంటర్లు స్త్రీ సంక్షేమ శాఖలోని ప్రాథమిక సంస్థలుగా పరిగణింప బడుతున్నాయి. ప్రతి సెంటరులోనూ ఒక్కొక్క ఆర్గనైజరు ఉంటారు. ప్రతిదినం ఈ సెంటర్లలో ఉదయంపూట ప్రి–బేసిక్ తరగతిని నిర్వహిస్తారు. తరువాత ఆర్గనైజరు ఆ గ్రామంలోని గృహాలను సందర్శించి స్త్రీలకు తగిన సలహాలను యిచ్చి వారి సమస్యలను వీలైనంతవరకు పరిష్కరిస్తారు. మధ్యాహ్నం పూట స్త్రీలకు ఈ సెంటర్లలో కుట్టుపని, ఎంబ్రాయిడరీ, విస్తళ్ళు కుట్టటం మొదలగు చేతి పనులు నేర్పిస్తారు ఆ తర్వాత వయోజనులకు విద్య గరుపబడుతుంది. వీలుని బట్టి స్త్రీలకు పరిశుభ్రత, కుటుంబనియంత్రణ, గర్భిణీ స్త్రీలకు సలహాలు, బాలింతలు తీసుకోవలసిన జాగ్రత్తల గురించి చిన్న చిన్న చికిత్సలతోపాటు తగిన సలహాలను కూడా ఆర్గనైజరు యిస్తారు. స్త్రీలకు ప్రసవ సమయాలలో సహాయపడటానికి సలహా నివ్వటానికి సెంటర్లలో కొన్నిటిలో ఒక మంత్రసాని ఉంటుంది.

ఈ శాఖ ప్రభుత్వ పరంగానే కాకుండా మహిళా సమాజాలకు గ్రాంటు రూపంలో ధన సహాయం చేస్తుంది. ప్రతి సంవత్సరం

స్త్రీ సంక్షేమం కోసం కుటీర పరిశ్రమలను నిర్వహిస్తున్న మహిళా సమాజాలకు గ్రాంట్లు యివ్వటం కోసం ఒక లక్ష రూపాయలను కేటాయించారు.

## బాలల కోసం పథకాలు

ప్రభుత్వం ఎలిమెంటరీ స్థాయిలోనూ, హయ్యర్ ఎలిమెంటరీ స్థాయిలోనూ విద్యాబోధన ఉచితంగా జరుపుతున్నప్పటికీ ఆ అవకాశాన్ని వినియోగించుకోలేని పిల్లలెందరో పల్లెల్లోనూ, పట్టణాల్లోనూ ఉన్నారు. వాళ్ళ తల్లిదండ్రులు పేదలవటం చేత వాళ్లను బడికిపంపకుండా తమతో పాటే పనిపాటలు చేయడం కోసం తీసుకొని వెళుతుంటారు. లేదా ఇంటి జాగ్రత్త కోసం చిన్న పిల్లలను సంరక్షించటం కోసం పెద్ద పిల్లలను బడికి పంపకుండా వినియోగిస్తుంటారు.

అలాంటి నిర్భాగ్యులైన పిల్లల కోసం ఈ బాల సదనాలు నిర్వహించబడుతున్నాయి. ఈ సదనాలలో ఆరునుంచి పదహారు సంవత్సరాలవయస్సు గల బాలికలను చేర్చుకుంటారు. బాలికలకు 16 సంవత్సరములు వచ్చే వరకు ఈ సదనాలలో ఉంచి వారికి ఉచిత భోజనం, నివాసం బట్టలు అన్నీ సమకూర్చి ప్రభుత్వ పాఠశాలలో చేర్పించి చదువు చెప్పిస్తారు. ఎస్.ఎస్.సి., హెచ్.ఎస్.సి. లేదా పదవ తరగతి వరకూ చదువు చెప్పిస్తారు. ఇలాంటి సదనాలు రాష్ట్రంలో మొత్తం 42 నెలకొల్పబడ్డాయి. ఒక్కొక్కరికి 40/- రూపాయల చొప్పున ప్రభుత్వం భోజన ఖర్చుల కోసం మంజూరు చేసింది. మిగతా ఖర్చులకు కూడా కావలసిన మొత్తాన్ని సమకూరుస్తుంది.

ఈ శాఖ నిర్వహిస్తున్న 42 బాల సదనాలలో మంచి మార్కులతో పాస్ అయిన బాలికల కోసం రెండు కళాశాల సదనాలను నెలకొల్పారు. బాల సదనాలలో హెచ్.ఎస్.సి. గాని పదవ తరగతి గాని పాసయిన బాలికలను ప్రతిభ ప్రాతిపదికపై చేర్చుకొని వారిని కళాశాలలో చేర్పించి ఉచితంగా బి. ఏ. వరకు చదువు చెప్పిస్తారు. ఈ సదనాలలో ఉండటానికి గడువు అయిదు సంవత్సరాలు లేదా బాలికలకు 22 సంవత్సరముల వయస్సు వచ్చే వరకు ఉంచుతారు. ఇలాంటి సదనాలు రెండు తెరువ బడ్డాయి. ఒకటి హైదరాబాదులోను మరొకటి తిరుపతిలోనూ.

బాలల కోసం కాకుండా శిశువుల కోసం కూడా ఈ శాఖ శిశు సంరక్షణా కేంద్రాలను నిర్వహిస్తుంది. అయిదు సంవత్సరాల లోపు వయస్సు గల పిల్లలను ఈ కేంద్రాలలో ఉంచి వారికి మధ్యాహ్న భోజనం, పాలు యిస్తారు. తల్లి దండ్రులు పనులకు వెళ్ళినపుడు, పెద్ద పిల్లలు చదువులకు వెళ్ళినపుడు ఈ శిశువులను సంరక్షించడానికి ముఖ్యంగా ఈ కేంద్రాలు నిర్వహించబడుతున్నాయి. ఇలాంటి కేంద్రాలు, రాష్ట్రంలో మొత్తం 46 ఉన్నాయి. ఒక్కొక్క కేంద్రంలో 30 శిశువులను చేర్చుకోవటం కోసం వసతి ఏర్పాటు చేయబడింది. ఒక్కొక్క శిశువు కోసం 20/- రూ. కేటాయించారు.

## బాల విహారాలు

ఈ కేంద్రాలలో పిల్లల వినోద, సాంస్కృతిక, మనో వికాసానికి అవసరమైన ఆటపాటలు నేర్పిస్తారు. పాల సరఫరా కేంద్రం వారు ఉచితంగా యిచ్చే పాలను ఈ పిల్లలకు యిస్తారు. ఈ సౌకర్యం కొన్ని కేంద్రాలలో మాత్రమే ఉంది.

1975 సంవత్సరాన్ని అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా పరిగణించాలని ఐక్య రాజ్య సమితి నిర్ణయించింది. ఐక్య రాజ్య సమితి నిర్ణయించిన తీర్మానాల కనుగుణంగా భారత ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు కొన్ని సూచనల నిస్తూ ఈ సంవత్సరములో చేయవలసిన కార్య కలాపాలను గురించి, నిర్వహించ వలసిన పథకాల గురించి వివరాలు తెలుపుతూ ఉత్తర్వులు జారీచేసింది.

ఈ సంవత్సరం ఆశయాలను నెరవేర్చుట కోసం ఈ క్రింది సూత్రాలను పాటించాలని నిర్ణయించారు.

"దేశం యొక్క సంపూర్ణ అభివృద్ధి, ప్రపంచం యొక్క శ్రేయస్సు ముఖ్యంగా ప్రపంచ శాంతి, స్త్రీ పురుషుల సంపూర్ణ సహకారాల మీద ఆధారపడి ఉన్నాయి."

మన రాష్ట్రంలో అంతర్జాతీయ మహిళా సంవత్సర ప్రారంభోత్సవం 16-2-75 న జూబిలీ హాలులో చాలా మంది స్త్రీ పురుషుల సమావేశంలో జరిగింది. రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రారంభోత్సవం చేశారు.

ఈ సంవత్సరంలో జరగవలసిన కార్యకలాపాలను, నిర్వహించవలసిన పథకాలను రూపొందించి అమలు పరచటంకోసం ప్రభుత్వం రాష్ట్ర స్థాయిలోనూ, జిల్లాస్థాయిలోను, బ్లాకుస్థాయిలోనూ, కమిటీలనుఏర్పాటు చేసింది. ఈ కమిటీలు ఏర్పాటయి వారి వారి స్థాయిలలో చేయవలసిన కార్యక్రమాలను ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారము నిర్ణయిస్తాయి. రాష్ట్ర స్థాయి సంఘంలో ముఖ్య మంత్రి ఛైర్మన్‌గాను, స్త్రీ శిశు సంక్షేమ మంత్రిణి వైస్ - ఛైర్మన్ గాను, స్త్రీ శిశు సంక్షేమ శాఖ డైరెక్టరు గారు కన్వీనరుగాను, అందరు రాష్ట్ర శాసన సభ్యురాండ్రు, పార్లమెంటు స్త్రీ మెంబర్లు, కౌన్సిలు మెంబర్లు మెంబర్లుగా ఉన్నారు. ఈ సంఘం ఈ సంవత్సరం చాలా సార్లు సమావేశమై నిర్వహించవలసిన కార్యక్రమాలను రూపొందించింది.

జిల్లా స్థాయిలో నియమించిన కమిటీలో జిల్లా కలెక్టరు గారు ఛైర్మన్‌గాను, జిల్లా పరిషత్తు ఛైర్మను వైస్-ఛైర్మన్ గాను, మిగతా ఆఫీసర్లు, శాసన సభ్యురాండ్రు మెంబర్లుగాను ఉంటారు.

బ్లాకు స్థాయిలోని కమిటీలో పంచాయతీ సమితి ప్రెసిడెంటు ఛైర్మన్‌గాను, బి.డి.ఓ., ఇంకా తదితర ఆఫీసర్లు, మెంబర్లుగాను, స్త్రీ శిశు సంక్షేమ శాఖ విస్తరణాధికారి కన్వీనరుగాను, ఉంటారు. ఇంకా మిగతా అనధికార మెంబర్లు నలుగురుంటారు.

## ఉపాధి సౌకర్యాలు

ఈ సంవత్సరంలో డ్రస్సుమేకింగ్ సెంటర్లలో ట్రయినింగు అయిన స్త్రీలకు సర్టిఫికెట్లను పంచి పెడతారు. షెడ్యూలు కులాలకు చెందిన స్త్రీలకు, వెనుకబడిన తరగతులకు చెందిన స్త్రీలకు కుట్టు మిషన్లు పంచిపెడతారు. వయోజన విద్య గరకినిడా తగిన సెంటర్లను స్థాపించి స్త్రీలకు ఉచితంగా

పలకలు, బలపాలు, పుస్తకాలు, పెన్సిళ్లు యిస్తారు. స్త్రీలకు పాడి పశువులను, గొర్రెలను, కోళ్లను పంచి పెడతారు. ముగ్గులు, ఎంబ్రాయిడరీ, పరిశుభ్రత మొదలగు వాటిలో పోటీలు నిర్వహించి బహుమతులు యివ్వటం మొదలగు కార్యక్రమాలను నిర్వహించాలని నిశ్చయించారు. వీటికోసం కావలసిన మొత్తాన్ని 5% జనరల్ రెవెన్యూలోంచి ఖర్చు పెడతారు.

ఈ సంవత్సరము మార్చి నెల నుంచి డిసెంబరు నెల వరకు జరపబడు కార్యక్రమాల పట్టికను రూపొందించారు. ఆకాశవాణి ద్వారా కొన్ని కార్యక్రమాలను నిర్వహించాలని నిశ్చయించారు. అన్నిటి కన్న ముఖ్య ప్రచార సాధనమైన ఆకాశవాణి ద్వారా చర్చలు, ప్రసంగాలు ఈ సంవత్సర ప్రాముఖ్యతను గురించి తెలుపుతూ ఏర్పరచబడ్డాయి.

ప్రతిభ ప్రాతిపదికపై ఎన్నికయిన మహిళా సమాజాలకు అవార్డు లివ్వాలనీ, జిల్లాస్థాయిలో వ్యాస రచన పోటీలు నిర్వహించాలనీ, రాష్ట్ర స్థాయిలో కూడా వ్యాస రచన పోటీలు నిర్వహించాలనీ, పట్టణ ప్రాంతాలలో పే చేసే క్రెషీలను స్థాపించాలనీ, స్కూలు కెళ్ళే బాలికల కోసం పే చేసే హాస్టళ్ళను తెరవాలనీ, వృద్ధుల కోసం కుటీరాలను నిర్వహించాలనీ, స్త్రీల సహకార ఆర్థిక సంస్థను స్థాపించాలనీ, స్త్రీ శిశువుల ఇంటిగ్రేటెడ్ ప్రాజక్టు ప్రారంభించాలనీ నిర్ణయించబడినది.

పై వివరించిన విధముగా ఈ అంతర్జాతీయ మహిళా సంవత్సరము యొక్క ముఖ్యోద్దేశాలను, తదితర కార్యక్రమాలను మారుమూల గ్రామాలకు కూడా విస్తరింప జేయాలని ఎంతో మెలకువతో కార్య క్రమాలనురూపొందించి సక్రమముగా నిర్వహించమని ఆయా స్థాయిల కమిటీలను కోరటమైనది.

ఈ సందర్భంలో కొంత మంది కోరిక మీద ముఖ్య మంత్రి గారు స్త్రీల అభ్యున్నతికి, స్త్రీల ఆర్థికోన్నతికి కార్పొరేషను ఒక దానిని స్థాపించారు. దాని నిర్వహణ కోసము 10 లక్షలు కేటాయించారు. ఈ డబ్బుతో స్త్రీల ఆర్థిక పరిస్థితిని పెంచటం కోసమూ, స్త్రీల సంక్షేమం కోసము కొన్ని కుటీర పరిశ్రమలను, చేతి పనులను ఎన్నుకొని వాటి కోసం ఆర్థికసహాయం యివ్వాలని నిశ్చయించబడింది. అలాంటి వాటిలో కుట్టుపనులు, కిరాణా కొట్టు, పాడి పశువులు, బాతుల పెంపకం, మందుల షాపు, కొవ్వొత్తుల తయారీ, కాగితపు సంచుల తయారీ, బొమ్మల తయారీ, వక్క పొడి తయారీ, జరీ, ఎంబ్రాయిడరీపని, కోళ్ళ పెంపకము, పెరటితోటల పెంపకము, టీ కొట్టు, ఊరగాయల తయారీ, కట్టెల కొట్టు, బొగ్గుల కొట్టు, పళ్లూ కూర గాయల కొట్టు, సేమియాల తయారీ, టైపు ఇనిస్టిట్యూట్, మొదలగు చేతి పనులకు 20 శాతం ఈ కార్పొరేషను యిస్తుంది. మిగతా 80 శాతం బ్యాంకులద్వారా అప్పుగా మంజూరు చేస్తారు.



# ఉజ్వల సమాజం

## అడవికొలను పార్వతి

లోకమంతా మెచ్చినా
భర్త మెచ్చని ఆడది
లోకానికి వెలి, సంఘానికి బలి
తల్లికీ తండ్రికీ బరువు
ఆమెకి ఆదరణే కరువు
భర్త మరణిస్తే
హృదయ విదారకంగా ఏడుస్తున్న ఆడదాన్ని
కాళ్ళూ చేతులూ కట్టేసి
సజీవంగా మంటల్లో పడవేసిన
ఘోరమైన మనుష్యులం మనం!
ఈ వేళ సజీవ దహనాలు లేవు
కానీ మనస్సును దహించి వేస్తున్న కాపురాలు అసంఖ్యాకం!
శృంగారాన్ని ఆశించి
దాంపత్యంలో అడుగు పెట్టిన సుదతికి
అంగారం ఎదురైతే
ఆ మంటల నుంచి రక్షణ సంకో
న్యాయస్థానానికి పరుగిడితే
ఆత్మ గౌరవానికి హాని కల్గించే ప్రశ్నలతో
నిలువునా దహించి వేస్తారు —
వివాహం చేస్తే
ఆడ పిల్ల బరువు తీరిందనుకున్న తల్లి దండ్రులు
స్త్రీకి ఆస్తి, చదువు
అనవసరం అనుకునే సామాజికులు
భర్త వదిలేసిన స్త్రీ
వ్యర్థం అనుకునే సంఘం
భార్యా భర్తలు విడిపోవడం
మహానేరం అనుకునే సమాజం
మారాలి—మారాలి
న్యాయమైన ప్రజాకోర్టులు
సరిపడని దాంపత్యాన్ని సులువుగా పరిష్కరించాలి
భవిష్యదుజ్వల స్త్రీ పురుష సమతా సమాజంకోసమే
పోరాడాలి!



# అఖిల భారత స్థాయిలో మహిళోద్యమం

కె. లక్ష్మీ రఘురామయ్య

భారతదేశంలో మహిళోద్యమాన్ని నిజానికి పురుషులే ప్రారంభించారు. రాజారామ్ మోహన్‌రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంటి మేధావులూ, దూరదృష్టిగల విజ్ఞులూ సంఘంలో దురాచారాలు, మూఢనమ్మకాలు మొదలైన వాటిమీద ధ్వజం యెత్తారు. ఈ ఆచారాలు, నమ్మకాలు భారతీయ సమాజాన్ని పట్టి పీడించి, స్త్రీని పురుషుడికీ, సమాజానికీ బానిసను చేశాయి. వీరు అతి నిశితంగా విమర్శించి ప్రతిఘటించిన దురాచారం 'సతీసహగమనం'.

మహమ్మదీయ దండయాత్రల కాలంలో హిందూస్త్రీలలో ప్రారంభమైన యీ సతీసహగమనాచారం అంతకంతకూ దిగజారి బ్రిటిష్ పాలన కాలానికి మరీ జుగుప్సాకరంగా తయారయింది. హిందూ సంస్కృతిని గురించీ, హిందూస్త్రీల పాతివ్రత్య ధర్మాన్ని గురించీ తెలియక బ్రిటిష్‌వారు సతీసహగమనానికి హాస్యాస్పదమైన నిర్వచనాలు యిస్తూ వచ్చారు. యీ గడ్డమీద మహమ్మదీయులు దండయాత్రలు చేసే రోజుల్లో హిందూ స్త్రీలు మాత్రమే తమ మానాన్ని రక్షించుకోడానికి సతీసహగమనం అవలంబించేవారు. అప్పటి స్త్రీలు శత్రువుల కబంధహస్తాల్లో చిక్కి మానభంగం పొందడం కన్నా భర్త చితిమీద పడి మరణించడమే మేలనుకునేవారు. యుద్ధసమయాల్లో యిలాంటి ఆచారాలు ప్రపంచమంతటా మామూలే. యీ సతీసహగమనం విరోధుల బారి నుండి కాపాడుకొనే కవచం మాత్రమే. కాలం గడిచేకొద్దీ, యిది ఉత్తర హిందూ దేశంలో ఒక ఆచారంగా మారింది. విజేతల చేతుల్లో పడే అవకాశం గల విధవ స్వయంగా తనంతట తానే భర్త చితిమీద పడి మరణించాలని ప్రజలు భావించే పరిస్థితి వచ్చింది. కాని బ్రిటిష్‌వారు వచ్చిన తరువాత నెమ్మదిగా విరోధుల క్రూరకృత్యాల భయం తీరి, విధవలు భర్త శవాలమీద పడి మరణించడం మానుకున్నారు. యీ సంధి కాలంలోనే, బలహీన హిందూసమాజంలో ప్రాంతీయంగా ఆచారమైన సతీసహగమనాన్ని పట్టుకువేళ్లాడుతూ, శత్రువుల పశుత్వం బారి నుండి స్త్రీలను రక్షించలేక యీ బాధ్యత విస్మరించి భర్తల చితులమీద మసయి మరణించే విధవల్ని గురించి గప్పాలు కొట్టే



వారు; వాళ్ళు సిగ్గు లేకుండా, యిహమంటే యీ లోకంలో పాతివ్రత్యం పాటించడమనీ, పరం మరోలోకంలో పొందే మోక్షమనీ, స్త్రీలను కల్లబొల్లి కబుర్లతో ఊరడించి మభ్యపెట్టేవారు. రాజారామ్ మోహన్‌రాయ్ యీ విపరీతధోరణిని చీదరించుకుని యీ దురాచారం మీద విరుచుకుపడ్డారు. మహిళల్ని సంఘంలో వెనక్కునెట్టి పతనానికి గురిచేస్తున్న యిట్లాంటి మూఢాచారాల మీద దాడి ప్రారంభించారు. దేశంలో మహిళ విముక్తికి యిది నాంది. ఇంతలో 1829లో సతీసహగమన నిరోధ చట్టం దేశమంతటా మహిళోద్యమం కోసం సంచలనాన్ని తెచ్చిపెట్టింది. దాడులు చాలా తక్కువ జరిగిన దక్షిణ హిందూదేశంలో సతీసహగమనం లేకపోయినప్పటికీ భర్తలను కోల్పోయిన స్త్రీలు చాలా ఆచారాలకు గురికావలసివచ్చింది. విధవలు తలలు గొరిగించుకొని ఏ పురుషుడూ తమకేసి కామంతో కన్నెత్తి చూడకుండా వికారంగా వుండాల్సి వచ్చేది. భర్త మృతిచెందిన స్త్రీలకు శరణాలయాలు ప్రారంభించి వీరేశలింగం పంతులుగారు ఉద్యమం లేవనెత్తారు. నెమ్మదినెమ్మదిగా యీ ఉద్యమం విధవా పునర్వివాహ ఉద్యమంగా ప్రబలింది. ఈ దశలోనే ఆర్యసమాజం, బ్రహ్మసమాజం భర్త మృతినొందిన స్త్రీల గురించి, విధవా పునర్వివాహాల గురించి, బాల్యవివాహం గురించి సంఘసేవకుల ప్రజల ఆలోచనా విధానంలో ఓ చిన్న విప్లవం తేవడానికి తోడ్పడ్డాయి.



రాజారామ్ మోహన్‌రాయ్ తరువాత ఈశ్వరచంద్ర విద్యాసాగర్, పండిత రమాబాయ్, రానడే, మహర్షి కార్వే, శ్రీమతి అనిబిసెంట్, బరోడా మహారాణి చిమ్నాబాయి మొదలయినవారు ముందుకు వచ్చారు. స్త్రీలను బాధించిన సాంఘిక దుర్బలతలనన్నింటినీ రూపుమాపడానికి వీరంతా దీక్షతో కృషి చేశారు. 19వ శతాబ్ది చివరిలో సాంఘిక సమస్యలు జాతీయ ఉద్యమంతో పెనవేసుకు పోయాయి. స్త్రీలూ పురుషులూ ఉజ్వల దేశభక్తితోనూ, సాంఘిక దురాచారాల సంకెళ్ళను తెగ్గొంపే ప్రగాఢ వాంఛతోనూ చేయీ, చేయీ, భుజంభుజం కలిపి స్వాతంత్ర్య సంపాదనకోసం ముందుకు ఉరికారు. మహాత్మాగాంధీ, గోఖలే, తిలక్ స్వాతంత్ర్య జైత్ర యాత్రలో విజయభేరి మ్రోగించారు ఇంతటి మహనీయులు కాకున్నా దేశభక్తిలోనూ, త్యాగనిరతిలోనూ వీరికి తీసిపోని వారెందరో ప్రతి రాష్ట్రంనుండి ముందుకొచ్చి నిర్దిష్ట లక్ష్యంకోసం వీరికి అండగా నిలిచారు. చాలాకాలం ఉద్యమ పోరాటం సాగించిన తరువాత యితర దేశాల్లో స్త్రీలు సాధించిన దానిని మనదేశపు మహిళలు స్వాతంత్ర్యం రావడంతో సాధించారు. రాజ్యాంగం స్త్రీకి ఓటు హక్కు, సమానత్వం ప్రసాదించడంతో ఆమె హోదాలో విశేషమైన మార్పు వచ్చింది. కాని అహింసాయుత జాతీయ ఉద్యమం మాత్రం విదేశీ పాలకులమీద, సాంఘిక దురాచారాల మీదా సలిపిన సుదీర్ఘమైన పోరాటం. స్వాతంత్ర్యానంతరం రాజకీయ సర్దుబాట్ల వలెనే సంఘ పునర్నిర్మాణం కూడా కష్టతరమైనదే.

## స్త్రీలకోసం శాసనాలు

1947లో భారతదేశం స్వాతంత్ర్యం సాధించింది. 1949 నవంబర్ 26న స్త్రీలూ పురుషులు ఒక రాజ్యాంగాన్ని రూపొందించుకున్నారు. దీనిలో పౌరులందరికీ కుల, మత, వర్గ, స్త్రీ, పురుష విచక్షణ లేకుండా సమాన హక్కులూ, హోదా కల్పించబడ్డాయి స్వాతంత్ర్యానంతరం పురాతన హిందూ న్యాయవిధానంలో ఎన్నో సంస్కరణలను ప్రవేశపెట్టడంలో డాక్టర్ అంబేద్కర్, శ్రీ బెనిగల్ నర్సింగ్‌రావు గణనీయమైన పాత్ర వహించారు. కొత్త శాసనాలను రూపొందించే విషయంలో శ్రీ బెనిగల్ నర్సింగ్‌రావు బాధ్యత వహిస్తే వాటిని అప్పటికి న్యాయశాఖమంత్రిగా వున్న డాక్టర్ అంబేద్కర్ బిల్లులుగా రూపొందించి తొలి కష్టదశలనుండి దాటించడానికి బాధ్యులయ్యారు. రెండు దశాబ్దాల పాటు స్త్రీ విముక్తి కోసం ఉద్యమం సాగించిన అఖిలభారత మహిళల మహాసభ, నేషనల్ కౌన్సిల్ ఫర్ ఉమెన్ ఎన్నో సంస్కరణలు, శాసనాలు రావడానికి కృషి చేశాయి. వీటిలో 1955లో వచ్చిన హిందూకోడ్ బిల్ మొదటిది. ఆ తరువాత వెనువెంటనే హిందూ వివాహ చట్టం (1955), హిందూ సక్సెషన్ ఏక్టు (1956), హిందూ ఎడాప్షన్ అండ్ మైన్‌టెనెన్స్ ఏక్టు (1956), హిందూ మైనారిటీ అండ్ గార్డియన్‌షిప్ ఏక్టు (1956), వరకట్నాల నిషేధ చట్టం (1956), సప్రెషన్ ఆఫ్ ప్రాస్టిట్యూషన్ అండ్ ఇమ్మోరల్ ట్రాఫిక్ ఏక్టు (1956) టెర్మినేషన్ ఆఫ్ ప్రెగ్నెన్సీ (1971) వచ్చాయి. ఈ బిల్లులతో హిందూస్త్రీ హోదాలో ఎంతో మార్పు వచ్చింది.

హిందూ స్త్రీలు గాంధీజీకి ఎంతో ఋణపడి వున్నారు. విదేశీపాలననుండి స్వాతంత్ర్యం పొందడానికే కాక, సాంఘిక దురాచారాల బారినుండి దేశాన్ని రక్షించడంలోకూడా గాంధీజీ ఎనలేని సేవ చేశారు. పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ చెప్పినట్లుగా అద్భుతమైన వ్యక్తి, గొప్ప విప్లవకారుడు గాంధీజీ ప్రేరేపణవలన మన స్త్రీలలో ఘనమైన పరిణామం వచ్చింది. వారందరూ తమ యిండ్లువిడిచి దేశ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. స్వాతంత్ర్యం తరువాత గాంధీజీ తన శక్తి యుక్తులనూ సమయాన్నీ, స్త్రీ జాతిని పునరుద్ధరించడానికి వెచ్చించేవారు. గాంధీజీ స్త్రీలను పురుషులతో సమానంగా భావించడం మాత్రమే కాదు, ఎన్నోవిధాల వారి కంటె గొప్పవారుగా భావించేవారు. "స్త్రీలను అబలలనడం వ్యక్తి నింద, ఇది స్త్రీల పాలిట దారుణమైన అన్యాయం. బలాన్ని పశుబలంగా పరిగణిస్తే స్త్రీ పురుషునికంటె బలహీనురాలే. కాని బలం నైతిక శక్తిగా గుర్తింపబడిననాడు స్త్రీ పురుషునికన్నా ఎన్నోరెట్లు గొప్ప అనే విషయం విశదమవుతుంది". అన్నారు గాంధీజీ.

## పెద్ద పదవులలో...

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత స్వతంత్రులయిన భారత దేశపు మహిళలు తాము బాధ్యతలను గుర్తించగలమని, హక్కుల కోసం తాము జరిపే పోరాటం న్యాయసమ్మతమైనదనీ ప్రపంచానికి చాటిచెప్పారు. స్వాతంత్ర్యం సిద్ధించిన సమయానికల్లా భారత దేశపు నైటింగేల్ అని కీర్తింపబడిన శ్రీమతి సరోజినీ నాయుడు ఒక రాష్ట్రంలో గవర్నరు పదవి నిర్వహిస్తున్నారు. రాజకుమారి అమృత్‌కౌర్ మన పెద్ద ప్రజాస్వామ్య వ్యవస్థలో కేంద్ర కేబినెట్ మంత్రిణిగా కీలకమైన పదవిని చేపట్టారు. శ్రీమతి విజయలక్ష్మి పండిట్ రాయబారిగా నియమితులయ్యారు. ఆమె ఐక్యరాజ్య సమితికి అధ్యక్షురాలుగాను, రష్యా, అమెరికా, ఇంగ్లాండులలో భారత రాయబారిగాను పనిచేసి విశ్వ విఖ్యాతిని పొందారు. రాజకీయాలనుండి, ప్రజాజీవితంనుండి విరమించేనాటికి ఆమె మహారాష్ట్ర గవర్నరుగా పనిచేశారు.

## అక్షరాస్యత

స్వాతంత్ర్య భారతదేశంలో అక్షరాస్యత వృద్ధి పొందించే కార్యక్రమం అనుకున్నంతగా విజయం పొందలేదు. 1971 జనాభా లెక్కల ప్రకారం దేశంలో 18.44 శాతం మహిళలే అక్షరాస్యులు. పురుషుల్లో అక్షరాస్యత 39.41 శాతం. కొన్ని ప్రాంతాల్లో, బీహార్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్‌లో కొంతభాగంలో మహిళల అక్షరాస్యత యిప్పటికి 7 నుండి 9 శాతం వరకు మాత్రమే వుంది. దేశం మొత్తానికి అక్షరాస్యుల సంఖ్య 29.34 శాతం మాత్రమే. ఇది చాలా శోచనీయమైన విషయం. ఉన్నతవిద్య, విశ్వ విద్యాలయాల స్థాయిల్లో విద్యార్థి విద్యార్థినుల మధ్య గల సంఖ్యాభేదం యిప్పటికీ ఎక్కువగానే వుంది. 1955-56 లో కళాశాలలో సాధారణ విద్య నభ్యసించేవారిలో విద్యార్థులు 100 మంది వుంటే విద్యార్థినులు 13 మంది మాత్రమే వుండేవారు. 1960-61 నాటికి యీ విద్యార్థినుల సంఖ్య 17 కు పెరిగింది. 1965-66 లో 25 మందికి పెరిగింది. ప్రస్తుతం కళాశాలల్లో నూరుమంది

విద్యార్థినులు వుండే విద్యార్థినులు 33 మంది వున్నారని తెలుస్తోంది. ఈ విద్యార్థినుల సంఖ్య తక్కువగా వున్నప్పటికీ ఆ సంవత్సరానికా సంవత్సరం బాలికలు మార్కులు తెచ్చుకోవడంలో అగ్రగణ్యులు కావడం ముదావహం.

పట్టణ పరిసర ప్రాంతాలలోని కార్యాలయాలలోనూ, ఉపాధ్యాయ వృత్తిలోనూ, నర్సులుగాను, ఉపాధ్యాయినులుగాను స్త్రీలు పనిచేయడం చాలా అధికమైంది. ఐ ఏ. ఎస్ లో విశ్వవిద్యాలయాల్లో తెలివి తేటలుగలవారు ఎక్కువగా ఉత్తీర్ణులవుతున్నారు. సివిల్ సర్వీసులో యిపుడు చాలామంది ప్రతిభగల మహిళలు పని చేస్తున్నారు. స్వాతంత్ర్యం తెచ్చిన కొత్త తూగుతో అనేక రంగాల్లో వాణిజ్యం, వస్తునిర్మాణం, ఎడ్వర్టయిజింగ్, పౌర సంబంధాలు మొదలయిన శాఖల్లో పనిచేసేందుకు, తగినన్ని రకాల ఉద్యోగాలు వుండగా స్త్రీలు ఉద్యోగాలు చేయడంపట్ల ఏర్పడే చిన్నచూపు ఎక్కువగా ఆర్థిక పరమయినదే కాని సాంఘిక పరమైంది కాదు.

## స్త్రీ పురుషులకు సమాన వేతనం

గ్రామీణ ప్రాంతాల్లో స్త్రీలు వ్యవసాయ దారులుగాను, పొలాల్లో కూలీలుగాను పనిచేస్తున్నారు. వీరి సంఖ్య చాలావరకు స్థిరంగా వుంది.

మొత్తం పనిచేసే స్త్రీల సంఖ్యలో 1971 జనాభా లెక్కల ప్రకారం 28 శాతం మంది వ్యవసాయదారులు; మరో 46 శాతం మంది వ్యవసాయ కూలీలు. ఆ విధంగా, పనిచేసే మహిళల్లో 74 శాతం మంది వ్యవసాయ రంగంలోనే పనిచేస్తున్నారు. కాని, గృహ పరిశ్రమల్లోను, చేనేత, బుట్టల అల్లకం, ధాన్యం దంపుడు, తేనెటీగల పెంపకం వంటి వృత్తులను చేపట్టిన మహిళలు పారిశ్రామికీకరణ, ఆధునిక మార్కెటింగ్ పద్ధతుల మూలంగా కాబోలు— రానురాను మరీ తక్కువైపోతున్నారు. పురుషులతో సమానంగానూ, వ్యవసాయరంగంలో విత్తనాలు నాటడం, పంటకోతల వంటి విషయాల్లో పురుషులకంటె అధికంగానూ పనిచేయగలిగినా స్త్రీలకు, పురుషులకంటె తక్కువ వేతనాలు యివ్వడం చాలా విచారకరం. దేశమంతా అన్నిరాష్ట్రాల్లోనూ వేతనాలలో స్త్రీ పురుషుల మధ్య యీ విచక్షణ చూపుతున్నారు. ఈ విచక్షణ మామూలు వ్యవసాయాల్లోనే కాదు. తేయాకు, రబ్బరు, కాఫీ వంటి తోట కార్మికుల విషయాల్లో కూడా స్త్రీలకు పురుషులకంటె తక్కువగానే యిస్తున్నారు. ఎందుకని స్త్రీలు సవాలుచేస్తే, 'అది అలా వాడుకలోవుంది' అని తేలిగ్గా కొట్టిపారేస్తారు. సంస్థల్లో పని చేసే కార్మిక మహిళలకు ప్రసూతి కాలంలో సెలవు సౌకర్యం, పని వేళల్లో వారి శిశువుల ఆలనాపాలనా మొదలయిన సదుపాయాలిస్తున్నప్పటికీ సామాన్య వ్యవసాయ కూలీలకు యివేవీ అందుబాటులో లేవు. ఐక్యరాజ్యసమితి, కృషికి తగిన కూలీ చెల్లించాలని నిర్దేశించినట్లుగానే, కనీస కూలీరేటును నిర్ణయించి చెల్లిస్తున్న విషయం వాస్తవమే.

## శాసనాల ప్రయోజనం

సాంఘిక రంగంలో స్వాతంత్ర్యానంతరం వచ్చిన చట్టాలు చాలావరకు శాసన గ్రంథాల్లోనే వుండిపోయాయనిపిస్తుంది. కట్నం నిషేధం బిల్లులో, వ్యభిచార నిర్మూలన చట్టంలో అనేక లోపాలు ఉన్నాయి. అందువల్ల అవి సమర్థవంతంగా అమలు జరపడానికి వీలేకపోతుంది. ప్రజలు యీ చట్టాలను ఆశ్రయించి ప్రయోజనం పొందినప్పుడే వీటికి ఒక అర్థమంటూ ఏర్పడుతుంది. ఇంచుమించు బాల్య వివాహాలు కనుమరుగైపోయాయి. అయితే అక్కడా అక్కడా వెనుకబడిన ప్రాంతాల్లో బాలికలపై పురుషుల అత్యాచారాలు యింకా కొనసాగుతూనే వున్నాయి. 1955 సంవత్సరపు హిందూ వివాహచట్టం అమలులోకి వచ్చిన తర్వాత అనేక విడాకులు, పునర్వివాహాలు జరిగినప్పటికీ విడాకులు యిచ్చిన స్త్రీకిగాని, పునర్వివాహం చేసుకున్న స్త్రీకిగాని సంఘంలో యింకా గౌరవం లభించడంలేదు. విడాకులిచ్చిన భార్యాభర్తల విషయంలో సంఘం యింకా విచక్షణ చూపిస్తూనేవుంది. విడాకులిచ్చిన భార్యకు సంఘంలో చిన్నచూపు తప్పడంలేదు. అత్యాధునిక సభ్య ప్రపంచంలో యీ ధోరణి లేకపోయినా గ్రామీణ ప్రాంతాల్లో మాత్రం యింకా విడాకులిచ్చిన స్త్రీపట్ల గౌరవభావం ప్రదర్శించబడడం లేదు 1965 సంవత్సరపు హిందూ వారసత్వపు చట్టంవల్ల కొడుకులతో పాటు కూతుళ్ళకు కూడా తల్లిదండ్రుల ఆస్థిలో భాగం పొందే హక్కుపొందిన మాట నిజమేగాని అయితే ఆ భాగం పురుషులతో సమానంగా లేదు.

పెద్దలు కుదిర్చిన పెళ్ళి సంబంధాలు యింకా సాగుతూనే వున్నాయి. ఉమ్మడి కుటుంబాలు విడిపోయి చిన్నచిన్న కుటుంబాలు అయ్యాయి. కాని స్వాతంత్ర్యానంతరం హిందూదేశంలో సాంఘికంగా పెద్దమార్పు అత్తాకోడళ్ళ బాంధవ్యంలో వచ్చింది. ఉమ్మడికుటుంబం మళ్ళీ తలఎత్తుతోందనడానికిది చిహ్నం. చిన్న చిన్న కుటుంబాలు, కులాంతర, మతాంతర వివాహాలు సర్వసాధారణమౌతున్నాయి. ఉన్నత వర్గాల్లో యింకా మగవాడి ఆధిక్యత, అజమాయిషీ చెల్లుతూనే వున్నాయి. గర్భస్రావం చట్టబద్ధం కావడంతో స్త్రీలకు వెసులుబాటు కలిగింది. ఆరోగ్యం మెరుగైంది. పెళ్ళికాని తల్లులు యింకా అరుదు. వయస్సు మళ్ళిన వారికి శరణాలయాలు కనబడవు. ఉమ్మడి కుటుంబాలున్నంత కాలం స్త్రీలకు, వయస్సు మళ్ళిన వారికి రక్షణ వుంటుంది.

## జాతీయోద్యమంలో మహిళలు

గతంలో కీర్తిగన్న జిజియాబాయి, అహల్యాబాయి, హోల్కర్, ఝాన్సీలక్ష్మీబాయి, రజియా సుల్తానా, చాంద్‌బీబీ, రాణీ రుద్రమ, మల్లమ్మ, కన్నగి—వీరే దేశంలో కొంచెం ఆశాజనకమైన దృక్పథంగల స్త్రీల కంటికి కనిపించేవారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత రోజుల్లో మన దేశపు ప్రజాజీవితంలో నిర్ణయాలు రూపొందించే స్వతంత్రంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకునే స్త్రీలు లేనేలేరు, ఉన్నా చాలా అరుదుగా వున్నారనే చెప్పవచ్చు. స్వాతంత్ర్యానికి పూర్వమే మనదేశంలో డా. అనిబిసెంట్ 1917లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ అధ్యక్షురాలుగా వుంది. అనిబిసెంట్ వలెనే సిస్టర్ కజిన్స్‌కూడా భారత దేశాన్ని మాతృదేశంగా భావించి స్త్రీ విద్యకోసం తన జీవితకాలమంతా కృషిచేసింది. అఖిలభారత మహిళల కాన్ఫరెన్సును స్థాపించినవారిలో ఆమె కూడా ఒకరు. ఇలాగే సిస్టర్ నివేదిత

రామకృష్ణ మిషన్ కార్యక్రమాలకు ఎంతో తోడ్పడింది. సరోజినీ నాయుడు, కమలాదేవి ఛటోపాధ్యాయ, అరుణా అసఫాలీ, దుర్గాబాయి, హంస్ మెహతా, ముత్తులక్ష్మిరెడ్డి, స్వరణ్ కుమారి గంగూలీ, భికాజీగామా, సరళాదేవి, లేడీ నీలకాంత్, లక్ష్మిమీనన్, రాధాబాయ్, సుబ్బారాయన్ మొదలైన ఎంమందితో ప్రసిద్ధ మహిళలు జాతీయోద్యమంలో కీలకమైనపాత్ర వహించారు. వీరిలో జీవించి వున్న కొంతమంది స్వాతంత్ర్యానంతరం దేశ నిర్మాణానికి సేవ చేస్తూనే వున్నారు. స్వాతంత్ర్యానంతరం ప్రజాజీవితంలోనూ, రాజకీయాల్లోనూ స్త్రీలు పాల్గొనడానికి యిబ్బంది ఏమీ ఎదురవ్వలేదు. అయితే వయోవృద్ధుల్లోనూ, యువతరంలోనూ కూడా ఇటీవల ఒకరకమైన నిస్తేజభావం కమ్ముంది. స్వాతంత్ర్యానంతరం హెచ్చు సంఖ్యలో మహిళలు ప్రజాజీవితంలోనూ, రాజకీయాల్లోనూ పాల్గొనాలని భావించడం అసమంజసం ఏమీకాదు. కాని పరిశీలించి చూస్తే యీస్థితి మనకు కనిపించదు. రాష్ట్ర శాసనసభలకు ఎన్నికయిన సభ్యుల్లో మహిళలు మూడు నుండి అయిదు శాతం మాత్రమే వున్నారు. పార్లమెంటు సభ్యుల్లో 5 నుండి 7 శాతం వరకు మాత్రమే స్త్రీలువున్నారు. కాని బాధాకరమైన విషయమేమిటంటే 1952లో ఎన్నికలు ప్రారంభమైనప్పటి నుండి శాసనసభలకు, పార్లమెంటుకూ ఎన్నికయిన మహిళాసభ్యుల సంఖ్య క్రమేణా తగ్గిపోతూ వచ్చింది. సంఖ్యలు యీ దిగువ తెలిపిన విధంగా వున్నాయి.

| సంవత్సరం | రాష్ట్ర శాసన సభ | లోక సభ | రాజ్యసభ | మొత్తం సభ్యులు |
|---|---|---|---|---|
| 1952 | 80 | 23 | 19 | 42 |
| 1957 | 195 | 27 | 23 | 50 |
| 1962 | 167 | 33 | 23 | 56 |
| 1967 | 97 | 32 | 20 | 52 |
| 1971 | 154 | 25 | 17 | 42 |

చాలవరకు రాజకీయ పార్టీల్లో పార్టీ నాయకత్వం పురుషుల అధీనం క్రిందనే వుంది. సమర్థత వున్న మహిళలు ఎన్నికలకు నిలబడడానికి యిష్టపడక పోవడమే దీనికి కారణం కావచ్చు. అందుచేత, రాజకీయాల్లో స్త్రీలకు తక్కువ ప్రాధాన్యత వుండడానికి కారణం స్త్రీలు రాజకీయాలకు విముఖులుగా వుండడమే.

## అఖిల భారత మహిళల మహాసభ

భారతదేశంలో విముక్తి ఉద్యమంలో స్వచ్ఛంద సంస్థల పాత్ర తక్కువయినదేం కాదు. మహిళల జాతీయ కౌన్సిల్, అఖిల భారత మహిళల మహాసభ స్త్రీలను విద్యావంతులను చేయడంలోనూ నాయకత్వానికి ఉన్ముఖులను చేయడంలోనూ మేటిపాత్రవహించాయి. అఖిల భారత మహిళల మహాసభ విస్తృతమైన తన అనేకానేక శాఖలతో త్యాగమూర్తులైన, విధేయులైన కార్యకర్తల తోడ్పాటుతో భారత దేశంలో మహిళావుద్యమ చరిత్ర అంటే అఖిలభారత మహిళల మహాసభ చరిత్రే అన్నంత గొప్పగా సేవ చేసింది. స్వాతంత్ర్యానంతరం ఈ ఉద్యమానికి ప్రభుత్వ ప్రోత్సాహం కూడా పుష్కలంగా లభించింది. ప్రథమ ప్రధానమంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ దూరదృష్టి అభినందనీయమైనది. స్ఫూర్తితో పనిచేసే శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ నాయకత్వంతో కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డును ఆయనే స్థాపించారు. యీ సంస్థలు గ్రామీణ, పట్టణ పరిసరాల స్థాయిలో నాయకత్వం వహించే మహిళలెందరికో శిక్షణ నిచ్చాయి. మన దేశంలో సాంఘిక సమత, భావ సమైక్యతలను సాధించడంలో అఖిలభారత మహిళల మహాసభ చేసిన కృషి సాటిలేనిది.

భారత దేశంలో మహిళోద్యమం గణనీయమైన లక్ష్యాలను చేరుకొని లబ్ధిపొందింది. కాని నిస్తేజానికి తావిచ్చే వీలు లేదు మనం యింకా ఎన్నో మైళ్ళు ముందుకు పోవాలి ఢిల్లీలో 1973 జవహర్‌లాల్ నెహ్రూ స్మారక ఉపన్యాసాల్లో ప్రపంచ ప్రసిద్ధి చెందిన ఆంత్రోపాలజిస్టు శ్రీమతి మార్గరెట్ మీడ్ ప్రసంగించారు. ఆమె—పేరుపడినచిన్న కుటుంబాల పద్ధతి ప్రయోగత్మకంగా విఫలమైంది కనుక వెనుకటి ఉమ్మడి కుటుంబాలు మళ్ళీ మొదలుచేయడం సాధ్యం కాకపోతే మహిళలు తమ శక్తి సామర్థ్యాలను వినియోగించి సమిష్టి మిశ్రమ కుటుంబాలునడుపుకోవడం ఒక్కటే సమాధానం, భార్య పని చేయడం అత్యంత లాభదాయకమైంది. వివాహాలు కష్టతరమైనవి, లైంగికాతీతర సంబంధాలు మనకు అవసరం—అన్నారు.

విభిన్న వర్గాలవారూ, విభిన్న ఆలోచనలవారూ ఏం చెప్పినప్పటికీ భారతీయస్త్రీ తనంతట తానుగా ధైర్యాన్ని పుంజుకుని స్వీయ విముక్తికి పూనుకొంటే భారత స్త్రీ జాతికి స్వేచ్ఛ ప్రసాదించగలదు.

---

## పాఠక లేఖ

ఆర్యా! నమస్కృతులు. 'ఆంధ్ర ప్రదేశ్' సంచిక చదువుతున్న పాఠకులలో నేనొకరిని. ప్రభుత్వం ఈ పత్రికను ఏర్పఱచి, రాష్ట్రాన్ని గురించి క్షుణ్ణంగా తెలిసికొనేందుకు, నెలనెలా రాష్ట్ర విశేషాలు విపులంగా తెలిసికొనేందుకు అవకాశాన్ని కలిగించారు. అంతేకాకుండా ఆయా విషయాల గురించిన చిత్రాలను ప్రచురించి, నాలాంటి ఉపాధ్యాయినికి, రాష్ట్రాన్ని గురించిన పాఠాలు, విద్యార్థినులకు సులభతరంగా బోధించేందుకు అవకాశాన్ని కల్పిస్తున్నారు. ఇంతగా ఉపయోగపడుతున్న 'ఆంధ్రప్రదేశ్', పత్రికలలో తలమానికంగా విలసిల్లుతూంది.

రామిశెట్టి లక్ష్మీకాంతమ్మ,
26, నాగమణి గార్డెన్ వీధి, మద్రాసు-1.

నాడు - నేడు

# స్త్రీలు - రాజకీయ చతురత

డాక్టర్ నాయని కృష్ణకుమారి

స్త్రీలూ, రాజకీయాలూ అనగానే రెండు పరస్పర విరుద్ధ విషయాలను కలబోసినట్లుగా ఎవరైనా అనుకోవడం సహజమే. స్త్రీ రూపం అతి ప్రాచీన కాలంనుండీ ఒక విధంగా నిర్దేశింపబడది. ఆవిడ అన్ని కళలకూ ఆలవాలం. ఆవిడ శరీరం కోమలం; భాషణలో మృదుత్వం, చూపుల్లో చాంచల్యం, చేతుల్లో నాజూకుదనమూ, సరళతా! అడుగు కదిపితే లాలిత్యం, పెదవి విప్పితే మాధుర్యం. ఇంత ఆకర్షణీయమైన రూపంతో వినయ సమ్మతమైన చరిత్రతో విరాజిల్లే స్త్రీ ఈ తత్త్వానికి పూర్తిగా వ్యతిరిక్తమైన రాజకీయ తత్త్వంతో ఐక్యాన్ని సాధిస్తుందని చెప్పడం కష్టమేకదా! అందుకే ఈ రంగంలో ప్రవేశించి రాణించిన స్త్రీలు నాడూ నేడూ కూడా, ప్రపంచ వ్యాప్తంగా చాలా తక్కువ. ఆ సంఖ్య ఎప్పుడూ వేళ్ళ మీద లెక్క పెట్టదగిన సంఖ్య.

సాధారణ సూత్రానికి అపవాద సూత్రం ఎప్పుడూ ఉంటుంది. ఈ రంగం కాఠిన్యానికీ, బలానికీ, కార్యదీక్షకూ, చొరవకూ ఆలవాలమైన పురుష శ్రేణికి మాత్రమే చెందిందన్న అభిప్రాయానికి ప్రతిగా, ఇందులో కొందరు స్త్రీలు నాడూ నేడూ కూడా చొరవగా చొచ్చుకొని వచ్చిన వారున్నారు. వాళ్ళల్లో స్త్రీ సహజమైన లాలిత్యానికి చోటుంటుందో, లేదో, అన్నది వేరే విషయం. పైన నాడూ నేడూ అనడం వల్ల కాలపరిమితిని స్థూలంగా రెండు భాగాలుగా చేయడానికి వీలుంది. కాని ఆ రెండింటికీ ఎల్లలు సునిశ్చితంగా నిర్దేశించడానికి వీలుండదు. నాడు అంటే మనకు తెలియని, మనం అనుభవించని సుదూరమైన కాలం అనేకదా అర్థం చెప్పుకోవాలి! అటువంటి కాలంలో, ఒకప్పుడు సజీవంగా మని, చరిత్ర పుటల్లో స్ఫుటత్వాన్ని పొంది, నిలిచి పోయిన వారు కొందరైతే, పాంచభౌతిక శరీరంతో ఈ భూ శరీరంమీద అవతరించారో లేదో తెలిసి రాక, కేవలం పుస్తకాల్లో పాత్రలుగా మిగిలే వారు కొందరుంటారు. ఈ రెండు తెగలూ మనకు కావలసినవే.

ఇందులో ఈ రెండవ తెగకు చెందిన స్త్రీలు, రాజకీయ చాతుర్యాన్ని వెల్లడి చేసే కావ్యగత పాత్రలు మాత్రమే. ఆ పాత్రలైనా మనకున్నవి తక్కువే.

## మహాభారతం ఉదంతం

ఉదాహరణకు భారతంలో ద్రౌపది – ఈవిడ ఐదుగురు భర్తలకు ఒద్దికైన భార్య. ఆ భర్తలతో పాటు అష్ట కష్టాలనుభవించిన అభిమానవతి. వాళ్ళతో అడుగడుగునా కష్ట ప్రయాసలలో తాననుభవించిన అనుభవాల సారం ఆవిణ్ణి రాజకీయ వేత్తగా మార్చివేయగలిగింది. కౌరవులతో యుద్ధం వద్దనుకుని ఐదూళ్ళ రాయబారానికి సిద్ధమై భర్తలున్న అదనులో, వాళ్ళను యుద్ధోన్ముఖుల్ని చేయడానికి ఆవిడ చూపించిన చాతుర్యం మరువరానిది. అట్లాగే రామాయణంలో తార, భాగవతంలో సత్యభామ తమ భర్తల రాజకీయ జీవితాలతో చిక్కని అనుబంధం కలవారే. ప్రపంచ సాహిత్యంలో హెలెన్, క్లియోపాత్రాలవంటి రాజకీయ ప్రాధాన్యం కలిగిన పాత్రలు అరుదు.

ఇక మొదటి తెగకు చెందిన చారిత్రిక స్త్రీలను లెక్కింపజూచినా, వాళ్ళు సంఖ్యలో తక్కువే. ఈ పరిగణనలోనికి ప్రపంచ వ్యాప్తంగా దేశాలేలిన మహారాణులు ముందు రావలసి ఉంటుంది. ఇంగ్లండు దేశంలో సుభిక్ష పరిపాలనం సాగించి, తనయుగాన్ని స్వర్ణయుగంగా మలచిన స్త్రీ ఎలిజబెత్ మహారాణి. ఈవిడ కాలంలోనే, చిన్న దీవియైన బ్రిటన్, నౌకాయానాలు నేర్చుకుని, కొత్త ప్రదేశాల్ని కనుక్కొని, వలస విధానానికి నాందీవాచనం పలికింది. అట్లా సమర్థురాలైన మరొక మహారాణి విక్టోరియా.

ఇంకొక స్త్రీ రష్యాదేశాన్ని ఏలిన కేథరిన్ ది గ్రేట్—ఈవిడ పరిపాలన ఆదేశపు చరిత్ర పుటల్లో బంగారు అక్షరాలలో వ్రాయదగ్గది. ఈ విడ ఆధ్వర్యంలోనే రష్యా క్రిమియాను గెల్చుకుంది. నల్ల సముద్రంలోకి రష్యన్ నౌకాదళం ప్రవేశాన్ని పొందగలిగింది. ఈవిడ తనకాలంలో అన్ని వర్గాల జనానికీ న్యాయం కలిగి తీరాలన్న పట్టుదలతో అహర్నిశలూ శ్రమించింది. దేశంలో కాలువలు తవ్వించడం ద్వారా నీటిపారుదల సౌకర్యాలను ఎక్కువ చేసింది. రష్యన్ ఎకాడమీని స్థాపించింది. ఎన్నో విధాలుగా తన మాతృ



భూమిని అభివృద్ధి పథాల వైపుకు తీసుకుపోయే పథకాలను, కొందరు స్వార్థపరులకు కష్టం కలుగుతున్నా సరే, వారు తన మీద ఆగ్రహం తెచ్చుకుంటున్నా గానీ, చేపట్టి విజయవంతంగా నిర్వహించింది. ఆవిడకు కూడా తనచుట్టూ ఉన్న తన మనషుల నిర్లక్ష్య జీవన వసతీ, వైఖరీ, ఆలోచనా రహితమైన అడ్డంకుల కల్పనలూ, అద్భుతగులుతుండేవి. ఆవిడ కల్పించ దలచుకున్న అభ్యుదయకర ప్రణాళికలను సాగనిచ్చేవి కావు. అయినా ఆవిడ సాహసి. ధైర్యశాలిని. అందువల్లనే 'ది గ్రేట్' అనిపించుకోగలిగిన అర్హతను సంపాదించుకుని చరిత్రలో అజరామరంగా నిలిచిపోగలిగింది. చరిత్రాధ్యయనం చేసే అందరికీ వీరు ప్రసిద్ధ వ్యక్తులే.

ఇక మన దేశ చరిత్ర యొక్క వెనకటి పుటల్లో రాజ్య చక్రాలు తిప్పిన రమణీ మణులు లేక పోలేదు.

## కదన రంగంలో వీర నారి

ఝాన్సీ పాలకురాలు లక్ష్మీబాయిని ఎరగని వారెవరు? తమ రాజకీయాల్లో పరప్రభుత్వ ప్రమేయానికి ఎదురు నిలిచి పసికందును వెన్నున కట్టుకుని కత్తి ఝళిపిస్తూ కదన రంగంలో కురికిన ధీరనారి ఆవిడ. ఆవిడ కాలంలో సంస్థానాధిపతులు, ఈస్టిండియా కంపెనీ వారి దుర్భేద్యమైన పన్నుగడలవల్లో ఈగల్లా చిక్కుకుని విల విల తన్నుకుంటూండగా నేనున్నానని ముందుకురికి తెల్లవాళ్ళకు ప్రతిఘటనను చవి చూపగలిగిన ధైర్యవంతురాలు. అదేవిధంగా చాంద్ బీబీ, రజియా సుల్తానా వంటి వీర వనితలు తమ తమ దేశ రాజకీయాలకు జీవితాలను అంకితం చేసిన వాళ్ళు.

తెలుగు దేశంలో పన్నెండో శతాబ్దంలో ఒక రాజకీయవేత్త ఉద్భవించింది. ఆవిడే నాయకురాలు నాగమ్మ. ఆవిడ రాజకీయాలలో పాల్గొనడం వల్ల తెలుగు దేశానికి మేలు జరిగిందో, కీడు జరిగిందో అని విచారించడం కాదిక్కడ ప్రధానాంశం. అపర బ్రహ్మ లాగా చతుర రచనా నైపుణిని అలవర్చుకుని, ఆనాటి సామంత రాజమండలిని ఒక గొడుగు కిందికి తెచ్చే ప్రయత్నంలో అరితేరిన చేయిగా ప్రశంస లందుకున్న బ్రహ్మ నాయుడికి నాయకురాలు సరి ఉజ్జీ. అతడు వేసిన ఎత్తులన్నిటికీ ఆవిడ ఎదురెత్తులు వేసింది. అతణ్ణి బోనులో పెట్టిన పులికి మల్లే వివశుణ్ణి చేసి ఆడించింది. తన రాజకీయ పాండిత్యాన్ని తెలుగు దేశంలో ప్రదర్శించింది.

నాగమ్మ విషయంలో ఫలితా ఫలితాలను మనం బేరీజు వేయలేం కాని, కాకతి సామ్రాజ్య చక్ర ప్రవర్తనా నిపుణురాలు రాణి రుద్రమదేవి విషయంలో ఆపని చేయవచ్చును. తెలుగు పాలకులను, ముఖ్యంగా కాకతీయులను పీడించే ఇతర రాజమండలికి ఈవిడ వీరోచిత పరిపాలన గుండె బెదురును కల్పించ గలిగింది. ఓరుగంటిని కబళించడానికి యాదవ రాజులు ఎత్తిరాగా, వాళ్ళ వీమె గోదావరి వరకూ తరమ గలిగింది. అంతేకాక వర్తక వాణిజ్యాలను పెంపొందించడం, దేశంలో శాంతిభద్రతలు నెలకొల్పడం. ఈమె ధ్యేయంగా ప్రవర్తించింది. అందువల్లనే సముద్రాలు 'దాటి మన దేశానికి వచ్చిన విదేశీయాత్రికులు, ఈవిడ పరిపాలననూ, సమర్థతనూ మనస్ఫూర్తిగా ప్రశంసించ గలిగారు. కేవలం ఆడది అనే చులకన భావంతో తనవాళ్ళు తన క్రింది వాళ్ళు తిరుగుబాట్లు చేయగా అన్నిటినీ ఆవిడ అణచి వేసింది. తనదీ అనే ముద్ర కలిగిన పరిపాలనా విధానం చేత అందరినీ లొంగదీసుకున్నది. రాణి రుద్రమ వంటి రాజకీయ చాతుర్యం కలిగిన స్త్రీలు అరుదు. అటువంటి వాళ్ళను భవిష్యకాలంలో లెక్కపెట్టగలిగే అదృష్టం మన దేశానికి మళ్ళీ పట్టవచ్చును.

## స్వాతంత్ర్య సమరం

19వ శతాబ్దం చివరలో దేశ చరిత్ర మారజొచ్చింది. రాజ్యాలంతరించి పోయేకాలం. స్వాతంత్ర్య సముపార్జనకై మానధనం కలిగిన ఏవ్యక్తి అయినా ఎంతో ఆవేశంతో పని చేసిన రోజులు. ఆనాడు రాజకీయం అనే మాటకుండే అర్థం వేరు. ఆ అర్థం ఏకోణం నుండి చూచినా, స్వాతంత్ర్య వాంఛ, విశృంఖలతా విముక్తి, స్వీయపాలన, అనే మాటల చుట్టూ పరిభ్రమిస్తుండేది. రాజులూ, రారాజులూ, వారి కింద అణిగి మణిగి వారిని విశ్వాసంతో కొలిచే జనులు అనే అర్థం రాజకీయపు పరిధి నుండి దూరంగా వెళ్ళి పోయింది. అటు వంటి సంధియుగంలో, భారతీయులకు స్వపరిపాలన అవసరమని చెప్పి, వాళ్ళు పర ప్రభుత్వం కింద ఉండడం అనుచితం అని ఎలుగెత్తి చాటిన గౌరవం ప్రప్రథమంగా ఒక మహిళకే చెందుతుంది.

ఆవిడ జన్మ చేత భారతీయ మహిళ కాదు. తన ప్రవర్తన చేత, తాను పెంపొందించుకున్న సంస్కృతి చేత, గాఢమైన యిష్టం చేత రూపొందిన భారతీయ మహిళ. ఆవిడే అనీబిసెంట్. పుట్టడం ఐరిష్ దేశంలో పుట్టినా ఆవిడ అభిమానం భారత దేశం మీద. ఈవిడ పేరు చెప్పగానే, ఈ తరం మనుష్యులకు దివ్యజ్ఞాన సమాజం ముందుగానే జ్ఞాపకం వస్తుంది. కాని ఆవిడ రాజకీయ చతురత స్ఫురించదు. కాని భారతదేశాన్ని వదిలిపెట్టి, బ్రిటీష్ వాళ్ళు వెళ్ళి పోవాలనే సిద్ధాంతానికి ప్రాతి పదికవంటి హోమ్‌రూల్ ఉద్యమానికి ఈవిడే కారకులు. ఈ ఆశయ సాధనకోసం ఈమె ఆవేశంగా జనాన్ని ప్రబోధించింది. ఆనాటి ఉత్సాహ భరితులైన యువజనాన్ని జత చేసింది. జైలు శిక్షలనుభవించింది. ఆ విధంగా ఈనాటి మన స్వాతంత్ర్య ఫల ప్రాప్తికి తొలి బీజాన్ని నాటిన సమర్థురాలామె.

అప్పుడు గాంధీజీ పిలుపు విని దేశం మొత్తం మీద కార్యదక్షులైన యువతీ యువకులు గుమిగూడి అమేయ వాహినిగా ఏక దీక్షోన్ముఖులై ముందుకు సాగడం సంభవించింది. భారత స్వాతంత్ర్య సముపార్జనా లక్ష్యంతో అందరూ ఆనాడూ నడుములు బిగించారు.

ఆ ఊపులో ఆ కాలాన దేశం చాలామంది మహిళారత్నాలను కన్న మహా గౌరవానికి నోచుకున్నది.

నెహ్రూజీ పండితుని కూతురు చిన్నారి ఇందిర ఆటపాటల్ని కట్టిపెట్టి ఆనాడే తన యీడు పిల్లల్ని ప్రోగుచేసి వానర సైన్యానికి

నాయకత్వం వహించింది. చిన్న పిల్లల్లో కూడా జాగృతమైన రాజకీయ చైతన్యాన్ని, ఉద్రిక్తతను చెప్పడానికి ఇది మంచి తార్కాణం.

## శేముషీ దురంధరులు

గాంధీజీ అనుయాయిని, మధుర భాషిణి, కవయిత్రి, భారత దేశపు కోకిలగా పేరుగన్న శ్రీమతి సరోజినీ నాయుడు ఆనాటి రాజకీయాలలో నిర్వహించిన పాత్ర పెద్దది. భారత స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి ఆవిడ దళం ఇంగ్లండులో సింహగర్జన చేసింది. మొట్ట మొదటి మహిళా గవర్నరుగా, యు.పి. రాజకీయ చరిత్రలో ఈమె తన ప్రభావ ముద్రను ప్రస్ఫుటం చేసింది.

నెహూర్రి పండితుని చెల్లెలు శ్రీమతి విజయలక్ష్మి పండిట్ రాజకీయచాతుర్యం ఎన్నదగ్గది. దేశానికి స్వతంత్రం రాకముందు, యు.పి. లో, 1937 లో మంత్రి పదవిని నిర్వహించింది. అప్పుడు ఆవిడ నిర్వహించిన శాఖ ఈనాటి జిల్లాపరిషత్, పంచాయత్ రాజ్ శాఖ లాంటిది. తర్వాత రష్యా, అమెరికా దేశాలలో ఆమె భారత రాయబారిగా నియమించబడింది. ఇంగ్లండులో హైకమిషనర్‌గా తన సామర్థ్యాన్ని చూపించ గలిగింది. అంతేకాక, భారత దేశానికి స్వతంత్ర్యం రావలసిన అవసరాన్ని నొక్కి చెప్పడానికై ఐక్య రాజ్యసమితికి ఒక దళాన్ని బయలుదేరదీసి తాను నాయకత్వం వహించింది. తర్వాత ఐ.రా.స అధ్యక్షత గౌరవాన్ని కూడా పొందగలిగింది. ఎంతో ప్రశాంతంగా ఓరిమితో ఉద్రేకావేశాన్నయినా ప్రకటించని యీవిడ కార్యనిర్వాహణా విధానాన్ని ప్రపంచ దేశాలన్నీ శ్లాఘించాయి.

ఆ రోజుల్లో వచ్చిన మరో విప్లవ భావతరంగం ఆజాద్ హింద్ ఫౌజ్. నేతాజీ అడుగుజాడల్లో కొంతమంది యువతీ యువకులు కాంగ్రెస్ అనుసరిస్తున్న ఆనాటి సత్యాగ్రహోద్యమాన్ని కాదని ఆయుధాలు చేపట్టే మరోదారి తొక్కవలసి వచ్చింది. ఈ మార్గంచేత ఆకృష్టులై స్వాతంత్ర్య సముపార్జనకోసం తమ జీవితాలను మీదు కట్టుకున్న యువతులు చాలామంది ఉండేవారు. అందులో చెప్పుకోదగ్గ మహిళామణి కెప్టెన్ లక్ష్మి. ఈవిడ తల్లి అమ్ము స్వామినాథన్ కూడా రాజకీయాలలో ప్రవేశమున్న పేరెన్నికగన్న మహిళ. మార్గం ఏదైనా ఆనాటి స్వేచ్ఛాభారతం కోసం రాజకీయ రంగంలోకి దూకిన వీరవనిత కెప్టెన్ లక్ష్మి.

## గాంధీజీ అడుగుజాడల్లో

ఉప్పు సత్యాగ్రహం రోజుల్లో ఎత్తిన జండాను దించని పట్టుదలతో, గాంధీజీ అడుగుజాడల్లో నడిచిన మరొక వీరవనిత శ్రీమతి దుర్గాబాయమ్మ. తెలుగు జాతి ఉద్రేకానికి ప్రతినిధిగా, ఆరోజుల్లో యీవిడ కనిపించేవారు. వలంటీరుగా, వార్ధా ఆశ్రమ వాసిగా, గాంధీజీ సేవాదళంలో ఒక వ్యక్తిగా, మెట్లు ఎక్కుతూ వచ్చి వచ్చి దేశ రాజకీయాలలో కీలక స్థానాన్ని పొందగలిగిన వారీమె. రాజకీయ ప్రభావాలచేత రంగంలోకి దూకిన యీమె, చివరకు, స్వాతంత్ర్యానంతరకాలాన గొప్ప సంఘసేవా పరాయణగా మార్పును తెచ్చుకున్నారు. ఆమెను మర్చిపోనీయకుండా ఆవిడ పెంచి పోషించిన మహిళాసభ కలకాలం వర్ధిల్లుతూనే ఉంటుంది.

ఈ మహిళల్లో ఏదో ఒక మార్గాన్ని అభిమానించే వారే కాదు, ఏకాలాని కాకాలానికి, దేశాన్ని ప్రభావితం చేసే పలు రాజకీయ మార్గాలను అవలంబించిన స్త్రీలుండేవారు.

శ్రీమతి అరుణా అసఫాలీ, మొదట సోషలిస్టు పార్టీని అభిమానించిన మహిళ. తర్వాత కమ్యూనిస్టు పార్టీ దృక్పథంచేత ఆకర్షింపబడి, ఆ మార్గాన్ని ఎన్నుకున్న రాజకీయ చతుర. ఈవిడ ఊపిరిపోసి రూపుదిద్దిన పత్రికలే ఈనాటికీ ప్రజలలో వ్యాప్తిలో ఉన్న లింక్, పేట్రియాట్ పత్రికలు.

మరొక మహిళ సుచేతా కృపలానీ. ఈవిడ తన రాజకీయ జీవితాన్ని గాంధీజీ అనుయాయినిగా ప్రారంభించింది. నౌకాళీ యాత్రలో ఆయనకు బాసటగా వెంటనడిచింది. తాను విద్యార్థినిగా ఉన్నప్పుడు తనకు గురువుగా పరిచితుడైన కృపలానీని చేపట్టి తన గృహస్థ జీవితాన్ని ఆనందమయం చేసుకున్నది. దృక్పథాలు వేరయినా, సిద్ధాంతాలు వేరయినా, ఆ వేర్పాటును భార్యాభర్తలిరువురూ, తమ రాజకీయ జీవితానికి మాత్రమే పరిమితం చేసుకో గలిగారు. భారత దేశంలో శ్రీమతి సుచేత ముఖ్యమంత్రి పదవిని చేపట్టిన తొలి మహిళ.

ఈనాడు ఒరిస్సా రాష్ట్రాన్ని నడుపుతున్న నందినీ శతపథి, గోవాను పాలిస్తున్న శశికళా ముఖ్యమంత్రిణులే.

## తెలుగు నాట ప్రముఖులు

ఇక తెలుగు దేశంలో సత్యాగ్రహ సమరంలో పాల్గొన్న అనేక మంది మహిళల్ని పేర్కొనక తప్పదు. భర్త చాటున ఆకుమాటు పిందెలాగా ఉండికూడా అనుక్షణమూ రాజకీయాలలోనే బ్రతుకుతూ, తనదీ అనే జీవితం తనకేదీ లేకుండానే, భర్తను మహా నాయకుణ్ణి చేసి లోకానికందించిన శ్రీమతి కస్తూరీబాయి గాంధీ వీరందరికీ ఆదర్శం—నిజానికి ఆంధ్రదేశంలో, గాంధీజీ ఉప్పు సత్యాగ్రహపు పిలుపు విని, బయటకు స్త్రీలు వచ్చినంత ముమ్మరంగా మరెక్కడా రాలేదని చెప్తే అతిశయోక్తికాదు. ఆరోజుల్లో ఎంతోమంది స్త్రీలు నిర్బంధానికి గురిఅయ్యారు. జైలు శిక్ష లనుభవించారు. తమకుగల విలువైన విదేశీ వస్త్రాలను, స్త్రీ సహజమైన చాపల్యాన్ని కూడా వెనక్కి నెట్టి, నడి రోడ్డులో కుప్పబోసి, అగ్గిపుల్ల ముట్టించారు. సొమ్ములు, ఒంటిమీదనుండి దూసి అక్కడికక్కడ స్వరాజ్యనిధికి సమర్పించారు. యీ మహిళలందరూ వీరతా స్ఫూర్తికి ప్రతీకలే. వీరిలో కొందరిని మాత్రమే ఇక్కడ పేర్కొనడానికి సాధ్యమవుతుంది. ఆచంట రుక్మిణమ్మ, దువ్వూరి సుబ్బమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ, దిగుమర్తి జానకీ బాయి, పొణకా కనకమ్మ, ఓరుగంటి మహాలక్ష్మమ్మ, సంగం లక్ష్మీబాయమ్మ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, మొదలైనవారెందరో మహానుభావురాండ్రు!

ఈనాడు ఉద్యోగరీత్యా వివిధ శాఖల్లో కుదురుకుని, రాజకీయ సిద్ధాంతాలు ప్రాతిపదికగా, తమ బాధ్యతల్ని సమర్థవంతంగా నిర్వహించే స్త్రీలు దేశమంతటా కనిపిస్తూనే ఉన్నారు. ఒక మంత్రిగా, ఒక సాంఘిక సంక్షేమ శాఖాధికారిణిగా, ఒక శాసన సభాధ్యక్షురాలిగా, ఒక ప్రతిపక్ష సభ్యురాలిగా, ఇలా ఎందరినైనా, ఇక్కడ ప్రస్తావించడానికి అవకాశం ఉంది. కాని ఆ ప్రస్తావన, చెప్పుకోదగ్గ సంచలనం కలిగించే వార్తతో జతపడకపోతే, కేవలం పేర్ల పట్టికగా మారిపోయే ప్రమాదం కూడా ఉంది. అందువల్ల అటువంటి పేర్లను నేను ఇక్కడ సూచించడంలేదు.

## ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ

ఇంత చెప్పి, మరొక వ్యక్తిని చెప్పకుండా ముగిస్తే ఈ ప్రసంగం అసంపూర్ణమే అవుతుంది. గోల్డామేర్, సిరిమావో బండార్‌నాయకే, మిసెస్ పెరాన్ వంటి వారు ఇతర దేశాలలో దేశ నాయకత్వాన్ని నడుపుతున్న ఈ రోజుల్లో మన దేశాన్ని నడిపే మహానేత శ్రీమతి ఇందిరాగాంధీ. నడుస్తున్న చరిత్రకు వ్యాఖ్యానాలు అక్కరలేదు ఈవిడ ఆధ్వర్యంలో దేశం అంతర్జాతీయ చిత్రపటంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకోగలిగింది. ఆసియా ఖండపు వివిధ రాజ్యాలవైపు కొంత గౌరవాన్ని భయ సంభ్రమాన్నీ మిళితం చేసిన దృష్టిని సారించడం కేవలం ఇందిర అంతర్జాతీయ వ్యవహార నైపుణ్యం వల్లనే. ఈవిడ ఆధ్వర్యంలో యీనాడు దేశం అణుశక్తి ప్రయోగాలను చేసింది. అంతరిక్ష నౌకల్ని పంపించింది. అవసర సహాయాన్ని కోరే చిన్న దేశాల్ని ఆదుకుంది. ఇవన్నీ ఎవరూ విస్మరించవలసిన చిన్న విషయాలు కావు. నిజానికి విస్మరించడం కృతఘ్నతగా మారుతుంది కూడాను।

కానీ ఇంటగెలిచి రచ్చగెలవడమనే సామాన్య సూత్రాన్ని యీనాడు దేశంలో అందరూ పాటించవలసి ఉంది. ప్రజాహితం కోరి ఏ పని చేయబోయినా ఆ పనులవల్ల ఇదుకునబడే అభ్యుదయ నిరోధక శక్తులు ఎవరికైనా ఏ కాలానికైనా ఉండడంలో విచిత్రం లేదు. వాటిని కనుగలిగి చూచుకుంటూ తన ప్రతిష్ఠకు భంగం కలగని విధంగా, దేశాన్ని ఉద్ధరించవలసిన అవసరం ఏ నాయకుడికైనా, నాయకురాలికైనా ఉండక తప్పదు. ఈ క్లిష్ట పరిస్థితిలో ఆమెను ఎదుర్కొంటున్న పెద్ద సమస్య యిదే. ఈ విషయాల్ని దృష్టిలో పెట్టుకుని చూస్తే మన ప్రధాని శ్రీమతి ఇందిరను ఎప్పుడు తలచుకున్నా ఒకనాటి రష్యన్ రాణి, కేథరిన్ 'ది గ్రేట్' చరిత్ర జ్ఞాపకం వస్తుంటుంది. వాళ్ళ రాజకీయ జీవితాల్లో ఉన్న సామ్యాలటువంటివి.

ఈ సంవత్సరాన్ని అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా రూపు చెందించినందుకు మన దేశ రాజకీయాలలో ఒక మహిళ కలగచేస్తున్న సంచలనం విప్లవాత్మకంగా ఉండి ఈ సంవత్సరానికి సార్థక్యాన్ని తెచ్చి పెడుతున్నది. ఈ మాటలు మొగమిచ్చడానికై అంటున్నవికావు. ఈ నవ విధానం, అవినీతి పైన కసిగా ఎత్తిన కత్తిగా, అస్తవ్యస్త పరిస్థితిని చక్కబరిచే అకుంఠిత సాధనంగా దేశాన్ని సరిదిద్దుతుందని ఒక ఆశ. ఈ ఆశ అఖండజ్యోతిగా వెలగాలనీ, ఆ జ్యోతిశ్చక్రంలో, ఆ మహిళ దేదీప్యంగా వెలుగుతూ ప్రపంచ మహిళా సమాహారంలో నాయకమణిగా కలకాలం నిలవాలని నా ఆశంస.

## ఈ సంచికలో రచయితలు

### శ్రీమతులు

అడవి కొలను పార్వతి, గాంధీనగర్, కాకినాడ–4

ఇల్లిందల సరస్వతీ దేవి, "సుదర్శన", 2-2-11181/1 న్యూ నల్లకుంట, హైదరాబాద్–44

సి. ఆనందారామం, 5 ఎస్. ఎం. సి., మారేడ్ పల్లి, సికింద్రాబాద్–3

పరిమళా సోమేశ్వర్, సునీల్ బిల్డింగ్, సిటీకాలేజి ఎదురుగా, హైదరాబాద్

యల్లాప్రగడ సీతాకుమారి, 1-8-7/2, చిక్కడ్‌పల్లి, హైదరాబాద్–20

కె. రామలక్ష్మి, 1, శివప్రకాశ మొదలి వీధి, త్యాగరాజనగర్, మద్రాస్–17

కె. సుగుణమణి, కార్యదర్శి, ఆంధ్రమహిళాసభ, విద్యానగర్, హైదరాబాద్–44

డాక్టర్. పి. యశోదారెడ్డి. "సుధర్మ." 3-4-574, నారాయణగుడా, హైదరాబాద్.

ఆర్. సుగుణాదేవి, C/o శ్రీ వెంకటేశ్వర్లు, బొలారం, సికింద్రాబాద్.

నాయని కృష్ణకుమారి, 8-3-898/2, నాగార్జుననగర్, హైదరాబాద్–38

స్వరాజ్యలక్ష్మి, 12-1-754/1, ఆసిఫ్‌నగర్, హైదరాబాద్–28

లక్ష్మీరఘురామయ్య, 14, అశోకారోడ్, న్యూఢిల్లీ–110001

పత్రికా రంగం

# జర్నలిజంలో స్త్రీలు

కె. రామలక్ష్మి

**వితండ వాదాలకి మన దేశం పెట్టింది పేరులా అనిపిస్తుంది. ఇక్కడలా మరెక్కడా యింత తలకిందులు స్టేట్ మెంట్స్ కనిపించవు వినిపించవు. ఒక పక్క 'యత్ర నార్యంతు పూజ్యతే' అంటూ ఆడదాన్ని ఆకాశానికెత్తి-మళ్లా అదే నోట 'న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అంటుంది.**

ఇదేమి గొడవండీ. ఓ పక్క 'ఆలస్యం అమృతం విషం' అంటూ యింకోపక్కనుంచి 'నిదానం ప్రధానం' అంటారు-అంటూ నిలదీస్తుంటారు కొందరు. నిజమేకదా-దేన్ని నమ్మడం అన్న ప్రశ్న యిలాంటప్పుడే – జవాబు దొరకని ప్రశ్నగా నిలచి పోతూంటుంది.

తెలుగు జర్నలిజంలో స్త్రీలు అని రాయడానికి ముందు - నాకిలాంటి కొరకరాని ప్రశ్న ఎదురయింది ఈ దేశంలో స్త్రీలు ఎప్పుడూ రాస్తూనే వున్నారు. వారిని ప్రత్యేకించి చెప్పుకోడం ఎందుకని? పోనీ పత్రికా వ్యాసాంగంలో స్త్రీలు ఎప్పుడు ప్రవేశించారు? అని ప్రశ్నించుకుంటే-అసలు పత్రికా ప్రచురణ ముమ్మరంగా యీ దేశంలో - ప్రాంతీయ భాషల్లో ఎప్పుడు ప్రారంభం అయిందని? ఇలా వెనక్కు తవ్వుకుంటూ వెడితే - యిక యీ దేశంలో పత్రికల చరిత్రలో కూరుకుపోతానని భయం. అసలు సంగతి వదలి ఏనుక్కి తిండిపెట్టినట్టు – యీ స్త్రీ జర్నలిస్టులని రొట్టలో బుట్టేసి అందించడం యిష్టంలేదు నాకు అందుకే తిన్నగా యీ సమస్య కొమ్ములందుకొని రంగంలోకి పురుకుదాం అనుకున్నాను.



స్త్రీ జాతికి కనువిప్పు : వీరేశలింగంగారు

అసలు తెలుగులో పత్రికల్లో రాయడం అన్నది అంత ముమ్మరంగా ప్రారంభం కాలేదు. తొలినుంచీ - ప్రాచీన కావ్య పఠనం, శతక పఠనంలో-పుణ్య చింతనలో ఉర్ఫీదు ఎవ్వబడిన స్త్రీ జాతికి కాస్త కనువిప్పు కలిగించిన మహానుభావుడు వీరేశలింగం గారే ననడం యిప్పటికీ-ఎప్పటికీ అతిశయోక్తి కాదు. అక్షరాలా

## ఈ దేశంలో స్త్రీలు ఎప్పుడూ రాస్తూనే ఉన్నారు



నిజం. వారి ప్రోత్సాహం, ప్రాబల్యాలలో రచనా వ్యాసాంగం వైపు మొగ్గిన స్త్రీలు అనేకమంది కనబడతారు. అన్ని సంస్కారాల కంటే స్త్రీ జన సంస్కారానికి పెద్ద పీటవేసిన వీరేశలింగంగారు. దానికి ఆయుధం అవిద్యాభేదనం ఒక్కటే అని నమ్మిన మహా మనిషి. స్త్రీలకోసం ప్రత్యేకంగా పత్రికలు పెట్టి వారి యెడ గావింపబడుతున్న సంఘదురాచారాలను తన్విపోశాడాయన. వారి ఆదర్శంలో ఆరోజుల్లో విజ్ఞాన చంద్రికా సమాజం, స్త్రీల పోటీ పరీక్షల సంస్థలు సర్వజన గ్రంథ భాండారము మొదలయినవి తలెత్తాయి ఈ గ్రంథాలయం (ప్రస్తుతం గౌతమీ గ్రంథాలయం) వారు యింటింటికి తిరిగి ఆడువారికి పుస్తకాలు అందించేవారు ఇలా జరిగిన నిరంతర విద్యాప్రచారంవల్ల స్త్రీలలో పత్రికా నిర్వహణం చేయగల నేర్పరులు కూడా వెలశారు. బాలాంత్రపు శేషమ్మగారు "హిందూసుందరి," పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు "సావిత్రి" వింజమూరి వెంకట రత్నమ్మగారు "అనసూయ" పత్రికలు ప్రారంభించారు. వీటిలో స్త్రీల రచనలు తొలిసారిగా చోటు చేసుకోవడం ప్రారంభించాయి. 'వివాదం జర్నలిజం లక్షణం' అన్నది అక్షరాలా నిజం అని నిరూపించేలా యీ పత్రికలో వాద ప్రతివాదాలు జరిగేవి. ముఖ్యంగా పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు - సనాతన దృక్పథానికి పట్టం కట్టి వితంతు వివాహాది సంఘ సంస్కరణలకు వ్యతిరేకంగా "సావిత్రి" పత్రిక నడిపారు. ఇలా స్త్రీల శీర్షికలకి, రచనావ్యాసాంగానికి నాంది పల్కి ప్రముఖంగా వారిని ఉత్సాహ పరిచి వారివ్యాసాంగానికి దోహదం కల్గించిన యింకొక పత్రిక కేసరిగారి "గృహలక్ష్మి." దీనిలో ప్రప్రథమంగా మహిళలకు ప్రత్యేక శీర్షికలాంటి శారదలేఖలు ప్రారంభం అయ్యాయి. ఇలాగే వ్యాసాలు, పద్యాలు, వివిధ రచనా ప్రక్రియలు రాసిన వేలూరి శేషమాంబగారు పలు రచనలను జనానా, జ్ఞానోదయ మొదలైన పత్రికల్లో ప్రచురించేవారు. (ఈమె స్త్రీల నిరక్షరాస్యత గూర్చి చాలా సార్లు రాస్తూ ఒకచోట

'గొల్లది చల్ల వాడుకడ గోడల గీతలు గీసి లెక్కలన్
దెల్లముసేయు, చాకలిది తెచ్చిన బట్టలు వైచు బట్టలన్
బల్లవపాణి త్రాడునకు బాగుగ వైచుచు విప్పుచుల్లదా
నల్ల లితంబుగా చదువ జాలని చిన్నియలెన్న మాధవా'

అంటూ రాశారు).

ఈ రోజుల్లోనే క్రైస్తవ వనిత అయిన కృపాబాయి సత్యనాథమ్మగారు 'విద్యావతి' అనే పత్రిక నడిపారు.

## జర్నలిజంలో జీవం, జవం

మద్రాసు నుంచి వచ్చిన "గృహలక్ష్మి" ముఖ్య రచయితల్లో, ఆరోజుల్లో శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారొకరు. నిజానికి ఆధునిక స్త్రీ జనానికి శ్రీ కేసరిగారి "గృహలక్ష్మి" పత్రిక ఎంతో జీవం, జవం యిచ్చిందనడం పొగడ్త కాదు. ఈ పత్రికను ఆలంబనగా చేసుకొని ఎందరెందరో అక్షర పరిచయంలేని ఆడవారు సహితం క్రమంగా సాధన చేసి కవిత్వం చెప్పేటంత స్థాయికి ఎదిగారు. ఆచంట సత్యవతమ్మగారు పత్రికా ముఖంగా కథలే కాక, వ్యాసాలు పద్యాలు కూడా ఎక్కువగా రాసేవారు. స్త్రీ జనాభ్యుదయాన్ని, సంస్కరణాభిలాషను పెంపొందించడమే ఆ నాటి చాలా మంది రచయితల ధ్యేయంగా వుండేది. కారణం కాలం అటువంటిది కావడమే. కాని, ఎప్పుడూ వ్యతిరేకులు వుంటూనే వుంటారు. పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు సంఘ సంస్కరణాభిలాషావెల్లువ అనే ఏటికి ఎదురీద ప్రయత్నించిన-తిరోగమన వాది అని చెప్పుకోవచ్చు. తమ రచనల ద్వారానే కాక, "సావిత్రి" పత్రిక స్థాపించి, దానిలో కూడా వీరేశలింగం పంతులు గారి సంస్కరణోద్యమాన్ని చీల్చి చెండాడ ప్రయత్నాలు చేసిన వారీమె. సంస్కరణ వ్యతిరేకి. గాని స్త్రీ విద్యా ప్రచారాభిలాషి యీమె. ఈమె కూడా జనానా, హిందూ సుందరి పత్రికలలో వ్యాసాలు రాసేవారు. హిందీ, వంగ భాషలలో పాండిత్యం కల్గిన యీమె ఒక రచయిత్రేకాక మంచి వక్త కూడా. ఎన్నో సభలు, సమావేశాలకి అధ్యక్ష పదవిని అలంకరించడమే కాదు. స్వయంగా తొలి స్త్రీ సమాజమైన విద్యార్థినీ సమాజాన్ని స్థాపించారని ప్రతీతి. గృహలక్ష్మి పత్రికలో అప్పుడప్పుడు రచనలు చేసిన యింకొక రచయిత్రి శ్రీమతి జూలూరు తులసెమ్మగారు.

## ఆధునిక యుగం

ఆధునికాంధ్ర సాహిత్యంలో ముందు రచయితగా, తరువాత పండితురాలుగా చెప్పుకోవలసిన మనిషి-కాంచన పల్లి కనకమ్మగారు. ఆరోజుల్లోనే యీమె-తన యింటి పేరు మార్చుకోలేదు: ఇలా పత్రికా ముఖంగా, రచనల ద్వారా, పేరెన్నిక గన్న రచయితలు-చాలా మంది ఉన్నారు. ఆధునిక యుగం అని చెప్పుకోదలిస్తే-యీ నాటికీ మనందరికీ అప్పుడప్పుడు దర్శనమిస్తూ, ప్రాచీన రచనలకు తీసిపోని రచనలను చేస్తూన్న నిరాడంబరి అయిన రచయిత్రి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు. ఆధునిక పత్రికావ్యాసంగంలో ప్రముఖ భాగంగా వుంటున్న ప్రత్యేక శీర్షికల్లో-స్త్రీల శీర్షికలకు దరిదాపు-నాంది పల్కాయి యీమె ప్రారంభించిన శారద లేఖలు. సంఘంలో అప్పుడప్పుడు తలెత్తిన సమస్యలకు పరిష్కారం సూచిస్తూ తమ అభిప్రాయలను నిర్భయంగా తెల్పుతూ రాసేవారు. సంఘ సేవాభిలాషగల యీమెగారు బాపట్లలో స్త్రీ హితైషీ మండలి స్థాపించి దానిని మార్గదర్శకంగా రూపొందించి నిర్వహిస్తున్నారీమె. గృహలక్ష్మి, దానికిముందు అనసూయ పత్రికలలో ఎన్నో కథలు, వ్యాసాలు రాస్తూ తరువాత ప్రత్యేకంగా గృహలక్ష్మిలోనే రాయడం ప్రారంభించారు. వారి 'శారద లేఖల' రచనలకే కేసరిగారి గృహలక్ష్మికి స్వర్ణకంకణం దక్కింది.

జొన్నల గడ్డ శారదాంబ గారు, గిడుగు లక్ష్మీ కాంతమ్మ గారు, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు, పొణకా కనకమ్మ గారు, కల్లూరి విశాలాక్షమ్మగారు-ఇలాగే చాలా మంది ఆరోజుల్లో పత్రికలలో రాసినవారే. కాని వారు పత్రికా రచనే ప్రధాన వ్యాపకంగా పెట్టుకున్న వారు కాదు. వారికి దేశ సేవ, భాషా సేవ, సంఘ సేవ ముఖ్యంగా తోచి, వాటికి ఉపకరించినంత మేరకు పత్రికా రచనలు చేయడం అలవాటుగా వున్నవారు. అందుకే-వారిని గురించి మనం చెప్పుకున్నప్పుడు-జర్నలిస్టులని చెప్పలేం.

## స్త్రీలకు ముమ్మరంగా ప్రోత్సాహం

ఆధునిక పత్రికా రంగంలో మహిళలకి ఇతోధిక ప్రాముఖ్యం హెచ్చించినవి-స్త్రీలకై ప్రత్యేకింపబడిన శీర్షికలు. వీటిలో పాల్గొనే

మోజుతో చాలామంది తమ అభిప్రాయాలని-లేఖలద్వారా, వ్యాసాల ద్వారా తెలియజేయడంతో మొదలుపెట్టి తామే నెమ్మదిగా రచయితలుగా మారినవారున్నారు. ఈనాడు పత్రికలలో స్త్రీలకు ఎక్కువగానే ప్రోత్సాహం లభిస్తున్నది. కాని ఈనాడు మనం చూస్తున్న స్త్రీల శీర్షికల జాబితా-వారి ప్రస్తుత జీవన విధానానికి - ఏ మాత్రం ఉపయోగించేదిగా లేదని ఎవరికైనా తెలిసిపోతుంది.

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు, కీ. శే. కొమ్మూరి పద్మావతీదేవి గారు, మాలతీ చందూర్, చాలా కాలంగా స్త్రీల ప్రత్యేక శీర్షికలకి పెట్టింది పేరు. "ఇహెంగేహే లక్ష్మీ" అనే మకుటం కింద శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు, తమ బహుముఖ పాండిత్యాన్నేకాదు, సునిశిత విమర్శనా దృష్టిని, సువిశాలమైన అనుభవ సంపత్తినీ రంగరిస్తూ, స్త్రీల సమస్యలని గురించి వ్రాసే వారు. అలాగే యిటీవల కీర్తిశేషులైన శ్రీమతి కొమ్మూరి పద్మావతీ దేవి గారు 'ప్రమదా వనము' 'కుంకుమ రేఖలు' మొదలైన మహిళల శీర్షికలలో తమ సున్నితమైన హాస్యాన్ని జోడిస్తూ-చక్కని వ్యాసాలు వ్రాసేవారు. చాలా కాలంగా వయఃభేదం లేకుండా అందరినీ తమ అశేష ప్రజ్ఞా పాటవాలతో ఆకర్షిస్తూ- "ప్రమదా వనం" శీర్షికను - జనరంజకంగా నిర్వహిస్తున్నారు మాలతీ చందూర్ గారు. ప్రస్తుతం తెలుగు పత్రికలలో స్త్రీల శీర్షిక ఒక 'మస్ట్' అయి కూర్చుంది అనడానికి యీమెను కారణంగా చెప్పవచ్చు।

ఆంధ్ర మహిళ పత్రిక తమ సంస్థ కార్య కలాపాలకే ఎక్కువ చోటు కేటాయించినా, ఆ రోజుల్లో ఎక్కువ మంది స్త్రీ రచయితలని ఆకర్షించేది. ఎందరో మహా రచయితలని తీర్చి దిద్దిన గృహలక్ష్మి పత్రిక లాగే యిదీ కాల గర్భంలో కలిసి పోయింది. ప్రస్తుతం 'స్త్రీకు ప్రత్యేకం' అన్న నినాదంలో అర్థంలేకపోయినా ఈ శీర్షికల అవసరం మట్టుకు తీరిపోలేదు. కాని, ఈ శీర్షికలలో- ఎంత సేపూ స్త్రీరంగం- గృహాలక్షి, అలంకరణకీ, వంటా వార్పులకీ-లిమిట్ అయిపోతుండడం-బాగుండ లేదు. ఇవి అక్కరలేదని కాదు. కాని యివే స్త్రీ జీవితానికి కావలసినవి అన్నది అబద్ధం కదా। ఇటువంటి వంటింటి శీర్షికలను చూసే-ప్రముఖ విమర్శకులంతా 'ఆడాళ్ళింతే' అంటూ పెదవి విరవడమే కాదు; వీరు సృష్టిస్తున్న సాహిత్యానికే ఆ బిరుదు యిచ్చేస్తున్నారు.

దానికి కారణంగా ఒకటి రెండు విషయాలు తోస్తాయి నాకు. పూర్వ రచయితలకి ఉన్న బాధ్యతాయుతమైన దృక్పథం యీ నాటి వారికి లేకపోవడం, పూర్వం వారికి ఉన్న 'బోధనావసరం' యీ నాటి పరితలకి లేక పోవడం

## చాపకింద నీరులాంటి సమస్యలు

ప్రస్తుతంలో ఆడదాని బ్రతుకు మూడు పూలు ఆరు కాయలుగా వుందని మనం మురిసిపోతున్నామేగాని, చాప కింద నీరులాగా సమస్యలు కంటికి కనబడకుండా విస్తరిస్తున్నాయి. బాధ్యత గల రచయితలకిప్పుడే- ఎక్కువ పని. ఒక పక్క నుంచి 'ఇజాల' పోటీలోపడి మురాలుగా తయారవుతున్న రచయితలు, వేరొకప్రక్క ఎదిగీ ఎదగని ఆదర్శాలను పెట్టుకుని, యిమిడీ యిమడని పాశ్చాత్య విజ్ఞానాన్ని అందుకుని, పాతనీ కొత్తనీ కూడా లక్ష్యపెట్టని నిర్లక్ష్యతత్వం పీడిస్తూంటే-పత్రికలు ఏం చేస్తున్నాయి. మురా పత్రికల్లా తయారవుతున్నాయి. తమ తమ మురాలని తమ తమ ఇజాలని, తమతమ ఆదర్శాలని లజ్జారహితంగా విస్తరింపచేసుకోవాలని తాపత్రయ పడుతున్నాయి. వీటి మధ్య ఈ స్త్రీల ప్రకరణం-వృధా అయిపోతోంది-అంటే యీ శీర్షికలు నడిపే వారు-తమ బాధ్యతలని విస్మరించారని కదా అర్థం. ఇది అంతర్జాతీయ మహిళా సంవత్సరం అంటే వేళాకోళం చేస్తూ వస్తున్నన్ని కార్టూనులు ఎక్కువ గాని; దీని అంతరార్థాన్ని, అవసరాన్ని, ప్రయోజనాన్ని తెలియచెప్తూ వస్తున్న వ్యాసాలు ఎన్ని? చాలా తక్కువ. దీనికి కారణం స్త్రీల నిర్లక్ష్య వైఖరేనని చెప్పక తప్పదు.

ఈ దేశంలో ఎప్పటి నుంచో పత్రికా రచన-ఒక వ్యాపకంగా సాగిపోతోంది. ఒక వృత్తిగా సాగిపోతోంది. కాని, యిదొక దీక్షగా, యిదొక ధర్మంగా సాంఘిక న్యాయాన్ని చేకూర్చే ఆయుధంగా, ప్రజాభిప్రాయానికి ప్రతిబింబంగా తీసుకునే సంపాదకులూ లేరు. పత్రికలూ లేవు. అందుకే, గుర్రం నడక రౌతులో వుంటుందన్నట్టు-ఆ యా పత్రికా శీర్షికల చేవ సంపాదకుని సునిశిత బుద్ధిమీద, దృక్పథం మీద ఉంటుంది అనడం అతిశయోక్తి కాదేమో. 'కర్ర విరక్కుండా పాము చావకుండా' కొట్టమనే వాళ్ళు 'మేం ఫలానా వారి తరపు, అంచేత తద్భిన్నంగా వద్దు' అనుకునేవాళ్ళు రచయితల స్వేచ్ఛా, ప్రవృత్తికి ఆటంకాలే కదా. బహుశా యివన్నీ ఎందుకొచ్చినవని ఆ యా శీర్షికల రచయితలు-ముఖ్యంగా స్త్రీ రచయితలు-స్త్రీల సమస్యలని పరిమిత రంగానికి యిమిడ్చి వేస్తున్నారేమో- అనిపిస్తుంది.

## స్త్రీ జన విచక్షణ

జర్నలిజంలో తర్ఫీదు అవకాశాలు లేక అందరూ-దారితప్పి జర్నలిస్టులవుతున్నారేగాని, దాలో అభిలాష కొద్దీ జర్నలిస్టులవడంలేదు. ప్రాంతీయ భాషా పత్రికలలో తర్ఫీదునిచ్చే సదుపాయాలు మగవారికి ఉన్నాయిగాని స్త్రీలను తీసుకుందుకు కాస్త వెనుకాడుతారు. జాతి విచక్షత లేదంటున్నా పత్రికారంగంలో స్త్రీ జన విచక్షణ తప్పక వుందనే చెప్పాలి. ఇందు మూలంగానే జర్నలిజంలో ఉన్న స్త్రీలని వేళ్ళమీద లెక్కపెట్ట వచ్చు. ఈ స్త్రీల శీర్షికలు వ్రాసేవారంతా జర్నలిస్టులుకారు. రచయితలు. పత్రికా కార్యాలయంలో పనిచేసి పత్రికా నిర్వహణలో నేర్పు సంపాదించిన మహిళలు మనకు అసలు లేరన్నా అబద్ధంకాదు. ఆంగ్ల పత్రికల కార్యాలయాలలో ఆడవారున్నారేగాని ప్రాంతీయ భాషల్లో ఒక్క హిందీమినహా యితర భాషా పత్రికల్లో స్త్రీలు తక్కువ. తెలుగులో లేరన్నా అతిశయోక్తికాదు. అలాపూర్తి జర్నలిస్టుగా తర్ఫీదునంది ప్రూఫు చదవడం దగ్గిరనుంచి ఫారము తయారు చేసిందాకా తర్ఫీదు నంది జర్నలిస్టు అనబడ తగ్గ ఆడది ఒక్క కె. రా. అంటే కోప్పడకండి. అందుకే తెలుగులో ఏకైక మహిళా జర్నలిస్టుగా చెప్పతగ్గదీ వ్యక్తి।। (ఎంత అహంకారం!?)

# ఆంధ్రమహిళాసభ బహుముఖ సేవలు

**కె. సుగుణమణి**

ఆంధ్రమహిళాసభ కథవంటిది చరిత్రలో మరొకటిలేదు చిన్నప్పుడే చిన్నయత్నాలుగా ప్రారంభించి, కేవలం స్వయంకృషి వల్లా, సేవాతత్పరతవల్లా అద్భుతాలు సాధించిన కథయిది ఈ సభ వ్యవస్థాపకురాలు డా॥ (శ్రీమతి) దుర్గాబాయమ్మగారు— దేశ స్వాతంత్ర్యసమరంలో పాల్గొన్నవ్యక్తేగాదు, బహుముఖ ప్రజ్ఞాశాలి, సార్థకనామధేయురాలు, వీరు సంకల్పించిన దేదైనాసరే, సాకారం దాల్చి, సద్యోఫలితాలు యిచ్చి తీరవలసిందే చిన్నవయస్సులోనే వీరిపైనగాంధీమహాత్ముని కన్నూ, ప్రభావమూ పడ్డాయి 1921లో కాకినాడలో జరిగిన కాంగ్రెస్‌సమావేశంలోను గాంధీజీ ఆంధ్ర ప్రాంతం పర్యటనలోను మహాత్ముని ప్రసంగాన్ని అనువదించడానికవి అనువాదకులుగా వెళ్లేరు అంతకుముందే హిందీపాఠశాల ప్రారంభించి నడిపేరు దేశసేవికల్ని తర్ఫీదుచేయడంకూడా ఈయమ్మకు బాల్యక్రీడే

ఇప్పటి ఆంధ్రమహిళాసభ అప్పటి కార్యక్రమాల పరిణామమూ, రూపాంతరమూను ఈ సభ, రకరకాల సంస్థల సముచ్ఛయం ఈ సభ భవనాలు మద్రాసు హైదరాబాద్, మహబూబ్‌నగర్, సంగారెడ్డిలోనున్నాయి సేవలు రాష్ట్రపరిధులు దాటిపోయేయి ఈ సభసంస్థలకు స్థలాలు, భవనాలు విరాళాలూ, ప్రజాసేవాతత్పరులైన మహారాణీలు, మహారాజాలు ప్రజలు, పురపాలక సంఘాలు, రాష్ట్ర-కేంద్రప్రభుత్వాలు కూడ అందజేసేయి వ్యవస్థాపకురాలైన శ్రీమతి దుర్గాబాయమ్మగారి చేతుల్లో అవి పూర్తిగా సద్వినియోగమై ప్రతీ పైసాకూడా ప్రజాసేవకు వినియోగింపబడుతుందన్న పూర్తి విశ్వాసం దాతలకుంది చిన్నమాంటా మహిళా విద్యాలయము అనాథస్త్రీలకు శరణాలయం దీంట్లో తలదాచుకుంటూ, సభలో శిక్షణగరిపిన వారంతా స్వతంత్రంగా సగౌరవంగా జీవించగలుగుతున్నారు మల్లమదేవి హాస్టలు బొబ్బిలిరాజావారి విరాళం సభశాఖలో తర్ఫీదునందే విద్యార్థినులెందరో సౌఖ్యంగా ఉండడానికి యిది ఆశ్రమమౌతుంది ఈ భవనాలు వెలిసిన స్థలం పిఠాపూర్ రాణీగారి విరాళం, అదేప్రథమం



## స్త్రీలకు సౌకర్యాలు

అడయార్‌లో నున్న ప్రసూతి-నర్సింగ్ హోమ్ బీదస్త్రీలకు ఉచిత సౌకర్యాలు కల్పిస్తోంది. ప్రసవానికి పూర్వం, ప్రసవానంతరమూ సేవలు చేయడంలోనూ కుటుంబ నియంత్రణకు సంబంధించిన ప్రచారం పటుతరంగా జరిపించి, ఆ కార్యక్రమాలన్నీ సమ్మేళనం గావించడంలోనూ, ఇంకాప్రసూతి-శిశుసంరక్షణ కార్యక్రమాలు ఒకటోరకంస్థాయిని నడపడంలోనూ యీ సంస్థపేరొంది- అపార సేవలు గావిస్తోంది. పిల్లలకొక ప్రత్యేక ఆస్పత్రివుంది బయటనుంచి వచ్చే పిల్లలకొకప్రత్యేక ఔట్‌పేషంట్ వార్డుకూడా వుంది. ఇవిగాక, ఆగ్జిలరీనర్సులకు ఇచ్చట రెండేళ్ల శిక్షణాకార్యక్రమం నడుస్తోంది. అడయార్ లోనేగల వికలాంగుల శరణాలయం శ్రీలక్ష్మి పార్వతి-హనుమంతరావు దంపతులిచ్చిన భూరి విరాళంతో







## ...ాళా సభ

...రం తెలుగునాట స్త్రీ జనాభ్యు...
...ప్టాలుగా ఎనలేని సేవచేస్తూన్న...
...్యంతో పురోగమిస్తూంది.



1 పుస్తకాలు మాకు మంచి స్నేహితులు; విద్య గరిపిన వారు మా పాలిట దేవతలు- అంటారీ బాలికలు

2 వనితలు సమాజంలో తమ వంతు కార్యక్రమం నిర్వహించేందుకు కళాశాల విద్య ఒక సాధనం

3 ఆంధ్ర మహిళా సభ విద్యామందిరం

4 ఇది ముద్రణాలయం—ఈ రంగంలోనూ మేము ముందున్నాం

5 చూడముచ్చటగా బైండింగు చేయడం, చేపట్టిన పనికి తుది రూపం యివ్వడం అతి ముఖ్యమైన విషయం

6 దారం తరుగుతోంది, చక్రం రివ్వున తిరుగుతోంది దుస్తుల తయారీలో మేం సుశిక్షితులం

7 కర్తవ్యపరాయణ శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్

8 హస్తకళానైపుణ్యం మాసొత్తు





స్థాపించబడింది. ఈ సంస్థ 1960 లో ప్రారంభింపబడి, పోలియో వ్యాధికి గురియైనవారికి, వికలాంగులైన పిల్లలకూ, మెదడులోపాలుగలవారికి, చికిత్సశిక్షణ-పునరావాసము కల్పింపుచు దీంట్లో ఫిజియోతెరాపీ, అక్యులేషన్ తెరాపీ, ఎలెక్ట్రోతెరాపీ, హైడ్రోథెరాపీ, వాక్కుతెరాపీ, స్పీచ్ తెరాపీ, వగైరా సౌకర్యాలెన్నో వున్నాయి. ఈ కేంద్రానికిచేర్చి, ఒక బ్రేయిన్ వర్కుషాపు ఉంది దీంట్లో వికలాంగులకు కావలసిన కేలిపర్సువగైరా ఆర్థోపేడిక్ పనిముట్లూ, ఇంకా వికలాంగులకు వలసిన పరికరాలూ, తయారౌతాయి. సెరిబ్రల్ ప్లాసిడ్ పిల్లల చికిత్సకూ, వారిశిక్షణ-వొకేషన్-రీహేబిలిటేషన్ కూ యూనిట్లూ, ముఖ్యంగా వికలాంగులైన పెద్దవారికి గూడా చికిత్సలుచేసి, వారికి పరిశ్రమల్లో పునరావాసం కల్పించడానికి ప్రత్యేక సౌకర్యాలూ వంటివున్న ఈఆర్థోపేడిక్ సెంటరులున్నాయి.

మద్రాసులో ఆంధ్ర మహిళాసభ నడిపే టూరిస్టుహాస్టల్ అంటే ఎందరెందరో విదేశస్థులకు గూడ సౌకర్యవంతంగా వుంటూందని ఎంతో మోజు. వ్యవస్థాపకుల ఉద్దేశంలో, ఇలాంటి వసతిగృహాలు, దేశం వివిధ ప్రాంతాల్లో ఉంటూ, విదేశస్థులకు, ముఖ్యంగా తక్కువ రాబడిగల మధ్యతరగతి కుటుంబాల వారికి వసతి భోజనం వగైరా సౌకర్యాలుగలవి ఉండడం, చాలామంచిదని; వాటి వల్ల, దేశసంక్షేమ కార్యక్రమాలకు మంచి ఆదాయం వస్తుందంటారు. అనేకప్రాంతాల నుంచి ఈ వసతి గృహానికై యేర్పాట్లు చేసుకుంటూన్న సంగతినిబట్టి చూస్తే, ఈ హాస్టల్ చక్కటి పేరు సంపాదించుకుందని తెల్లమవుతుంది.

ఇటుహైదరాబాద్ లో గల ఆంధ్ర మహిళాసభ సంస్థలన్నీ కూడా మంచివిశిష్టమైన ఆకర్షణా పేరూ పొందేయి. విద్యానగర్ లోని మహిళావిద్యాలయంలోనున్న సౌకర్యాలు మరెక్కడా లేవు. వయోజనులై, అనేక హేతువులవల్లస్వస్తిచెప్పబడిన చదువును మళ్లీ సాగించడానికి సౌకర్యాలు లేకబాధపడే స్త్రీలకొరకై ప్రత్యేకంగా కన్డెన్సుడుకోర్సులు 1959 లో ప్రారంభించడంతో, ఈ సంస్థ అరంభించబడింది. హయ్యర్ గ్రేడ్, సెకండరీగ్రేడ్, బేసిక్ ట్రెయినింగ్ కోర్సులు 1963 లో ప్రారంభించేరు. ఇప్పటికి హయ్యర్ గ్రేడ్ శిక్షణపొందినవారు 360 మందికిపైగాను, సెకండరీగ్రేడ్ శిక్షితులు 500 మందికి పైగాను ఉన్నారు. వీరిప్రాక్టీస్ కొరకై ఒక మోడల్ అప్పర్ ప్రయిమరీ స్కూల్ ప్రారంభించబడి, 1960 నాటికది హైస్కూల్ గా పరిణమించింది ఈ హైస్కూల్ గాక, ఇంగ్లీషుమీడియంలోఒకశిశువిహార్ కూడావుంది.దీంట్లోబాలబాలికలకు సెకండ్ స్టేండర్డువరకు శిక్షణ యివ్వబడుతూంది. హైస్కూలుకు ఉండవలసిన హంగులన్నీ ఈ హైస్కూలుకు వున్నాయని ధీమాగా చెప్పుకోగలదు. అన్నిటికంటే, ఈహైస్కూలు లైబ్రరీ-'సరస్వతీ నిలయం'-ఏవిషయంలోను వేటికీ తీసిపోదు. ఆంధ్ర మహిళాసభ కాలేజ్ అఫ్ ఎడ్యుకేషన్ కు, ఈ హైస్కూలు, బి యి డి విద్యార్థుల శిక్షణకు, మోడల్ స్కూల్ గా వుంది. కేంద్రసంక్షేమ బోర్డు వారిచ్చిన కన్డెన్సుడుకోర్సు, వయోజనులైన స్త్రీలను-ఉస్మానియా విశ్వవిద్యాలయం మెట్రిక్యులేషన్ పరీక్షకు అర్హుల్నిగా శిక్షితుల్ని చేస్తూ, స్టేట్ సోషల్ వెల్ ఫేర్ ఎడ్వయిజరీ బోర్డువారి పర్యవేక్షణ క్రింద ప్రస్తుతం నిర్వహింప బడుతూంది. ఈ విద్యాలయానికి అర్థ బయటి ఆడిటోరియంగల 'గాంధీవేదిక' ఉండడం గొప్పసదుపాయం. దీంట్లోనిర్వహింపబడే కల్చరల్ ప్రోగ్రాములు, చక్కటి ముద్రలు, యేర్పడ్డానికి అనువైయున్న విద్యార్థినీ విద్యార్థుల లేత బుర్రలో, శాశ్వతముద్రలు వేయగలగుతున్నాయి. అలాగే ఆంధ్రమహిళా సభకుగల ఆకర్షణీయమైన అసెంబ్లీహాలులో, స్థిరంగా నిర్మించబడివున్న స్టేజి, రకరకాల కార్యక్రమాలు-లిటరరీ, కల్చరల్, డ్రమాటిక్ వగైరాలకు ఎంతో అనుగుణ్యంగావుంది ఈ సువిశాలమైన అసెంబ్లీ హాలులో ఎన్నెన్నో రెలిజియస్, సోషల్, కార్యక్రమాలు ఏర్పాటౌతుంటాయి. వీటిలో విద్యాలయ విద్యార్థినీ విద్యార్థులు తప్పనిసరిగా పాల్గొంటుంటారు. 'గాంధీవేదిక' ఆడిటోరియం ప్రక్కనే గాంధీ ఉద్యానవనం వుంది. ఇక్కడ సభలూ, జాతీయ సమావేశాలూ జరుగుతూంటాయి. మహిళా సభలోని, ఈ ప్రాంతాన్ని మాటల్లోవర్ణించి చెప్పలేం. ప్రత్యక్షంగా చూచి ఆనందించవలసిందే పెద్ద విద్యార్థినీ వసతి గృహంలో ఉండే విద్యార్థినులు, తరుచు, యీ ఉద్యానవనంలో కూర్చొని తమ పాఠాలు చదువుకుంటూ వుంటారు.

## ఆరోగ్య సదనాలు

ఆంధ్రమహిళాసభ నర్సింగ్ హోమ్ తన ప్రత్యేక. ఔన్నత్యంతో విరాజిల్లుతుంది. దీని ఔట్ పేషంట్ వార్డు ఎప్పుడూ హడావిడిగానే వుంటుంది. మేజర్ అపరేషన్లూ, మైనర్ అపరేషన్లూ, ప్రసవాలూ నిత్యంజరిగే కృత్యాలు, ఈ మెడికల్ కేంద్రం, మహిళాసభయొక్క ఎక్ స్టెన్ షన్ సర్వీస్- ప్రవీణులైన వారినుండి సలహా, చికిత్సా, సర్జరీకూడా పొందడానికని దీన్ని యేర్పాటు చేశారు. పురుషులకొక ప్రత్యేక వార్డుకూడా యేర్పాటు చేయబడింది. ఎక్సురే క్లినిక్, పేథొలాజికల్ లేబరేటరీ, ఫామిలీ ప్లానింగ్ క్లినిక్, తదితర శాఖలు, ప్రజానీకానికి సేవలుగావిస్తున్నాయి. ఆంధ్రమహిళాసభ, ఇంకా జనరల్ నర్సుల శిక్షణ, ఆగ్జిలరీ నర్సు-మంత్రసానుల శిక్షణా కూడా నిర్వహిస్తూంది. జట్టు తర్వాత జట్టుగా, తమ కర్తవ్యంలో సుశిక్షితులైన నర్సులు, సభ విడిచి వెడుతుంటారు సంగారెడ్డిలోను, మహబూబ్ నగర్ లోను కూడ నర్సుల శిక్షణ జరుగుతూవుంది. హైదరాబాదులోను, మద్రాసులోనుగల ఆంధ్రమహిళాసభ నర్సింగ్ హోముల్లో వలసిన సౌకర్యాలన్నీ-సొంతఎక్సురే యూనిట్లు, పేథోలాజికల్ లేబరేటరీలు వంటి వున్నాయి. ఇంకా ప్రత్యేక సలహా శాఖలు చెవి-ముక్కు-కంటి జబ్బులకు, చర్మరోగాలకు, నరాలకు సంబంధించిన రుగ్మతలకు-పీడియాట్రిక్సు వంటివన్నీ కూడ ఉన్నాయి. ఇన్ పేషెంట్లు గాక, ఏటేటా సుమారు 13 వేల మంది ఔట్ పేషెంట్లు చికిత్సలు పొందుతున్నారు.

ఆంధ్రమహిళాసభ విద్యానగర్ శాఖలో ప్రాంతీయ చేతిపనుల శిక్షణా కేంద్రంకూడా వుంది. తరతరాలుగానున్న దేశీయ చేతిపనుల్లో, ప్రక్కరాష్ట్రాలనుంచి వచ్చేవారిని కూడ చేర్చుకొని, అందరికీ శిక్షణ నివ్వడానికి వలసిన సౌకర్యాలు కలిగివుంది. వ్యక్తుల తత్వానికీ, అభిరుచులకూ, నైపుణ్యాలకూ, అవసరాలకు అనుగుణ్యమైన శిక్షణా తరగతులన్నీ వున్నాయి. శిక్షణాకేంద్రం

యొక్క స్థాయి ఎప్పుడూ తగ్గకుండా ఉచ్చస్థాయిలోనుండేటట్లు చూస్తూనే, మారుతున్న సంఘ అవసరాలకనుగుణ్యంగా నుండేటట్లు శిక్షణలిస్తూంది. దీంట్లో ఆల్ ఇండియా హ్యాండి క్రాఫ్టు బోర్డు నిర్ణయించిన సిలబస్ ప్రకారం చక్కటి శిక్షణనిచ్చే, వస్తూత్పత్తికనుగుణ్యమైన తర్ఫీదుగా కూడా వుంది. తరతరాలుగా వస్తున్న మన సాంప్రదాయాల్లో చేరిన బట్టల అద్దకం, చర్మపు పనులు, ఆట వస్తువుల తయారీ, వగైరా చేతిపనులతోబాటు బొటిక్, ఫ్యాబ్రిక్ ప్రింటింగ్, బేంబూవర్క్, నిర్మల్ పెయింటింగ్ వంటివి, సరికొత్త పద్ధతుల్లో నేర్పుతుంటారు. ఈ సంస్థలో తయారైన వస్తువులకు దేశం అంతట్లోనుగల విక్రయంతోబాటు విదేశాల్లో కూడ గొప్పగిరాకీవుంది. కేరళ మైసూర్, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లకు చెందిన విద్యార్థినులకు యిచ్చట శిక్షణ యియ్యబడుతూంది. శిక్షణ కాలంలో వారి వారికి గల అభిరుచులు, నైపుణ్యాలు, గణకట్టబడుతూ, తదనుగుణంగా, వారివారి తర్ఫీదులు మార్చబడుతూ వుండడంవల్ల, వారికీ దేశానికీగూడ ఉపయుక్తంగా వుంటూంది ఈ ప్రాంతీయ శిక్షణాకేంద్రంలోని శిక్షణ.

## సాహితీ రంగం

ఆంధ్ర మహిళాసభ తన 'మహిళాప్రెస్' ముద్రణాలయాన్ని గూర్చి సగర్వంగా చెప్పుకోగలదు. ఫారాలు, రిజిష్టర్లు, అకౌంటు పుస్తకాలేగాక, అన్నిశాఖలకు వలసిన స్టేషనరీ అవసరాలతోసహా, మనోజ్ఞంగానుండేట్టుగా అచ్చుపనుల అవసరాలన్నీ తీర్చగలుగుతూంది. ప్రయిమరీలు, రీడర్లు, లిటరెసీ ప్రాజెక్టులోగల అక్షరాస్యులకు వలసిన పాఠ్యగ్రంథాలన్నీ ఈప్రెస్‌లోనే తయారౌతాయి. బైట సంస్థలకు, ప్రభుత్వం వగైరాలకు విస్తారంగా కావలసిన వస్తూత్పత్తికి ఆర్డర్లు కూడ స్వీకరించి, చక్కగా తయారుచేసి యివ్వగలుగుతుంది. ముద్రణలో అన్నిరకాల అచ్చు అవసరాల్లోను చాతుర్యం కనబరుస్తూ తయారుచేయడం ఈ ప్రెస్‌యొక్క విశిష్టత. దీంట్లో ముద్రించబడుతూన్న 'విజయదుర్గ' అన్న ఆంధ్ర మహిళా సభ మాసపత్రిక, ఆయాశాఖల్లోని ప్రగతీ, విద్యా ప్రణాళికాలూ, విద్యాభివృద్ధికై ప్రాజెక్టులూ, స్త్రీ–శిశు–వికలాంగుల సంక్షేమం–పునరావాస కార్యక్రమాలూ మొదలైన అనేక విషయాలు తెలియజేస్తూంటూంది. ఈ ముద్రణాలయంలో అచ్చుకూర్పు, ముద్రణ, బుక్ బైండింగ్ పనుల్లో స్త్రీలకు శిక్షణకూడా యివ్వబడుతూంది.

ఇక ఉస్మానియా యూనివర్సిటీ ఇంజనీరింగు కాలేజీకెదురుగానున్న ఆంధ్రమహిళా సభ భవనాలూ, కార్యక్రమాలూ కూడా చూచినవారు, యీ సంస్థ వ్యవస్థాపకురాలైన డా॥ శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ గారి సంకల్పసిద్ధికీ, సామర్థ్యాలకు విస్మితులౌతుంటారు. అప్రయత్నంగా వారిచేతులు లేచిపోయి, జోడించి, నమస్కారాలు పెడతాయి; "ఈ యమ్మ సంకల్పిస్తే చాలు–ప్లేగు క్యాంపులు రూపాంతరంపొంది మహిళా సభ భవనాలతో నిండిపోతాయి; రాళ్లగుట్టలుండే ప్రదేశమంతా రమ్య హర్మ్యాలతో నిండిపోయి, కలకల్లాడుతూ కళ్లకూ మనస్సుకూ కూడా అవర్ణనీయమైన అనుభూతినీ, ఆనందాన్నీ చేకూరుస్తుంది" అని నా మాటలుగాదు, కళ్లారాచూచి పెద్ద పెద్దలు వెలిబుచ్చిన అభిప్రాయాలు. గాంధీజీ వంటి వ్యక్తిని మనం చూచేం గనుక నమ్ముతాం గాని, ముందుతరాల వాళ్లు నమ్మలేరని ఐన్‌స్టీన్ వంటి ప్రఖ్యాత శాస్త్రవేత్త అన్నాడు. అలాగే దుర్గాబాయమ్మగారూను పువ్వు పుట్టగానే పరిమళించినట్లు బాల్యంలోనే హిందీపాఠశాలనెలకొల్పారు; గాంధీజీ ఉపన్యాసాల్ని తర్జుమా చేస్తూ వారి అనుయాయులయ్యేరు; వారు వద్దన్నా, ఇంగ్లీషు చదువులకు వెళ్లి డిగ్రీలవెంట డిగ్రీలు పొంది లాయరయ్యేరు. ఉప్పు సత్యాగ్రహంలో స్త్రీలు పాల్గొనవద్దన్నా గాంధీజీని అంగీకరింపజేసేరు. ఈ రెంటిలోనూ 'నేనే తప్పు, నీవేరైటు' అని గాంధీజీచేత అనిపించగలిగేరు. కారాగారాల్లో సోలిటరీకన్‌ఫైన్‌మెంట్ శిక్షననుభవించి, విడుదలయ్యేక మంత్రి పదవుల వ్యామోహంలోబడక, నిర్మాణ కార్యక్రమం సాగించడానికీ మహిళాభ్యుదయానికీ మొదట మద్రాసులో ఆంధ్రమహిళాసభ ప్రారంభించేరు. కాన్‌స్టిట్యుయెంట్ అసెంబ్లీ మెంబరుగా ఢిల్లీ వెళ్లేరు. కొన్ని వేళల్లో అధ్యక్షిరాలుకూడా అయ్యారు; మళ్లీ మహాత్ముచేత సెభాస్ అనిపించేరు. దేశ సంక్షేమశాఖ ఛైర్మెనురాలై, దేశమంతటా పర్యటించి స్వచ్ఛంద సంస్థలకు కోట్లకొలది విరాళానేర్పరచేరు. ఆంధ్ర మహిళాసభ భవనాల ప్రథమ పునాది రాయిని గాంధీజీచేత దీవింపజేయించి, రాజాజీగారి చేతిమీదుగా వేయించారు. ఆనాడే అన్నాడాయన "దీనికంతకు కారణం ఒరుశక్తి, దుర్గాబాయ్ ఏన్‌రు ఒరుపెరియా శక్తి ఇరుకుదు!" అని. ఈ సంస్థభవనాలూ కార్యక్రమాలూ చూస్తూండగా "ఇంతింతై, వటుడింతయై, మరియు దానింతై, నభోవధిపైనంతై .." అన్న చందాన్ని–మనకళ్లముందే ఇలా బ్రహ్మాండమైన భవనాలూ బహుజనోపయోగమైన బహుళార్థ సాధకకార్యక్రమాలతో దేశవ్యాప్తంగా అపార సేవలుగావిస్తున్నాయి. ఇవన్నీచూస్తూ మంత్రముగ్ధులై మహామహులే అంజలి ఘటిస్తున్నారంటే అతిశయోక్తియేముంది? ఇక్కడి భవనాలు చూద్దాం, ఇలా రండి; అదిగో అది గొప్పలైబ్రరీ, ప్రత్యేకంగా నిర్మింపబడి ఆకర్షణీయంగావుంది. చుట్టూచూస్తే స్త్రీల ఆర్ట్సు సైన్సుకాలేజీ, విద్యార్థినుల వసతి గృహం, బి ఇ డి. కాలేజీ, నాన్‌రెసిడెన్షియల్ స్టూడెంట్స్ సెంటర్, వయోజన సాంఘికవిద్యా భవనం, లిటరెసీ హౌస్ (సాక్షరాస్వత భవన్) వంటి వున్నాయి. ఈ భవనం కేంద్రంగా రైతులకు వారివృత్తితో ముడివేయబడిన విద్యగరిపే కార్యక్రమం రాష్ట్రంలో 8 జిల్లాలలో. జిల్లా కొక బ్లాక్ చొప్పున అమలు జరుపుతూవుంది. ఇప్పటికి ఈ లిటెరెసీహౌస్ ప్రోగ్రాములవల్ల వేలాది వ్యవసాయికులు, వారి గృహిణులూ శిక్షణనంది లబ్ధినందేరు. ఈ ప్రాంగణంలో అన్నిటికంటె ఆకర్షణీయమైనదీ చూచి తీరవలసింది, అదిగో, అది 'గాంధీశతాబ్ది భవనం'. అప్రత్యేక సౌధనిర్మాణం దానిదే, మరెక్కడాలేదు. జాతిపిత సంస్మరణార్థం, గాంధీ శతాబ్ది ఉత్సవ సందర్భాల్లో, ఫాలో ఆఫ్ ప్రోగ్రాముగా నిర్మింబడింది. లోనికి వచ్చిచూడండి. గాంధీజీ జీవితంలోని ముఖ్య ఘట్టాలతో నిలువెత్తు సహజ రంగుల చిత్రపటాలు చుటూ అమర్చేరు. ఇవన్నీ ఆశ్చర్య తన్మయత్వాలతో, భక్తిప్రపత్తులతో ప్రేక్షకుల్ని తన్మయుల్నిచేస్తున్నాయిగదూ! ఆ భవనంలో (గాంధీజీ జీవితం–వ్రాతలతో కార్యక్రమాలూ, సమావేశాలూ ప్రార్థనలూ, భజనలూ ప్రత్యక్షంగావచ్చి చూస్తే మీకే తెలుస్తుంది. భవనం విడిచి వచ్చేస్తుంటే, గాంధీజీ జీవితంలో ఆఖరు ఘట్టం కని

పించి, కళ్లవెంట, అప్రయత్నంగా, అశ్రుబిందువులు బొటబొట రాలి తీరుతాయి! ఈ యమ్మపర్యవేక్షణ క్రింద ఆంధ్రరాష్ట్రంలోని 15 జిల్లాల్లో గాంధీ-కస్తూర్బాస్మారక భవనాలు నిర్మింపబడి, నిర్మాణ కార్యక్రమాలు సాగుతున్నాయి ......

ఇంతకూ లక్షలాది విలువగల భవనాల పరంపరగాదు-ఈ వ్యవస్థాపకురాలికి కావలసింది-ప్రజా సేవ; ముఖ్యంగా దీనజన సేవ, పతిత జనోద్ధరణ. స్త్రీ-శిశు-సంక్షేమం; కుంటి గుడ్డి-బధిర-వికలాంగుల సేవా-పునరావాసం సేవాతత్పరులైన సిబ్బందికీ "ప్రజోపయోగమైన సత్కార్యానికి డబ్బు అదేవస్తుంది; నిస్వార్థ సేవా పరులు అన్నిటికన్నా ముఖ్యం" అంటారీతల్లి. ఈ సభ వివిధ సంస్థల్లో పనిచేసేవారికీ, అందు తర్ఫీదై రాష్ట్రమంతట్లోను సేవలు గావిస్తూన్న వారికీగూడ, ఇదే ప్రధానలక్ష్యం. గాంధీ మహాత్ముడికి అత్యంత ప్రియమైన నిర్మాణకార్యక్రమాలు సరిగ్గా అమలు జరిగి, దేశం మళ్లీ పాడి-పంటలతో, సిరి-సంపదలతో తులతూగాలనీ, ప్రజలంతా ఆయురారోగ్య-ఐశ్వర్య-విజ్ఞానాభివృద్ధిగా వర్ధిల్లుతూ, దేశం పురోగమించాలన్నదే వీరి జీవితాశయం. ఆంధ్ర మహిళా సభ కార్యక్రమాల అంతరార్థమును, యధార్థం ఏమిటంటే వయోజన విద్య తనతోనే ప్రారంభించింది మహాత్ములు. మహామహులూ, మహిళా తల్లులూ తాము తరించబడడంతోబాటు తోటివార్ని అనేకుల్ని గూడ తరింపజేస్తారన్నది పరమ సత్యం. ఇలాంటివారి సమకాలికులమై మనడంగూడ గొప్ప అదృష్టమేను! ఐతే మన మన విధులు మనం ఎంతవరకు నిర్వర్తించ గలిగేం అన్నది ఎవరికివారే ఆత్మ పరీక్షవల్ల తేల్చుకోవలసి ఉంటుందని మనవి. ఇది కొంత ప్రత్యక్షంగా జిల్లాల్లో పర్యటనల్లో కూడ చూడొచ్చు. ఏ ప్రాంతానికి వెళ్లినా "మేము ఆంధ్ర మహిళా సభలో శిక్షణ పొందినవార" మని సగర్వంగా చెప్పుకునేవార్నీ "ఆరిపోయిందనుకున్న జీవితాలకు వెలుగు చూపించేరు-ఆ పుణ్యాత్ముల్ని దీపం పెట్టి మ్రొక్కుకుంటూ, యథోచిత సేవలుగావిస్తున్నాం" అని చెప్పుకునేవార్నీ చూస్తాం.

ఈ యమ్మకూ, ఈ యమ్మనుగన్న అమ్మకూ (కీ. శే. బెన్నూరి కృష్ణవేణమ్మగారికీ). వీరి ప్రియసోదరులకూ (అంటే ఆంధ్ర మహిళా సభ సెక్రటరీగా ఈ సంస్థ సాధించిన సర్వ కార్యక్రమాలకూ వెనుకనుంటూ, పై వారికి తెలియరాకుండా, పేరు ప్రఖ్యాతులకు భయపడుతూ! నిరాడంబరంగా కంప్యూటర్-బ్రైన్‌లా శ్రమిస్తూన్న శ్రీ బెన్నూరి నారాయణరావు గారికీ, వీరికి సహభాగులై అంతేవాసియై సలహాలిచ్చే మహానుభావుడు డా దేశ్‌ముఖ్‌గారికీ)-వీరందరి కృషికీ సేవలకూ ఆంధ్ర రాష్ట్రం యావత్ భారత దేశం, మహిళా లోకం చిరకాలం ఋణపడి ఉన్నాయి-ఉండాలి-ఉంటాయి.

వీరి వయోజన విద్యా సేవలకు నెహ్రూ ఎవార్డు, అపారమైన ఆంధ్రజన సేవకు నేషనల్ ఎవార్డు, ఇటీవల యీ పుణ్యదంపతులిరువురకూ 'పద్మవిభూషణ్' బిరుదులూయిచ్చి కేంద్ర ప్రభుత్వం తన్నుతానే గౌరవించుకుందని అంతా భావిస్తున్నారు. వీరిని, దయామయుడగు సర్వేశ్వరుడు, శతాయుష్కుల్నిగావించి, యిల్లే బహుముఖ సేవలు గావించుచుండేటట్లు అనుగ్రహించుగాక యని అంతాచేతులెత్తి అనుదినం మ్రొక్కుతున్నారు.

---



సీరియల్

# నిరాశలో నిండు గుండె


— సి. ఆనందారామం


జరిగిన కథ :

మిరాయికొట్టు ముసలమ్మ పక్షం వహించి పోలీసును కొట్టినందుకు జైలుశిక్ష అనుభవించి విడుదల అయ్యాడు చిరంజీవి. సి ఐ డి ఆఫీసర్ మోహన్‌తో పరిచయం పెంచుకుంటాడు.

కాలేజిమేట్స్ మోహన్, ప్రసూన అయాచితంగా హోటల్ లోటస్‌లో ఒకరికొకరు తారసపడతారు గతంలో ప్రేమలేఖ ఉదంతాన్ని తిరగదోడుకుని కబుర్లాడుకుంటారు ఇంతలో అక్కడికి నర్తకి రేఖ విలాసంగా వచ్చి పలకరిస్తుంది మోహన్ వెళ్ళిపోయిన తర్వాత యిన్నాళ్ళూ తన బ్యాగ్‌లో అపురూపంగా దాచుకున్న ప్రేమ లేఖను తీసి చూసుకుంటుంది ప్రసూన. ఇక మూడవ అధ్యాయం .........

## 3

చిరంజీవిని కలుసుకోవాలనుకున్నాడు మోహన్. తను సాధారణంగా సాయంత్రంవేళ పబ్లిక్ పార్క్‌లో ఉంటానని చెప్పాడు చిరంజీవి అక్కడ సాయంత్రం చాలామంది స్టూడెంట్స్ పోగవుతారు. వాళ్ళతో ఉంటానన్నాడు అందుకే పార్క్‌కి వచ్చాడు చిరంజీవికోసం వెతుకుతోన్న మోహన్ చూపులు ఒకచోట ఆగిపోయాయి రేఖతో కబుర్లు చెపుతూ కులాసాగా నవ్వుతున్నాడు శ్యామ్. మోహన్‌ను చూడగానే ఒక్కక్షణం గతుక్కుమన్నాడు. మరుక్షణమే తేరుకున్నాడు. ధైర్యంగా నవ్వుతూ "హలో! మోహన్!" అన్నాడు.

ఆనవ్వు వెకిలిగాఉంది. డాబుగాఉంది. అపాలజటిక్‌గా లేకపోలేదు కానీ, అంతకు మించి అధికారికంగా ఉంది.

రేఖ ఆశ్చర్యంగా శ్యామ్‌ను చూస్తూ "ఆయన నీకు తెలుసా?" అంది

"ఆ! మా అన్నయ్య!" గొప్పగా అన్నాడు శ్యామ్. రేఖ ఒక చెయ్యిమీద వెనక్కి వొరిగి విలాసంగా నవ్వుతూ "ఇతను మీ తమ్ముడా?" అంది.

ఆమాటలలో మాటలకందని మనసును తాకే వెటకారంఉంది.

మోహన్ సమాధానం చెప్పకుండా గిర్రున తిరిగి వెళ్ళిపోయాడు 'ఇతను నా తమ్ముడుకాదు.' అని మాత్రం అనలేకపోయాడు

శ్యామ్ తనను అన్నగా చెప్పుకుంటే బాగుండునని మోహన్ ఎంతో తపించిపోయిన రోజులెన్నో ఉన్నాయి. కానీ, ఆరోజుల్లో ఒక్కసారికూడా శ్యామ్ తననోటితో తను మోహన్‌ను అన్నగా ఎవ్వరికీ పరిచయం చెయ్యలేదు. అసలు మోహన్ మనసులో తపన శ్యామ్‌కు అర్థమయిందో, లేదో? శ్యామ్‌లాంటి వ్యక్తులు మాటలు మాత్రమే వినగలరు వాటి వెనకఉన్న ప్రాణాన్ని అర్థం చేసుకోలేరు వికసించిన సృష్టిలో రంగులు మాత్రమే చూడగలరు— ఆ వెనుక ఉన్న పరిమళాన్ని ఆస్వాదించలేరు.

మోహన్‌కు తను ఎవరికిపుట్టాడో తెలియదు కానీ ఎందరెందరి దయాభిక్ష మీద పెరిగాడో తెలుసు. ఆ దయ వెనకాల ఉన్న స్వార్థం తెలుసు. ఆ స్వార్థం వెనుక బుసలుకొట్టే క్రౌర్యం తెలుసు ఎలా కలిగిందో, ఏమైనా చదువుకోవాలనే పట్టుదల మాత్రం కలిగింది ఆ రోజు స్కూల్‌లో శ్యామ్‌ను చిన్నవాణ్ణి చేసి నిష్కారణంగా నలుగురు పెద్దవాళ్ళు చావ కొడుతున్నారు. మోహన్ చూడలేకపోయాడు. అడ్డుకున్నాడు ఏ ప్రాణికి కావలసిన రక్షణ ఆ ప్రాణికి ఏదో ఒకవిధంగా అందిస్తుంది ప్రకృతి. అందుకే ఒకపూట తిని మరొక పూట తినక గాలికి పెరిగే మోహన్ దృఢకాయుడయ్యాడు శ్యామ్‌ను కొడుతున్న వాళ్ళు మోహన్ ముందు నిలవలేకపోయారు శ్యామ్ కృతజ్ఞతతో చూశాడు—తన కేరియర్ విప్పుకుంటూ "నీ కేరియర్‌కూడా తెచ్చుకో!" అన్నాడు

"నాకు కేరియర్ లేదు. మధ్యాహ్నం అన్నం తెచ్చుకోను!" అన్నాడు మోహన్.

శ్యామ్ మోహన్ సంగతులన్నీ తెలుసుకున్నాడు. తన అన్నంలో సగం మోహన్‌కు పెట్టాడు.

ఆ సాయంత్రం మోహన్‌ని తనతో ఇంటికి తీసికెళ్ళాడు.

ఆ ఇల్లూ, ఆ వాతావరణమూ, స్వర్గలోకంలో అడుగు పెట్టినట్లు అనిపించింది. తండ్రి రాగానే "నా క్లాస్‌మేట్ నాన్నా!" అని పరిచయం చేశాడు శ్యామ్

మోహన్ ఆకారాన్ని చూసి ముఖం చిట్లించుకున్నాడు జనార్దన్. శ్యామ్ జరిగింది చెప్పగానే మోహన్‌ను చూసి ఆదరపూర్వకంగా నవ్వాడు అందుకే పొంగిపోయాడు మోహన్. శ్యామ్‌కు చిన్నతనంలోనే తల్లి పోయింది జనార్దన్ మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. "నువ్వు ఇవాళ ఇక్కడ ఉండిపో!" అన్నాడు శ్యామ్. మోహన్ సంతోషంగా ఒప్పుకున్నాడు ఆ రోజు శ్యామ్‌తో కలిసి డైనింగ్‌టేబిల్ మీద కూరలతో పచ్చళ్ళతో, భోజనం

చేస్తోంటే తన ఒళ్ళు తనకు తెలియలేదు మోహన్‌కు. 'ఎప్పుడూ ఇలా గడిచిపోతే ' అనుకున్నాడు గడవదని గ్రహించి నిట్టూర్చాడు

ఆ రాత్రి పుస్తకం తెరవకుండా పక్కమీద పడుకున్న శ్యామ్‌ను చూసి "రేపు ఇంగ్లీష్ టెస్ట్ కదూ ! చదువుకోవూ !" అన్నాడు మోహన్

"అబ్బా ! నాకు దెబ్బలు తగిలాయి—చదవలేను—" విసుగ్గా అన్నాడు శ్యామ్

"పోనీ ! నేను చదువుతాను వింటావా ?"

"చదువు "

మోహన్ ఉత్సాహంగా చదివి తనే వివరించి కూడా చెప్పాడు ఆదీ ఒక ఆటలాగే ఉంటే శ్రద్ధగా విన్నాడు శ్యామ్

ఆ మరునాడు శ్యామ్ బడికి తయారవుతోంటే మోహన్ కూడా కూడా ఉండి పుస్తకాలందించి, పెన్‌లో ఇంక్‌పోసి సహాయపడ్డాడు—ఈ అనుభవం శ్యామ్‌కి చాలా హాయిగా ఉంది

"నాన్నా! మోహన్‌ని మనదగ్గరే ఉంచేసుకుందాం ! పాపం, అతని కెవరూలేరు" అన్నాడు శ్యామ్.

జనార్దన్ ఒక్కక్షణం ఆలోచించి "సరే !" అన్నాడు పట్టరాని ఆనందంతో జనార్దన్ కాళ్ళకు నమస్కారం చేశాడు మోహన్ టక్కున కాళ్ళను వెనక్కు తీసుకున్నాడు జనార్దన్ అతనికి కొంచెం సిగ్గు కూడా వేసింది జనార్దన్ మోహన్‌ని తమ ఇంట్లో ఉంచుకోవడంలో ఉన్నది ఔదార్యం ఒక్కటేకాదు ఆ ఔదార్యాన్ని మించిన స్వార్థం ఉంది అతడు పోలీస్ ఆఫీసర్ మనుష్యుల్ని నిశితంగా పరిశీలించి వాళ్ళస్వభావాలు అంచనా వెయ్యగలడు ఒక్కపూట అన్నం తిన్నందుకే మోహన్ ప్రదర్శించిన అణకువ ఆయన దృష్టిని ఆకట్టుకుంది రాత్రి మోహన్ చదువుతున్నప్పుడు ఆయన విన్నాడు మోహన్ తెలివితేటల్లో ఆయనకు నమ్మకం కుదిరింది ఎన్నడూ తనంతట తాను శ్రద్ధగా చదవని శ్యామ్, ఏ ట్యూషన్ మాస్టర్‌కీ లొంగని శ్యామ్ — మోహన్ చదువుతుంటే శ్రద్ధగా వినడం కూడా గమనించాడు ఒక వయసులో పిల్లలకు పెద్దవాళ్ళకంటె, ట్యూషన్ మాస్టర్లకంటె స్నేహితులే ఎక్కువగా చెప్పగలరు మోహన్ అనాథ కావచ్చునేమో కాని అలగా పిల్లవాడిలాలేడు చదువుకోవాలనే పట్టుదలా, చదువులో ఆసక్తి, చదివినది గ్రహించి చెప్పగల చురుకుదనమూ కూడా కనిపిస్తున్నాయి తల్లిపోయాక శ్యామ్‌ను ఇంట్లో సరిగ్గా అదుపులో పెట్టేవాళ్ళు లేకపోయారు ఒక ముసలావిడ ఉంది కాని ఆవిడ మాట శ్యామ్ వినడు ఎప్పుడూ పనిలో మునిగితేలే జనార్దన్ శ్యామ్ సంగతి సరిగా పట్టించుకోలేక పోతున్నాడు ఇలాంటప్పుడు శ్యామ్‌కు మోహన్‌లాంటి స్నేహితుడు ఇంటోనే వుండటం మంచిదనుకున్నాడు జనార్దన్ శ్యామ్ ఇంటో వుండిపోవటం పరమానందంగా వుంది మోహన్‌కు

"నా బట్టలు ఇస్త్రీవెయ్యి—" "నా పుస్తకాలు సర్దు—" "ఆ టిఫిన్ ఇలా పట్రా—" అని శ్యామ్ ఆజ్ఞాపించటం మోహన్‌కు కష్టమనిపించ లేదు. అతడు ఇంతకు మించిపోయిన యీసడింపులు తిన్నాడు. పట్టెడు మెతుకులకోసం ఇంతకు మించిన బండ చాకిరీ చేశాడు.

శ్యామ్ మొదట్లో ఒక్క వారంరోజులు మోహన్ చదువుతోంటే శ్రద్ధగా విన్నాడు ఆ తరువాత 'కుక్కతోక వంకర' అన్నాడు వినటానికి కూడా విసుక్కుని నిద్రపోయేవాడు లేకపోతే రేడియో పెట్టుకునేవాడు రేడియో మ్రోగుతున్నా, తన కర్మాన తాను చదువుకునేవాడు మోహన్ శ్యామ్ పుణ్యమా అని మోహన్ చదువు పాడుచేసేవాడు కాదు

ప్రోగ్రెస్ రిపోర్ట్సు వచ్చాయి శ్యామ్‌కు అన్నింట్లోనూ తక్కువ మార్కులొచ్చాయి

"ఇదేమిటి శ్యామ్ !" అన్నాడు జనార్దన్

"పరీక్షల్లో నాకు తలతిరిగింది నాన్నా! వాంతులు కూడా అయ్యాయి తెల్లవార్లూ మేలుకొని పైత్యంచేసింది ఇవి క్వార్టర్లీ కదా ! పబ్లిక్‌లో మంచిమార్కులు తెచ్చుకుంటాను " అన్నాడు శ్యామ్ మోహన్ విని సహించలేక పోయాడు

"ఎందుకు శ్యామ్ అబద్ధాలాడతావు ? నేనెంత బ్రతిమాలినా వినకుండా ఆ డట్ట మేగజిన్స్ చదువుతూ కూర్చునే వాడివి నేను చదువుతాను వినమన్నా విసుక్కున్నావు మార్కులు ఎలావస్తాయి?"

శ్యామ్ మోహన్‌ను ఎఱ్ఱగా చూసి వెళ్ళిపోయాడు తరువాత జనార్దన్ గారు నెమ్మదిగా "శ్యామ్‌ను నువ్వు మందలించకు ఏదైనా ఉంటే నాకు చెప్పు నేను మందలిస్తాను" అన్నాడు

ఆ మాటల్లో 'శ్యామ్‌ను మందలించే హక్కు నీకు లేదు' అన్న భావం స్పష్టంగా అర్థమయింది మోహన్‌కు

మోహన్ ఒంటరిగా చిక్కగానే చాచి ఛెళ్ళున కొట్టాడు శ్యామ్

"రాస్కెల్ ! నాన్నతో నా మీద నేరం చెపుతావా ఇంకోసారి ఇలా చేశావంటే ఇక్కడి నుంచి వెళ్ళగొట్టిస్తాను .."

కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి మోహన్‌కి—శ్యామ్ కొట్టిన దెబ్బకి కాదు అక్కడి నుండి వెళ్ళిపోతే తన అవస్థ తలచుకుని...

వెళ్ళాలనే ఉద్దేశం మోహన్‌కికానీ, పంపెయ్యాలనే ఉద్దేశం శ్యామ్‌కి కానీ లేకపోవటం వల్ల ఆ ప్రస్తావన అక్కడితో ఆగిపోయింది

ఒకరోజు శ్యామ్, మోహన్, బడి నుంచి వస్తోంటే ముందు ఒక ఆడపిల్ల నడచివెళ్తోంది ఆ పిల్ల తెల్లటి పరికిణీ కట్టుకుంది ఆ పరికిణీ మీద రెడ్ ఇంక్ పెన్ విదిలించాడు శ్యామ్ అంతటితో ఆగక ఫ్రెండ్స్‌కందరికీ చూపించి అల్లరిచేసి నవ్వాడు ఆ పిల్ల బాధపడి వాళ్ళ అన్నకు చెప్పింది ఆ అబ్బాయి శ్యామ్ మీదకు వచ్చాడు శ్యామ్ భయపడి "మోహన్ !" అన్నాడు.

మోహన్ వెంటనే కదలలేక పోయాడు శ్యామ్ చేసింది తప్పు—అతడు దెబ్బలు తినవలసిందే—అనిపించింది

" మోహన్ ! " అన్నాడు శ్యామ్ మళ్ళీ ఆజ్ఞాపిస్తున్నట్లు ఏదోశక్తి తనను ముందుకు తోసినట్లు వెళ్ళి ఆ పిల్ల అన్నను చావబాదాడు మోహన్ ఆ రోజు రాత్రి మొదటిసారిగా విచిత్ర

మయిన అశాంతికి లోనయ్యాడు మోహన్. అంతకుముందెన్నడూ ఆకలితో మాడినప్పుడూ, అవమానాల పాలయినప్పుడూ కూడా అలాంటి అశాంతి కలగలేదు.

శ్యామ్ ఎలాగో కాపీలు కొట్టి పదోక్లాస్ పాసయ్యాడు కాని ఇంటర్ దాటలేక పోయాడు. శ్యామ్ ఫెయిలయి తను పాసయితే జనార్దన్ తనను బి. ఏ. చదివిస్తాడో, చదివించడో, అనుకున్నాడు కానీ జనార్దన్ మోహన్‌ను చదివించాడు "నీకు చదువులో అసక్తి, తెలివీ రెండూ ఉన్నాయి. చదువుకో! ఈ సారైనా శ్యామ్ పాస య్యేలా చూడు!" అన్నాడు జనార్దన్.

అనుభవం నేర్పిన పాఠంతో అలాటిది అసంభవమని చెప్పలేదు మోహన్ 'ఆలాగే నండి' అన్నాడు వినయంగా.

మోహన్ డిగ్రీ తీసుకునే సరికి అతి కష్టం మీద శ్యామ్ ఇంటర్ పాసయ్యాడు. అప్పటికి జనార్దన్ డి. జి. ఐ. అయ్యాడు. జనార్దన్ సహకారంతోనే మోహన్ సి ఐ డి. ఆఫీసర్ అయ్యాడు.

"మీకు నాకృతజ్ఞతలు ఎలా చెప్పుకోవాలో అర్థం కావటం లేదు......"అన్నాడు మోహన్ నిజంగా కదిలి పోతూ.

"శ్యామ్‌ను సొంత తమ్ముడిలా చూసుకో! వాడికి అన్ని వేళలా అండగాఉండు. నిజానికి ఇందుకే నేను నీకు సాయంచేశాను "

"అదిమీరు చెప్పాలా? శ్యామ్ నాకు తమ్ముడికంటె ఎక్కువ. శ్యామ్‌కు ఏ సహాయం చెయ్యాలన్నా నేను సిద్ధమే!" అన్నాడు మోహన్.

ఆ మాటలు మనస్ఫూర్తిగానే అన్నాడు. ఆ వాగ్దానం చెల్లించు కోవటానికి తను చెల్లించ వలసిన మూల్యమెంతో అతనికి ఆ తరువాత కాని తెలియలేదు.

మోహన్ చాలా స్ట్రిక్ట్ ఆఫీసర్‌గా పేరు సంపాదించు కున్నాడు. అందరూ అతణ్ణి గౌరవంతో చూసేవారు. సబార్డినేట్స్ భయభక్తులతో ఉండేవారు.

ఒక క్లబ్‌లో గేంబ్లింగ్ సాగుతోందని విన్నాడు మోహన్. అకస్మాత్తుగా రైడ్ చేశాడు. అక్కడ శ్యామ్‌ను చూసి నిర్ఘాంత పోయాడు. అందరితోపాటు శ్యామ్ కూడా అరెస్టయ్యాడు.

ఆ రోజు జనార్దన్ "శ్యామ్ అరెస్టయ్యాడా?" అన్నాడు. "అవునండీ" అన్నాడు మోహన్ తలవంచుకుని బాధపడుతూ.

"వాడు విడుదల అయ్యేలా చూడు." దిగ్గున తలెత్తాడు మోహన్ ఆశ్చర్యంగా చూస్తూ. జనార్దన్ పేలవంగా నవ్వాడు.

"అధికారం మన చేతుల్లో ఉన్నప్పుడు రూల్స్ ఎలాగైనా సర్దుకోవచ్చు—మనవాళ్ళను మనం ఆదుకోకపోతే ఎలా? నాకు శ్యామ్ ఒక్కడే కొడుకు. వాడి మీదే నా పంచప్రాణాలు. ఈ విషయం నలుగురికీ తెలిసి అల్లరికాకముందే శ్యామ్ బయట పడేలా చూడు." శ్యామ్ బయట పడ్డాడు

లోకమంతా తనను చూసి ఘొల్లున నవ్వినట్లయింది మోహన్‌కి. అందరూ తననే వేలెత్తి చూపుతున్నట్లు అనిపించేది. మానసికంగా ఘోర నరకం అనుభవించాడు వారం రోజుల వరకు ఎవరి ముందు వంచిన తల ఎత్త లేక పోయాడు.

ఆ తరువాత శ్యామ్ కారణంగా అప్పుడప్పుడు ఇలాటి నరకం అనుభవించటం తప్పనిసరి అయిపోయింది మోహన్‌కి,

ఇప్పుడు రేఖ ప్రక్కన శ్యామ్‌ను చూసేసరికి గుండె ఝల్లు మంది. ఎలా శ్యామ్‌ను రేఖనుండి విడతీయటం? తను చెపితే వినడు,

(సశేషం)



# ప్రాచీనాంధ్ర కవయిత్రులు

డాక్టర్ పి. యశోదా రెడ్డి

కాలప్రభావం చాల విచిత్రమైంది. అందుకే ప్రాచీనుడైన భాసమహాకవి "నిమ్నస్థలోత్పాదకోహి కాలః" అని కాలప్రభావాన్ని గూర్చి అతిగా ప్రశంసించినాడు అంతే కాదు, అసాధారణులైన అనుభవజ్ఞుల పలుకులు నిత్యసత్యాల నిరూపించుటకు నిదర్శనంగా ఆది యుగాది నుండి ఎన్నెన్నో అనుభవాలను రంగరించుకొని నిమ్నోన్నతాలలో పయనించిన స్త్రీ జనాభ్యుదయ రేఖ ఈనాడు శిఖరాధిరోహణం కావించినది. తత్ఫలితంగా ఈ సంవత్సరం అంతర్జాతీయ మహిళా సంవత్సరమైంది. పశుపతి పంచవక్త్రుడైన శివమూర్తి తన శక్తులన్నింటిని రుద్రాణికి అప్పనవెట్టి తాను వినోదించు చుండిన శుభవేళ, త్రివిక్రముడైన శౌరి శార్ఙ్గమును వీరావతారయైన సత్యభామ ముచ్చట దీర చేతి కందించి తాను సేదదేరు చుండిన విశ్రామ సమయము. అందుకే ఎన్ని నాళ్ల నుండియో మూగవోయిన మాతృత్తుకలన్ని ఒక్కసారి పలుక నేర్చినట్లున్నది. 'కాని స్త్రోత్రం కస్యన తుష్టయే' అని అన్నారు పెద్దలు. నిజానికి ఒక విషయాన్ని గూర్చి సంపూర్ణమైన జ్ఞానం అలవర్చుకోవలె అనే జిజ్ఞాస కలిగినవారు ఆ విషయ సంబంధిమైన పరిజ్ఞానం కలిగి వుండడం అవసరం.

ప్రపంచంలో స్త్రీ సర్వశ్రేయాలకు సర్వానర్థాలకు క్షేత్రభూతమైనట్టిది. స్త్రీ అనేపదం అత్యంత శక్తివంతమైనది. అల్పాక్షర సంశ్లిష్టమయ్యు మహామహిమాన్వితమైన ఓంకార శబ్దమువలె త్ర్యక్షర సంయోగరూపమైన ఈ స్త్రీ పదం కూడ ప్రభావ సంపన్నమైనది. స్త్రీ పుం సయోగోద్భవ రూపమైన సర్వజగత్సృష్టికీమె సమవాయి కారణము. అందుకే స్త్రీ పదానికి నిఘంటువు చెప్పునపుడు 'సూత్రి లేదా 'స్తోత్రి' అనగా "bearer of children" అనే అర్థంలో గ్రహించి చెప్పినారు. అంతేకాదు లోకంలో విద్యుత్తు వంటి చంచలములు, వారుణీవంటి సమ్మోహన కారకములు, ఉషస్సువంటి నిర్మలములు, హాలాహలము వంటి ప్రాణాంతకములైన వస్తుసంచయాలు స్త్రీ శబ్ద వాచ్యాలై కానవస్తున్నవి. అందుకే స్త్రీ కాశ్మీరరాగ రంజితము, విషలిప్తమైన కత్తివంటి దన్నారు కొందరు. అత్యంత ప్రభాసమన్వితములై పరస్పర విరుద్ధములైన గుణసంయోగానికి క్షేత్ర భూతయైన స్త్రీని గూర్చి ఆయా సమయ సదుపాయాదులను పురస్కరించుకొని "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" "స్త్రీ చిత్తం మహావిచిత్రమితి," "స్త్రీ వచః ప్రత్యేయోహంతి విచారం మహతామపి" "స్త్రీ బుద్ధి ప్రళయావహ" అనే మాటలు బయలుదేరినవి. విద్యాబుద్ధులు ఎవరికి ఈసునసూయలు కలిగింపవు? అయినప్పటికి ఆమె సహనానికి పెట్టినది పేరుగా ఓరిమిని ప్రదర్శించి దొరికినదే పదివేలుగా భావించి సాహిత్యరంగంలో కూడ తనవంతును చెల్లింప పూనుకొన్నది. ఆ పరంపరలో చరిత్ర చెప్పినంతవరకు తొలి తెలుగు కవయిత్రిగా కుమ్మరమొల్లను స్మరింపక తప్పదు.

## కవయిత్రి మొల్ల

మొల్ల కృతమైన కావ్యము రామాయణము సుకృతమైన ఈమె భాగ్య విశేషముచేత ఈ రామాయణము మొల్ల రామాయణమై ఈ నాటికిని నిలిచి ఉన్నది. ఈమె కావ్య క్రియాది విశేషముల నెరుగననుచు శ్రీకంఠ మల్లేశువరముచేత తాను కవిత్వము చెప్ప నేర్చినట్లు చెప్పినది. కాని కావ్యమును పరిశీలించి నప్పుడు ఈ కవయిత్రి వినయమునకు తక్కువ కాని వ్యుత్పత్తికలదిగా కన్పట్టుచున్నది. కావ్యములో అచ్చటచ్చట అవసరము వచ్చినప్పుడీమె వినయ కంచుకమును సడలించి ధీరయై నిర్ణయములొసగిన తావులు సయితములున్నవి. ఈమె భక్తాగ్రణియైన పోతనను తలపింప చేయుచు 'సల్లలిత ప్రతాపగుణసాగరుడై విలసిల్లి' న రామనరపాలకుస్తుతిజేయు జిహ్వకు 'చిల్లర రాజలోకమును జేకొని మెచ్చగ నిచ్చపుట్టునే' అని పలికినది. ఇట్లే మరొక్కచోట 'మును సంస్కృతమున దేటగదెవిగించెడిచో' అను పద్యములో సమకాలికులైన మహాకవులపై ఒక్క విసురు విసిరి 'తేనెసోక నోరు తీయనయగు రీతి తోడ నర్థము తోచుచుండవలెనని నిర్ణయము గావించినది. మొల్లతన గ్రంథములో సాధారణముగా కావ్యమును ప్రౌఢముగా చేయుటకు పనికి వచ్చు శ్లేషార్థఘటనలు, ఉపమా విశేషములు, సహజాలంకారములు, ఆరభటీ వృత్తులు, వస్తు చేష్టాదివర్ణనములేకాక మరొక్క విశేషమును ప్రవేశపెట్టినది. అది ఆమె స్త్రీ సహజమైన ఔచిత్యపరిపోషణము నకు నికషోపలము వంటిది. ఈమె రామాయణమున దశరథ మహారాజవర్ణన వ్యపదేశముతో

'కనగోరడొకనాడు గన్నుల పరవధూ
లావణ్య సౌభాగ్య లక్షణముల
వినగోరడొకనాడు వీనుల కింపుగా
గొలుచు వారలమీది కొండెములను'

అని రచించి, రాజులకు పరదారా గమనము, పరనిందా శ్రవణము పరమ పాపము-ను నీతిని చెప్పినది. ఇట్లే లోకవిద్రావణుడు పరకాంతోప భోగలోల్యము కలిగిన రావణుడు సకల సౌందర్యాధి దేవతయైన సీతను చూచి

"వ్రీడ యలంకారముగా
నాడుము భయముడిగి మధురమైన మృదూక్తుల్
బేడిసం నేలు కన్నులం
జూడుము కనువెప్పలెత్తి సుదతీ నన్నున్"

అని పలికినాడు. నిజమునకు రావణుడు స్త్రీయందు వ్రీడను అలంకారముగా తలచినాడోలేదోకాని మొల్ల మాత్రము స్త్రీలకి సిగ్గే సింగారముగా సంభావించి సభ్యతా రుచిని ప్రదర్శించినది. ఈమె అన్ని వర్ణనములు, చూపిన నేర్పులు, పోయిన పోకడలు ఒకఎత్తు, సీత రామునకు పంపిన సందేశమొకఎత్తుగా గణింపదగినది. రాముని దాసి అశోకవనియందు విరహవేదనాభరముతో కృశించిన దిక్కుతోచకుండిన సీతవద్దకు ఆంజనేయుడేతెంచి నప్పుడామె తన విరహాన్ని ప్రకాశింపచేసే చంద్ర, మన్మథ, మలయ మారుతోపాలంభనాలు కావింపలేదు కాని,

'ఏ యెడజూచిన ధరణి నాయకు శ్రీపాదయుగము నా చిత్తములో బాయదని' విన్న వింపుమనుచు పలికినది. అంతేకాక ఆమె నిడుద పెన్నెరి వేణి జడలుగా సవరించి, జీర్ణాంబరము కట్టి, భూమిరజము విభూతిగా పూసి నిరశనస్థితితో భూశయ్య పవళించి రామమూర్తిని చిత్తమున నిలిపి

"ఆహితలంకా మహాద్వీప గహనసీమ
దపము సేయుచునున్నాను తన్ను గూర్చి
నాకు ప్రత్యక్షమగుమని నాథునకు
విన్నవింపుము సత్వసంపన్న నీవు"

అని సందేశము పంపినది. ఇందు సీత ఒక మహాతపస్విని వలె గోచరించుచున్నది. ఆమె కఠోరతపమునకు ఫలముగా ఐహిక భోగములను కాని, చివరకు అమృతత్వమును కాని కోరలేదు, కాని కేవలము తననాథుడు, జగన్నాథుడైన రామ దర్శనమును మాత్రము కోరినది పతి దేవతలందరికి తలమానికమైన సీత శీలము నింత పరిశుద్ధముగా పరిపోషించి విరహతాపము నొక తపస్సు వలె తీర్చిదిద్దిన మొల్ల చిరస్మరణీయమైనది.

## తాళ్ళపాక తిమ్మక్క

మొల్ల కవయిత్రి తరువాత కాలక్రమాన్ని పురస్కరించుకొని చెప్పుకోదగిన కవయిత్రి తాళ్లపాక తిమ్మక్క. ఈమె తాళ్ళపాక అన్నమాచార్యుల భార్య. ఈ కవయిత్రి సుభద్రాకళ్యాణమును ద్విపద మంజరీ భేదరూపమని చెప్పదగిన గేయచ్ఛందములో రచించినది. ఈమె చేపట్టిన ఛందమువలెనే రచన సయితము స్త్రీపామరాదులను ఆనందపరచునదిగా సులభమై గేయానుకూలమై సాగిపోవు చుండును. ఉదాహరణమునకు శ్రీ కృష్ణబలరాములురైవత కోత్సవమునకు వెడలునప్పుడు——

"పప్పు బూరెలు నెయ్యి-పాయసాన్నములు
కాయగూరలు పెక్కు-కల వంటకాలు
ఊరగాయలు నెయ్యి-బొబ్బట్లు వడలు
గారెలు బూరెలు కందమండిగెలు
అరటి పండులును రా-జొన్నరాసులును
పిండి కూరలు మొదల్-పెద్దకుడుములును'

గరిగలఘటముల గంపలను నిచి సకల పౌరులు నడచినారట. ఈ రచనములోని వంటకాలు తెలుగు వారికి నోరూరించునవిగా నున్నవి. ఇట్లే మరొక్కచోట శ్రీకృష్ణుడు తన చెలియలు సుభద్రను

"అమ్మరా ముద్దుల - గుమ్మ రా వేగ
కొమ్మరానవకంపు - బొమ్మ రావమ్మ
పండువెన్నెల రావె - భాగీర్థి రావె
గండుకోవెల రావె - కమలాక్షి రావె
మచ్చెకంటి రావె - మాధవి రావె
అమృతంపు తెప్పరా - అరవిరి మొగ్గ
బంగారు పెట్టెరా - భాగ్యాల భరణి"

అని మురిపెముతో పిలిచినాడని రచించినది. ఈ రచనలో సుభద్ర నిజానికి కనకపు బొమ్మవలె, అమృతపు తెప్పవలె, పండువెన్నెల వలె చిత్తజుని బాణమువలె నడయాడనేర్చిన బంగారు ప్రతిమవలె మన మనోనేత్రాలకు గోచరిస్తూ, అల్లారుముద్దుగా పెరిగిన కలిగి నింటి ఆడపడుచు సౌభాగ్యాన్ని చాటుచున్నది.

ఈ సుభద్ర కురులు దువ్వి గుమ్మడిగింజానామము దీర్చి

"బసిడి ముత్యాల నా - ప్పగ పూర్ణచంద్రు
దనమించు చెవుల - తాటంకాలు చేర్చె
మొగపుతీగెకు చెంత - ముత్యంపు కొలికి
జిగిమణుల్ మిగులు - మంజిడితాళి జేసె
పుంజీలదండ దా - పున నేవళమ్ము
రంజిల్లు భన్నస - రమ్ము క్రీడించ
యిన్ని సొమ్ములకును - వన్నె బెట్టినటు
మూడువేల్ వెలసేయు - ముక్కెర బెట్టె"

అనుచు ఆమె నగల నలంకరింపుకొనిన విధానమును గూర్చి వ్రాసినది నిజముగా ఈనాడు ఇంకటి అభ్యుదయాన్ని పొందినామని పొంగి ప్రవహిస్తున్న మనము ఎరుగని 'మొగపుతీగె' పుంజాల దండ, భన్నసరము, నేవళము, మంజిడితాళి మొదలైన నగల పేర్లను చెప్పి ఉవ్విళ్ళూరింప చేసినది. ఆనాడు అన్ని అలంకార విశేషాలకన్న స్త్రీకి 'ముక్కెర' అధికతరమని భావించెడువారని తెలియజేసినది తిమ్మక్క. ఈ విధముగా ఈమె రచనము సహజమై సుందరమై గానానుకూలమై మరుపురానిదై యున్నది.

## సార సారస్వతధురీణ రంగాజమ్మ

విజయరాఘవనాయకుని విద్వత్సభామంటపమునకు మణిదీపిక వంటిది రంగాజమ్మ. ఈమె శృంగార రసతరంగిత పద కవిత్వ మహనీయమైనట్టిది. సారసారస్వత ధురీణయు, విచిత్రతరపత్రికా

శతలిఖిత వాచికార్థావగాహన ప్రవీణయు, అతులితాష్టభాషా కవితా సర్వంకష మనీషా విశేష విశారదయు, రాజనీతివిశారదయు, విజయ రాఘవమహీపాల విరచిత కనకాభిషేక గౌరవయు, విద్వత్కవి జన స్తవనీయ వివేకయు అయిన ఈమె మన్నారుదాస విలాస ప్రబంధము, మన్నారుదాస విలాస నాటకము, సంక్షేప భారత, భాగవత, రామాయణములును, ఉషాపరిణయ కావ్యమును రచించినట్లు తెలియుచున్నది. ఈమె ప్రతిభా వైదగ్ధ్యములను గూర్చి శతక్రతు శ్రీనివాస తాతాచార్యులుగారు 'భారతికి ప్రతివత్తువమ్మా! రంగాజమ్మా!' అనియు 'నెల్లొను పలుకుల నెలత నీముఖాంబుజ సీమన్' అనియు సంభావించినట్లుగా ఉషాపరిణయాది గ్రంథములు సాక్ష్యమొసగుచున్నవి.

కాలస్వభావమును బట్టి రంగాజమ్మ కవిత్వమునందు సయితము అతివేల శృంగారచ్ఛాయలు లేకపోలేదు అయ్యును ఈమె గ్రంథములందచ్చటచ్చట ప్రవేశపెట్టిన పద్యములు నాటి సాంఘిక వ్యవస్థను అద్దమునందువలె ప్రతిబింబింప చేయుచున్నవి. ఉదాహరణమునకు—విజరాఘవుడుకై చేసికొనిన విధానమును గూర్చి—

"నెలత యొక్కతె చేరి నిలువుటద్దముపట్టె
జెలువ యొక్కతె యోరసిగ యొనర్చె
చంద్రాస్య యొక్కతె జాజిసరుల్ సుట్టె
జాణయొక్కతె రుమాల్ జాలుఁగట్టె
గలికియొక్కతె దిద్దెఁగస్తూరి తిలకంబుఁ
కనకాంగి యొకతె చేకట్లు వెట్టె
జాణయొక్కతె బురుసాహీ జారును బూన్చె
సకియ యొక్కతె యఱపట్ట దొడిగె

దరుణి యొక్కతె హరువుగా దట్టిగట్టె
వనిత యొకతె దుప్పటి వలెవాటువైచె
పడతి యొకతె చెవుల జవ్వాది యుంచె
గొమ్మ యొక్కతె కుంకుమ నెమ్మినలదె

అని రచించినది. ఈ పద్యము ఆ నాటి రాజపుత్రుల అలంకారాది ఆహార విశేష మంతయు మన కన్నుల క్రేలునట్లు చేయుచున్నది. అంతేకాక నాటి సంఘము నందు స్త్రీ పురుష భేదము లేక అందరును సర్వాభరణములను ధరించెడి వారని తెలియుచున్నది. గట్టిగట్టి అరచుట్ట (మన Waist coat వంటిది) తొడిగి, దుప్పటిని వలెవాటువైచి, బురుసాహిజారు (కత్తిని) బూనిన రాకుమారుడు నిడుద కురులు పెంచి, యోరసిగ వేసి సంపంగి పువ్వులు తురుముకొని, కస్తూరి తిలకము తీర్చుకొనుటేకాక, పాదమున బిరుదు పెండెము, చేతుల కెంపుల కడియాలు, ఉరమున గోపాలతాళి, వీనుల వజ్రాల మురువులు ధరించుచుండెడివారట.

ఉషాపరిణయములో రంగాజమ్మ నాటి సంఘమునందు స్త్రీలు సాధారణముగా ఆడుకొను ఆటలను విరహ తప్తయైన ఉషాదేవి ఆడనొల్లకుండెనను నెపమున తెలియపరిచినది. ఉదాహరణకు:

'అతివ దాఁగిలిముచ్చటాడుదమన్నను
సమ్మతించ దొకింతఁ జంద్రవదన
చెండు గోరింతము చెలియ! రమ్మని పిల్వఁ
గనులిచ్చి చూడదు కలువ కంటి
గుజగుజ రేకుల కొమ్మ! యాడుదమన్న
మోమెత్తి చూడదు ముద్దుగుమ్మ
పగడసాల మనము పడతి యాడుదమన్నఁ
బలుకదు మనతోఁ బద్మనయన
యతివ చదరంగ మాడుదమనుచు బిల్వ
నించుకైనను నంగీకరించదయ్యె"

అని రచించిన పద్యపాదములను బేర్కొనవచ్చును. ఇందు దాగిలి ముచ్చటలు, చెండు గోరించుట (బంతియాట) గుజగుజ రేకులు, పగడసాల, చదరంగము, మున్నగు ఆటలు పేర్కొనబడినవి.

రంగాజమ్మ మన్నారు దాస విలాస నాటకములో స్త్రీకి సంఘములో గల స్థానమును, అద్దమునందు వలె ప్రదర్శింపజేసినది. సర్వసాధారణముగా స్త్రీకి కోరిన వరుడు లభించుటే కోటి నోముల పంటగా నాడు భావించబడుచుండెడిదనుట కుదాహరణముగా కాంతిమతిని గ్రహింపవచ్చును. వయో రూప లావణ్య విభవయై, ఉన్నత వంశ సంజాతయైన కాంతి మతి సయితము ఎఱుక సానిని పిలిచి ఎఱుక అడిగినది. ఆ ఎఱుకత ఎఱుక చెప్పగా అది తన ఎద తాకినప్పుడు దానియొకని చేటెడు బియ్యము నరి ముత్యాలు నింపి పంపినదట. ఇంతేకాక కాంతి మతీ వివాహ సందర్భమున వివాహ ప్రధాన హోమాది శుభ కర్మలతో కూడ ముత్తైదువులు ధవళములు, శోభనములు, జోలలు పాడినట్లు వర్ణించి ఆ నాటి వివాహ మంగళ కౌతుక తంతువును మన కన్నుల ఎదుట జరిపించినది.

బహుభాషా విశారదయైన రంగాజమ్మ తన గ్రంథములందనేక చోట్ల ఆయా ప్రాంతాలకు ఆయా వేష భాషాదులనుపయోగించి కావ్యమున కొక సహజత సమకూర్చుటే కాక ఔచిత్య పోషణము గావించుచు ఒక నవ్యతను ప్రదర్శించినది. ఉదహరణమునకు—

నిడుద కుళ్ళాయలు నిండు చోగలుఁబూని సడిసన్న నగరి యన్నగార్లు 'శామిపరాక్కు' కెళక్కేమన్నారు కోవిల్లె యిరుందుం పంగు నిత్తిరుణాళుక్కు తెలంగాయ వాంగ! అనుచు ప్రవేశింపగా, నంబులు, మణీ ముకురంబులు, మెఱుంగు కుండలములు, మేలు కుళ్ళాయిలు, సరిగ దుప్పటులు ధరించి వచ్చినారట మౌహూర్తికులు పట్టె వర్ధనములు, పంచాంగములు పట్టి ప్రభుసమ్ముఖానకు వచ్చినారట. ఇక సిద్ధాంతికులు "భైరవ జోస్యులు నేరని మాటలే ఆడుదువు, చక్కంగా అశ్విని, భరణి, కృత్తికలు గురు తెరుంగవు. నీకు పంచంగం విప్రేడిన్నా నీ భవిషికి" అని తగవులాడుచు ప్రవేశించినారు.

(తరువాయి వచ్చే సంచికలో)

## త్యాగమయి
# మాగంటి అన్నపూర్ణాదేవి

ఆర్. సుగుణాదేవి

**1921** సంవత్సరంలో ఆంధ్రదేశ సంచారంలో మహాత్మాగాంధీ బెజవాడలో మహిళా సదస్సులో విరాళాలకై విజ్ఞప్తి చేశారు. ఓం ప్రథమంగా ఒక చిన్న బాలిక తన విలువైన నగలను—బరువైన గొలుసు గాజుల జత సహా—గాంధీజీకి అర్పించేందుకు ముందుకు వచ్చింది. మహాత్ముడామెను "నీ తల్లి దండ్రుల అనుమతి పొందావా!" అని ప్రశ్నించారు. అందుకామె "నా తల్లి దండ్రులు నా ఇష్టానికి అడ్డురారు" అంటూ చక్కని ఆంగ్లంలో బదులు చెప్పగా గాంధీజీతో పాటు సభికులందరు విస్మయ చకితులైనారు. ఆ బాలికయే మాగంటి అన్నపూర్ణాదేవి

స్వాతంత్ర ఉద్యమంలో జీవితాన్ని తృణప్రాయంగా తలపోసి తుదివరకు పోరాడిన వీరవనిత అన్నపూర్ణాదేవి.

కలకత్తాలోని బేథూన్ కళాశాలలో విద్య నభ్యసించిన అన్నపూర్ణాదేవి బాల్యంనుండీ దేశభక్తి పుణికి పుచ్చుకున్నది. స్త్రీల నుండి అధిక మొత్తాలు విరాళాలు ప్రోగుచేసెడిది. కాకినాడలోని మహిళా స్వచ్ఛంద సేవకులకు నాయకత్వం వహించి ఆమె సల్పిన నిర్విరామ కృషి శ్లాఘనీయం.

ఆమె భర్త శ్రీ బాపినీడు అమెరికాలో విద్య నభ్యసించినవారు. ఆమె విదేశం వెడుతున్న భర్తతో మీరు నన్ను మరచిననూ మాతృదేశాన్ని మరవ వలదని కోరిన దేశభక్తి పరాయిణ అన్నపూర్ణాదేవి.

## ఖద్దరు ప్రచారం

గాంధీజీ ఆమెను ఖద్దరు ప్రచారాన్ని విరివిగా చేయవలసినదిగా కోరారు. గాంధీజీ మాటను ఆమె అక్షరాలా పాటించింది. అమెరికానుండి తిరిగివచ్చిన భర్తను ఆమె కోరిన మొదటి కోరిక ఖద్దరు ధరించమని మాత్రమే! ఏలూరులోని వారింటిలో ఖద్దరుకు తప్ప మరొక రకం దుస్తులకు తావులేకపోయింది. అనారోగ్యంతో అస్థిపంజరంగా తయారై శరీరం వ్రణబాధతో నిండినప్పటికీ ఆమె ఖద్దరు ధారణ మానలేదు. తుదకు ఆమె ఖద్దరు దుస్తులతోనే సమాధి చేయబడటం గమనార్హం.

గాంధీజీ మద్రాసు పర్యటన సందర్భంగా మాగంటి దంపతులు శ్రీనివాసయ్యంగార్ యింటిలో మహాత్ముని దర్శించారు. ఆరోగ్య విషయంలో శ్రద్ధ వహించవలసినదిగా శ్రీమతి అన్నపూర్ణకు, ఆమెకు తగు సపర్యలు చేయవలసినదిగా ఆమె భర్తకు ఆదేశమిచ్చారు బాపూజీ. కాని ఆరోగ్య విషయంలో ఆమె చాలా నిర్లక్ష్యం చేసింది. సహాయ నిరాకరణోద్యమ విస్తృత ప్రచారమే ఆమె చావుకు కారణమైంది. ఆమెపై ఆశ వదలుకున్న డాక్టర్లను కూడా తానింకా జీవించగలనని సవాలు చేసింది.

ఆమె చక్కని రచయిత్రి కూడా. స్త్రీల సమస్యలపైన వ్యాసాలు వెలువరించింది రామకృష్ణుని బోధనలను బెంగాలీనుండి అనువదించింది.

## అత్యంత విధేయురాలు

అన్నపూర్ణాదేవి మృతినందినంతట గాంధీజీ విచారం ప్రకటించిన తీరు ఆమెపట్ల మహాత్మునికి గల గౌరవానికి ప్రబల నిదర్శనం. 1972 అక్టోబరు 27 తేదీగల "యంగ్ ఇండియా"లో గాంధీజీ ఇలా వ్రాశారు. "నేనొక అత్యంత విధేయమైన అనుచరుని కంటె మిన్నగా కోల్పోయాను. భారత దేశంలో నా భాగ్యంగా ఎన్నబడే అనేక మంది నా కుమార్తెలలో ఆమె ఒకరు. వీరందరిలో ఆమె మిన్నకూడా. సడలని సంకల్పంతో పొగడ్తలను ఆశించక ఆమె కృషిచేసేది".

అసంఖ్యాకంగా యువతీ యువకులు ఈ గొప్ప మహిళను అనుకరించి తమ జీవితాలను త్యాగం చేసిననాడు పలువురు ఆశించే విధంగా స్వేచ్ఛకు, పవిత్రతకు స్థావరమైన పూర్వ భారత స్థాయి తిరిగి లభ్యం కాగలదనడంలో సందేహం లేదు.



# స్త్రీలు - ఉద్యోగాలు

పరిమళా సోమేశ్వర్

"స్త్రీలు ఉద్యోగాలుచెయ్యటం అవసరమా ?" అనీ, "స్త్రీలు ఎందుకు ఉద్యోగాలు చేస్తున్నారు ?" అనీ యిప్పటికీ తరచు ప్రశ్నలు వినిపిస్తుంటాయి అయితే ఒక్క విషయం సమాజాన్ని ఆర్థిక స్థితి గతుల దృష్ట్యా ఉన్నతవర్గం, మధ్య తరగతి వర్గం, క్రింది తరగతి వర్గం - అంటూ మూడు వర్గాలుగా విభజించినట్లయితే — పైన చెప్పిన ప్రశ్నలు మనకు మధ్యతరగతి వర్గానికి సంబంధించిన స్త్రీల విషయంలోనే ఎదురవుతున్నాయని గ్రహించవచ్చు.



ఉన్నత వర్గాలలోని స్త్రీలు - అనగా ఒక పరిమితిని మించి విశేషంగా భర్తలు ధనార్జనచేసే కుటుంబాలలోని స్త్రీలు సాధారణంగా నెల జీతాలకోసం ఉద్యోగాలు చెయ్యరు. చెదురుమదురుగా ఒకరిద్దరు చేసినా వారు పెద్ద పెద్ద ప్రైవేటు కంపెనీలలోను, వ్యాపార సంస్థల లోను ఉన్నతమైన పదవులలో ఉండటం కద్దు ఉన్నత వర్గాలలోని స్త్రీలు—చదువుకుని ఒకటి రెండు డిగ్రీలు కలిగి ఉన్నప్పటికీ వారు గృహాలంకరణ, ఫాబ్రిక్ పెయింటింగ్, ప్లాస్టిక్ బుట్టలల్లటం మొదలైన 'ఫెమినైన్ హాబీస్' (feminine hobbies) తోనే కాలక్షేపం చేస్తుంటారు కాస్త చురుకుదనం పాలెక్కువ ఉన్నవారైతే స్త్రీ, శిశు సంక్షేమ కార్యక్రమాలలోను, సాంఘిక సంక్షేమ కార్యక్రమాల్లోనూ పాల్గొంటారు వీళ్లు చేసే పనులను 'హాబీ' లనీ సేవా కార్యక్రమాలనీ అంటారు తప్ప ఉద్యోగాలు అని అనరు

ఇక క్రింది తరగతి స్త్రీలనెవ్వరూ "మీరెందుకు ఉద్యోగం చేస్తున్నారు ?" అని అడగరు అలా అడగవలసిన అవసరం కూడా లేదు ఎందుకంటే వాళ్లు పనిచేసేది పొట్టకూటికోసమేనని అందరికీ తెలుసు స్త్రీపురుషులిరువురూ కష్టపడి పనిచేసినా రెండు పూట్లా భోజనం దొరుకుతుందన్న గ్యారంటీలేని జీవితాలు వాళ్లవి అందువల్ల స్త్రీలు వంటపనితోపాటు బయటపన్లు చెయ్యటాన్ని అవసరమైన అతిసహజమైన విషయంగా అందరూ భావిస్తారు

పోతే మధ్యతరగతి కుటుంబాలలోని స్త్రీల ఉద్యోగాలను గురించే తర్జన భర్జనలు జరుగుతుంటాయి స్త్రీకి విద్య అవసరమా? అంటూ ఒకప్పుడు హైస్కూళ్లలో వ్యాస రచన పోటీలు, డిబేటింగులు నిర్వహిస్తుండేవారు అప్పుడు స్త్రీలకు 'కూడా' విద్య అవసరమనీ, పిల్లలను భావిభారత పౌరులుగా తీర్చిదిద్దే స్త్రీ విద్యావంతురాలై ఉండాలనీ–ఎంతో కష్టపడి పాపం స్త్రీవిద్యను సమర్థిస్తూ విద్యార్థినీ విద్యార్థులు వ్యాసాలు వ్రాయటం చర్చలలో పాల్గొనటం



జరిగేది. ఇప్పుడు అమ్మాయిలు, అబ్బాయిలు కలసి చదువుకొనటంతో ఆ ప్రసక్తి అంతగా రావటం లేదు. పైగా అబ్బాయిల కంటె అమ్మాయిలే శ్రద్ధగా చదువుతున్నారనీ మంచి మార్కులతో ప్యాసవుతారనీ తల్లిదండ్రులు ఉపాధ్యాయులూ కూడా గ్రహించటం వల్ల ఆడపిల్లల చదువుగురించి ఎవ్వరూ నిరుత్సాహంగా మాట్లాడటం లేదు.

## వరుణ్ణి కొనేవరకే!

అయితే ఇప్పటికీ చాలామంది మధ్యతరగతి కుటుంబాలలోని వాళ్లు చదువు అనేది అమ్మాయిల పెళ్లిళ్లకు కావలసిన అర్హతలలో ఒకటి అని భావిస్తున్నారే తప్ప మనోవికాసానికి మనుగడకు ఉపయోగపడేదన్న సంగతిని గ్రహించటం లేదు. అందుకే పెళ్లయ్యే వరకు ఆడపిల్లలకు చదువు చెప్పించటం, లేదా చదువగానే పెళ్లి చేయటం జరుగుతోంది. అమ్మాయికి లభించిన స్కూలు సర్టిఫికేటు గాని, డిగ్రీ సర్టిఫికేటుగాని వరుణ్ణి కొనుక్కునే సమయంవరకే అక్కరకు వస్తోంది తప్ప పెళ్లయిన తరువాత ఆమె చదువువల్ల ఆమెకుగాని కుటుంబానికిగాని చెప్పుకోదగ్గంత ఉపయోగమేమీ ఉండటం లేదు.

ఇటీవలగా చదువుతున్న స్త్రీలు చాలామంది ఉద్యోగాలు చెయ్యటానికి ఉత్సాహపడుతున్నారు. ఆర్థిక స్వాతంత్ర్యం ఉండాలనీ, తమ వ్యక్తిత్వానికి గుర్తింపు కలగాలనీ, తాము నేర్చుకున్న చదువును సద్వినియోగపరచుకోవాలనీ, 'ఫలానావారి అమ్మాయి'గానో 'ఫలానా ఆయన భార్య'గానో కాక తనకితానుగా సంఘంలో గుర్తింపబడాలనీ స్త్రీలలో చాలామంది భావించటంవల్ల అవకాశం లభిస్తే చాలు–ఉద్యోగాల్లో చేరుతున్నారు.

ఐతే స్త్రీలు ఉద్యోగాలుచేస్తే ఫరవాలేదు "అనుకోవటం మొదలెట్టేక "ఎలాటి ఉద్యోగాలు చెయ్యాలి?" అన్నది చర్చనీయాంశం అయింది కొన్నాళ్లు. ఆడవాళ్ల మనస్తత్వాన్నిబట్టి టీచర్లుగాను డాక్టర్లుగాను బాగా రాణిస్తారని భావించటంవల్లనూ, ఆ రెండు రకాల ఉద్యోగాలు మాత్రమే "గౌరవనీయమైనవి" (అంటే అర్థమేమిటో వాళ్లకే సరిగ్గా తెలియదు) అన్న ఉద్దేశ్యం ఉండటం వల్లనూ, తల్లిదండ్రులు తమ కూతుళ్లను ఆ రెండు రకాల ఉద్యోగాలను మాత్రమే చెయ్యనిచ్చేవాళ్లు.

ఆడవాళ్లు ఆఫీసుల్లో క్లర్కులుగా పని చెయ్యటం నామోషీగా భావించేవాళ్లు. టైపిస్టులుగాను, స్టెనోలుగాను, టెలిఫోన్ ఆపరేటర్లుగాను చేరిన స్త్రీలందరికీ మంచి నడవడి ఉండదనీ, వాళ్లను 'బాస్'లు వలలో వేసుకుంటారనీ యిప్పటికీ చాలామందికో పెద్ద అనుమానం ఉంది. స్టెనోగా చేరిన ఆడపిల్ల తన పాతివ్రత్యాన్నీ, ఉద్యోగాన్నీ కాపాడుకోవటానికి ఎన్నో అవస్థలు పడుతున్నట్లు నవలల్లో రచయితలు వర్ణిస్తూంటారు. ముసలి తండ్రిని, జబ్బుల తల్లినీ తమ్ముళ్లనీ, చెల్లెళ్లనూ ఆదుకునేందుకు కథానాయిక ఉద్యోగంలో చేరినట్లు, ఆఫీసులోని మగవాళ్ళంతా ఆమెకు వలపన్ని ఆమెను పాడుచేయటమే తమ జీవిత లక్ష్యం అయినట్లు ప్రవర్తిం



చటం-యిలాటి క్లిష్ట పరిస్థితులలో యిరుక్కున్న నాయిక అటు కన్యాత్వాన్నో, యిటు ఉద్యోగాన్నో వదులుకోవటంతో — కథ సమాప్తమౌతుంది. ఇలాటి కథలు నవలల్లోనేకాక యీ మధ్య సినిమాల్లో కూడా తరచు కనపడుతున్నయ్. వాస్తవికతకు దూరంగా ఉన్న అలాటి కథలను చదువుతుంటే (చూస్తుంటే) స్త్రీల ఉద్యోగాలను గురించి యిప్పటికీ చాల మందికి సరియైన అవగాహన లేదని తెలుస్తోంది. చెడునడతలుగల స్త్రీలు కొందరుండవచ్చు. ఉద్యోగస్తులలోనే అలాటి వాళ్లుంటారనుకోవటం తెలివితక్కువ. చెడిపోవటానికి చదువుకుని ఉద్యోగాలే చెయ్యాలా? నాలుగు గోడల మధ్య పర్దాచాటున ఉండి కూడా చెడిపోవటానికి అవకాశాలున్నయ్. పైగా బలాత్కారాలు, క్లిష్టసమస్యలు కథల్లో ఉన్నంత విరివిగా, సహజంగా వాస్తవిక జీవితంలో జరగవు. ఎక్కడో చెదురుమదురుగా జరిగే సంఘటనలను గోరంతలు కొండంతలుగా చేసి కథలు వ్రాయటం వల్లను, సినిమాలు తీయటం వల్లను వాస్తవిక జీవితాన్ని గురించి సామాన్య ప్రజలు అనేకమైన అపోహలను పెంచుకునే అవకాశం ఉంది.

అందుకే స్టెనోలు, టైపిస్టులు తమ భర్తలను వల్లోవేసుకుపోతారని ఆఫీసర్ల భార్యలు, తమ కూతుళ్లు అధికారుల ఇనుప హస్తాల్లో నలిగి పోతారేమోనని ఉద్యోగినుల తల్లిదండ్రులు భయపడ నవసరం లేదు. నిజాయితీగా నిబ్బరంగా ఉన్న ఆడదాని జీవితాన్ని నాశనం చేసే దుష్ట పురుషులు మన సమాజంలో యిప్పటి వరకైతే లేరు. కొన్ని మినహాయింపులుండ వచ్చు. కాని ఆ మినహాయింపులే సాహిత్యంలోను, సినిమాల్లోను తరచు కనపడటం మన దురదృష్టం.

కథల్లోను, సినిమాల్లోను తమని గురించి ఎలా చిత్రిస్తున్నా ఆడవాళ్లు ఉద్యోగాలు చెయ్యటం మానటంలేదు. స్కూళ్లలో, కాలేజీల్లో ప్రభుత్వ కార్యాలయాల్లో, బ్యాంకులలో, ప్రైవేటు సంస్థలలో, సైంటిఫిక్ సంస్థలలో ఎంతో మంది స్త్రీలు ఉద్యోగాలు చేస్తున్నారు. బొంబే, కలకత్తా, ఢిల్లీ వంటి నగరాలలో కొన్ని ఆఫీసులలో మగవాళ్ల కంటే ఆడవాళ్లే ఎక్కువ మంది ఉన్నారా అని భ్రమపడేంత సంఖ్యలో ఉద్యోగినులున్నారు. హాస్పిటళ్లలోనర్సుల సంఖ్యను గురించి వేరే చెప్పనక్కర్లేదు. మన దేశంలో స్త్రీలు మొట్టమొదటగా అధిక సంఖ్యలో చేబట్టిన ఉద్యోగాలలో నర్సు వృత్తి ఒకటి అని చెప్పవచ్చు. పెళ్ళికాని ఆడవాళ్లు పెళ్లి, సంసారం అక్కర్లేదనుకున్నఆడవాళ్లే నర్సులుగా చేర్తారని ఒకప్పుడనుకునేవారు. కాని మిగతా ఉద్యోగినులు చాలా మందిలాగానే (అవకాశం ఉంటే) పెళ్లిచేసుకుని సుఖంగా సంసారాలు చేసుకుంటున్న నర్సులు యీరోజుల్లో కోకొల్లలుగా కనపడతారు మనకి. ఏ వృత్తికైనా ఆ వృత్తిలోని వ్యక్తుల సంస్కారాన్నిబట్టి గౌరవం లభిస్తుందన్న నిజాన్ని ఋజువు చేసే ఉద్యోగినులు ప్రతి సంస్థలోనూ మనకి తరచు కనబడుతూనే ఉన్నారు. ఆఫీసుల్లోను, విద్యాసంస్థలలోనేగాక పత్రికాఫీసులలోను, రేడియో, టెలివిజన్ సంస్థలలోను ఉద్యోగం చేస్తున్న స్త్రీలు విరివిగా ఉన్నారు. సిటీలలోనేకాక చిన్న చిన్న టౌన్లలోను, పల్లెలలోను కూడా తల్లిదండ్రులు అవకాశాలనిబట్టి తమ కూతుళ్లచేత ఉద్యోగాలు చేయిస్తున్నారు. ఈ రోజుల్లో ఉద్యోగాలు దొరకటమే కష్టంగాని, దొరికితే చెయ్యటానికి మగవాళ్లతోపాటు ఆడవాళ్లు కూడాసిద్ధమే.

చిన్నచిన్న ఉద్యోగాలలో మాత్రమేగాక ఇంజనీర్లుగా డాక్టర్లుగా ఐ.ఎ.ఎస్. ఆఫీసర్లుగా, సైంటిఫిక్ ఆఫీసర్లుగా కొందరు స్త్రీలు పని చేస్తున్నారు. కాని వీరి సంఖ్య చాల స్వల్పమని ఒప్పుకోక తప్పదు. దేనికైనా ఒక ప్రారంభమంటూ ఉండాలికదా! తగినంత ప్రోత్సాహము, అవకాశాలు ఉంటే స్త్రీలుకూడా ఉన్నతోద్యోగాలను నిర్వహించగలరని ఋజువు చేస్తున్నారు. ఇప్పుడు స్త్రీలు చేస్తున్న ఉద్యోగాలన్నీ స్త్రీలు-పురుషులు-ఎవరైనా చేయగలిగి నటువంటి ఉద్యోగాలే.

ఐనా "మీరెందుకు ఉద్యోగం చేస్తున్నారు?" అని స్త్రీలనడుగుతారు గాని పురుషులనెవరూ అడగరు. బహుశా "ఉద్యోగం పురుష లక్షణం" అన్న సామెత తెలిసిఉండటం వల్లనేమో; స్త్రీల ఉద్యోగాలను సహజంగా తీసుకునేవ్యక్తులు కూడా స్త్రీల ఉద్యోగాలను వేణ్ణీళ్లకు చన్నీళ్లగా భావిస్తారే తప్ప ఒక కుటుంబంలోని పురుషుడు ఉద్యోగం చేయటం ఎంత సహజమో, అర్హతలు గల స్త్రీ ఉద్యోగం చెయ్యటం కూడా అంత సహజమైన విషయమేనని అనుకోరు. స్త్రీ యొక్క తెలివితేటలు, శక్తి సామర్థ్యాలు కేవలం గృహానికే పరిమితం అయి ఉండాలన్న తరతరాలుగా ఏర్పడిపోయిన ఒక అభిప్రాయమే దీనికి కారణం. అత్యవసర పరిస్థితులలో తప్ప స్త్రీలు ఉద్యోగం చెయ్యకూడదని యీనాటికీ చాలామంది పురుషులే కాక స్త్రీలు కూడా భావించటం శోచనీయం.

## కుటుంబానికి చేదోడు

పైగా భర్త సంపాదనతో కుటుంబానికి తిండి బట్టా వెళ్లగలిగితే భార్య ఉద్యోగం చెయ్యకూడదనీ అలాటి స్త్రీలు యితర పురుషుల ఉద్యోగావకాశాలను అపహరిస్తున్నారనీ యీమధ్య ఒక సరికొత్త వాదన బయల్దేరింది. కేవలం స్త్రీలు ఉద్యోగాలు చెయ్యటం వల్లనే దేశంలో నిరుద్యోగుల సంఖ్య పెరిగిందనటం అతిశయోక్తియే కాక హాస్యాస్పదం కూడాను. నిజానికి ఉద్యోగినుల సంఖ్యను మొత్తం మన దేశ స్త్రీల జనభాతో పోల్చిచూస్తే 1 లేక 2 శాతం కన్న ఎక్కువ ఉండదన్న సంగతి ఎందరికి తెలుసు?

ఉద్యోగం చెయ్యనవసరం లేనంత ఆస్తిపాస్తులున్న పురుషులు ఉద్యోగం చేస్తుంటే ఎవ్వరూ తప్పుపట్టరు. స్త్రీల విషయంలోనే రాద్ధాంతం చేస్తారు. దీనిని బట్టి మన సమాజంలో స్త్రీకి ఉన్న స్థానం స్పష్టమవుతుందే తప్ప నిరుద్యోగ సమస్యకు అది ఏరకంగానూ పరిష్కారమార్గం కాజాలదు.

ఒక పరిమితిని మించిప్రైవేటు ఆస్తి ఉన్న వ్యక్తులు (స్త్రీ, పురుషభేదంతో నిమిత్తం లేకుండా) ప్రభుత్వోద్యోగాలు చెయ్యకూడదన్న నిబంధన పెడితే—అందులో కొంత అర్థముంది. ఉద్యోగాల మీదనే ఆధారపడే కుటుంబాలలోని వ్యక్తులకు (స్త్రీలుగానీ పురుషులుగానీ) ఆర్థికంగా మరిన్ని ఉద్యోగావకాశాలు లభించ

టానికి వీలుంటుంది. అంతే తప్ప స్త్రీలు ఉద్యోగాలు మానేస్తే నిరుద్యోగ సమస్య తీరిపోతుందనుకోవటం తెలివితక్కువ.

మామూలుగా యిప్పుడు చేస్తున్నట్లు ఆఫీసులలోను, పాఠశాలలలోను, ఆస్పత్రులలోనే గాక పోలీసు డిపార్టుమెంటులోను, ఎయిర్ ఫోర్సులోను (ఎయిర్ హోస్టెస్‌లుకాక విద్యుత్, మేఘస్సుకు సంబంధించిన పోస్టులు) ఐ.ఎ.ఎస్. స్థాయిలోను పెద్దపెద్ద కంపెనీలలో మానేజింగ్ డైరెక్టర్సు వంటి పోస్టులలోను స్త్రీలింకా అధిక సంఖ్యలో చేరవలసిఉంది అకడమిక్ లైనులో యిప్పుడిప్పుడే కొంత ఉత్సాహంగా స్త్రీలు ప్రవేశిస్తున్నప్పటికీ అడ్మినిస్ట్రేటివ్ లైనులో ఆసక్తిని, ప్రతిభను చూపడానికి స్త్రీలింకా కృషి చెయ్యాలి. చాలా మంది స్త్రీలు ఎన్నిడిగ్రీలు పొంది ఉద్యోగాలు చేస్తున్నా తాము స్త్రీలన్న భావాన్ని కనీసం ఉద్యోగం చేసే సమయంలోనైనా మర్చిపోలేరు. అందుకే బాస్ క్రింద అసిస్టెంటులుగా ఉండే స్టెనోల వంటి ఉద్యోగాలను, ఇండిపెండెంటుగా నిర్ణయాలు తీసుకొని పనిచెయ్యవసరం లేని క్లరికల్ పోస్టులను యిష్టపడతారుతప్ప తమ వ్యక్తిగతమైన ప్రతిభావిశేషాలతో పైకి పోవటానికి అవకాశముండే ఉద్యోగాలకు పదిమంది మీద సూపర్‌వైజ్ చేసి పనిచేయించటానికి వీలైన ఉద్యోగాలకు కొంచెం దూరంగానే ఉంటారని చెప్పవచ్చు. స్త్రీలలో చిన్నప్పటినుండి పురుషులకంటె తాము తక్కువస్థాయి వారమన్నభావం ఏర్పడి ఉండటమే కారణమంటారు కొందరు. అందులో కొంత నిజం లేకపోలేదు.

మన దేశంలోని స్త్రీలు ఏయేరకం ఉద్యోగాలు చేస్తున్నారు, యింకా ఎలాటి ఉద్యోగాలు చేయవలసి ఉందీ తెలుసుకున్న తరువాత ప్రస్తుతం ఉద్యోగాలు చేస్తున్న స్త్రీ లెదుర్కొంటున్న సమస్యలేమిటో కూడా చూద్దాం.

కవులు వర్ణించేంత మాధుర్యం సంసార జీవితంలో ఉన్నా లేకపోయినా వివాహం ప్రతి వ్యక్తికీ శారీరకంగా మానసికంగా కావలసిన ముఖ్యావసరాలలో ఒకటని ఒప్పుకోక తప్పదు. స్త్రీ పురుషుల అనుబంధంకన్న 'బంధమే' ప్రధానమని భావించే మన వ్యవస్థలో వివాహానికి మరింత ప్రాముఖ్యత ఉండటంలో ఆశ్చర్యం లేదు మన దేశంలో ఎప్పుడూ ఆడపిల్లలపెళ్ళిళ్ళ 'డబ్బు'తో ముడిపెట్టుకుని ఉండటం మరోవిశేషం. ఒకప్పుడు 'కన్యాశుల్కం' రూపంలోను, యిప్పుడు 'వరకట్నం' రూపంలోను స్త్రీలపెళ్లి విషయంలో సంప్రదాయం ఎంతో క్రూరంగా విశృంఖలంగా అమలులో ఉంటున్నది. పైగా స్త్రీలకు ఆస్తి హక్కు లేదు. మన దేశంలో ఈ రెండు కారణాల వల్ల స్త్రీకి వివాహం విషయంలో పురుషుడికున్నంత స్వేచ్ఛలేదు.

## ఉద్యోగినుల సమస్యలు

మామూలు ఆడపిల్లలు పెళ్లిలో ఎదుర్కొనే సమస్యలన్నీ ఉద్యోగినులకు కూడా ఉన్నవే. అవికాక మరిన్ని ప్రత్యేక సమస్యలు కూడా ఉన్నయ్ ఉద్యోగినులకు. ఆర్థికంగా జరుగుబాటు తక్కువగా ఉన్న కుటుంబాలలో సంపాదిస్తున్న ఆడపిల్లకి పెళ్లిచేసి అత్తవారింటికి పంపివెయ్యటం తల్లిదండ్రులకి అంతగా సమ్మతం కాదనీ అందువల్లనే ఉద్యోగినుల పెళ్లిళ్ళ విషయంలో తల్లిదండ్రులు అశ్రద్ధ వహిస్తున్నారనీ, ఒక వయస్సు దాటిన తరువాత వివాహం సంప్రదాయబద్ధంగా జరగటం కష్టం గనుక చాలామంది ఉద్యోగినులు జీవితాంతం వరకు అవివాహితులుగానే ఉంటున్నారనీ కొందరి అభిప్రాయం. కొన్ని సందర్భాలలో తల్లిదండ్రులు వివాహం చెయ్యటానికి సిద్ధపడినా వివాహం తరువాత తమ కుటుంబానికి ఆర్థిక సహాయం చెయ్యటానికి అవకాశం ఉండదనీ, కనిపెంచిన తల్లిదండ్రులు నిత్యావసరాల కోసం కటకటలాడి పోతుంటే తమస్వార్థం కోసం వారినుండి విడిపోవటం మంచిది కాదన్న ఉద్దేశ్యంతో కూడా కొందరు అవివాహితలుగానే ఉండి పోతున్నారు. ఉద్యోగం చేసే స్త్రీకి డబ్బు సంపాదించే స్వతంత్రత ఉన్నా దానిని భర్త అనుమతి లేకుండా ఖర్చుపెట్టుకునే అధికారం లేదు. పెళ్ళయిన తరువాత స్త్రీలు పుట్టింటి వారికి ధన సహాయం చెయ్య కూడదన్న అంశలుండటం వల్లనే వివాహం కోసము వివాహానంతరమూ కూడా ఉద్యోగినులకు పెళ్ళి ఒక సమస్య అవటం జరిగింది. పెళ్ళి విషయంలో కులాలు, మతాలు, భాషలకు అధిక ప్రాముఖ్యత నిచ్చే సమాజం మనది కనుక స్త్రీ స్వతంత్రంగా తనకి నచ్చిన వాడిని, వివాహం తరువాత తనతో సహకరించే భర్తని ఎన్నుకోవడానికి అవకాశాలు తక్కువ. ఉద్యోగినులు తమ వివాహం విషయంలో ఎదుర్కొంటున్న ఆర్థికమైన, సాంఘికమైన యీ అవరోధాలనుండి తప్పించుకోవాలంటే ఒక్కటే పరిష్కార మార్గం—స్త్రీలకి వివాహం విషయంలో పూర్తి స్వేచ్ఛఉండాలి. కుల మత భాషా భావాలకతీతమైన సమాజాన్ని గురించిన అవగాహన స్త్రీలలో—కనీసం ఉద్యోగినులలోనైనా ఏర్పడాలి. అప్పుడుగాని వివాహం విషయంలో తామెదుర్కొంటున్న సమస్యలు కేవలం కృత్రిమమైనవనీ, వాటిని ప్రోత్సహించే సంప్రదాయాలను ఎంత సులభంగా వదులుకోగలిగితే అంతగా తమకీ సమాజానికీ కూడా సుఖప్రదమనీ తెలిసిరాదు.

## పురుషుని ఆధిక్యత తప్పదా?

చదువుకున్న స్త్రీలకీ, ఉద్యోగినులకూ వివాహం విషయంలో ఉన్నకొన్ని కాంప్లెక్సులు కూడా వారి వివాహానికి అడ్డుతగులుతున్నాయి. చదువుకున్న ఆడపిల్లలందరూ తమకంటె, ఒకటో రెండో ఎక్కువ డిగ్రీలు గల పురుషులనే పెళ్లాడాలని కోరుకుంటారు. ఓ పక్క స్త్రీలకు పురుషులతో సమానంగా హక్కులు, స్వాతంత్ర్యం లేవని ఆడిపోసుకుంటూనే చాలామంది స్త్రీలు చదువులో భర్తకన్న రెండాకులు తక్కువగానే ఉండాలని కోరుకోవటంలోని అంతర్యం ఏమిటో! అలాగే ఉద్యోగినులు కూడా తమ కన్న ఎక్కువ సంపాదించే పురుషులే భర్తలవాలని కోరుకుంటారు. విద్యార్హతలు, ఉద్యోగం సంపాదన వీటన్నిటికీ ఆయావ్యక్తుల ఆర్థిక పరిస్థితులు, అవకాశాలు, ఇతర కారణాలనేకం ఉంటాయి. భార్యాభర్తల అనుబంధానికి నిజానికి యివేవీ ప్రతిబంధకాలు కావు. పరస్పరావగాహన, ప్రేమఉన్న దాంపత్యంలో విద్య, సంపాదనల పాత్రచాలా స్వల్పం. ఈ విషయాన్ని ఉద్యోగినులు గ్రహించకపోవటం వల్లనే మామూలు చదువురాని స్త్రీల లాగా భర్తపోషణలో ఉండాలనీ, భర్తకన్న తక్కువ స్థాయిలో ఉండటమే సహజమైన

విషయమనీ భావించటం వల్లనే ఉద్యోగినుల పెళ్లిళ్లు అనవసరంగా సమస్యలై కూర్చున్నాయి. ఈ తప్పుడు భావాలకి, అభిప్రాయాలకి ఉద్యోగినులిప్పటికైనా స్వస్తి చెప్పటం మంచిది.

ఉద్యోగాలు చేస్తూ నెలకింత అని సంపాదిస్తున్న అమ్మాయిలను కూడా చాలా మంది పురుషులు కట్నం లేకుండా చేసుకుంటానికి యిష్టపడటం లేదు పురుషులలోని సంకుచిత మనస్తత్వానికి స్త్రీల దుర్గతికి మన సంప్రదాయాలు ఎలాతోడ్పడుతున్నాయో గ్రహించటానికి యింతకంటె వేరే నిదర్శనం అక్కర్లేదు. కొంచెం ఎక్కువ సంపాదించే పెద్ద ఉద్యోగాలలోని స్త్రీలకు కొందరికైనా కట్నం లేకుండా పెళ్లిళ్లు జరుగుతున్నమాట నిజమే కాని వారి సంఖ్య చాలా స్వల్పం.

## కుటుంబ జీవనం

ఎలాగో పెళ్లంటూ జరిగితే ఆ పైన ఉద్యోగినులకు సమస్యలేవీ ఉండవనుకోవడం కూడా పొరపాటే! మామూలు గృహిణుల కన్న గృహిణులైన ఉద్యోగినులు ఎక్కువ సమస్యల నెదుర్కొనవలసి వస్తుంది. లోతుగా ఆలోచిస్తే ఉద్యోగినులైన గృహిణుల సమస్యలకు కూడా అర్థహీనమైన సంప్రదాయాలు, సెంటిమెంట్లు, స్త్రీ పురుషుల పాత్రలను గురించిన కొన్ని తప్పుడు అభిప్రాయాలే కారణాలని తెలుస్తుంది. ఉదాహరణకి వంట చెయ్యటమే తీసుకుంటే—పురుషుడు సంపాదనకోసం బయటకు వెళ్లే సమయంలో స్త్రీలు ఇంట్లో వంటపని చూసుకునే వారు. అది కేవలం మధ్యతరగతి కుటుంబాలలోని 'పని విభజన' మాత్రమే కాని నేడు స్త్రీలు సంపాదనకోసం బయటకు వెళ్లటంలో తప్పు లేదని ఒప్పుకున్నా వంటపని చెయ్యటం నామోషీగా భావించే పురుషులు కొల్లలుగా ఉన్నారు. వంటపని చెయ్యటం బానిసత్వమని కొందరు స్త్రీలు యీ మధ్య అభిప్రాయ పడుతున్నారు. అభిప్రాయం ఎంత సత్యదూరమైనదో పురుషులు వంటపని చెయ్యటం పరువు తక్కువ అని భావించటం కూడా అంత పొరపాటే! దేశంలోని రాజకీయ, సాంఘిక పరిస్థితులలో వచ్చే మార్పులతోపాటు కుటుంబ జీవనంలో కూడా తప్పనిసరిగా మార్పులు వస్తాయ్. ఆ మార్పులకనుగుణంగా స్త్రీ పురుషుల దృక్పథంలో కూడా మార్పురావాలి. భార్యాభర్తలిద్దరూ కలసి కుటుంబంకోసం సంపాదిస్తున్నప్పుడు యిద్దరూ కలసి యింటిబాధ్యతలను సమానంగా పంచుకోవటంలో తప్పేమీ లేదు. ఈ సత్యాన్ని పురుషులు, సమాజం గ్రహించిననాడు నేడు గృహిణులైన ఉద్యోగినులు యింటిపనుల వల్ల పొందే బాధలలో సగం తగ్గిపోతయ్.

భార్యాభర్తలిద్దరూ బయటకు ఉద్యోగం కోసం వెళ్లినప్పుడు చిన్నపిల్లలను చూసుకోవటం ఒక పెద్ద సమస్య. భర్త తరపునగాని, భార్య తరపునగాని, బంధువులెవరైనా యింట్లో ఉంటే ఫరవాలేదు. కాని అలాటి కేసులు చాలా తక్కువ, పైగా ఉద్యోగినులను గురించిన 'ప్రెజుడిస్' యింకా మన సమాజంలో పూర్తిగా పోలేదు. "ఈమెగారు సంపాదించటానికంటూ బయట తిరుగుతుంటే మేము దాసీలలాగా ఆమె పిల్లలను పట్టుకుని యింట్లో కూర్చోవాలా?" అన్నట్లు ఉద్యోగినుల అత్తలు, ఆడపడుచులు, తదితర బంధువులూ ప్రవరిస్తారు. అందుకే ఉద్యోగస్తురాలైన కోడలిదగ్గరికన్న యింట్లో ఉండే కోడలి దగ్గరనే ఉండి సేవలు చేయించుకుందామని కోరుకుంటారు అత్తగార్లు.

ఇక ఇంటివాళ్లు చూడనప్పుడు పిల్లలను చూడటానికి డబ్బిచ్చి ఆయాలను పెట్టుకోవలసివస్తుంది ఉద్యోగినుల పిల్లలలో ఎనభై శాతం పనిమనుషుల పెంపకంలోనే పెరిగి పెద్దవారౌతారు డబ్బుకోసం పిల్లలను పెంచేవాళ్లకెప్పుడూ పిల్లలమీద ప్రేమ ఉండదు. పైగా ఎక్కడలేని విసుగూ చూపుతారు కూడాను. పిల్లలకోసం తల్లి అట్టేపెట్టిన బిస్కట్లు, పాలు మొదలైన పదార్థాలన్నింటినీ చూస్తూ ఊరుకోనివ్వరు. జిహ్వా చాపల్యం, ఫలితంగా ఉద్యోగినుల పిల్లలు రోజురోజుకీ ఎండిపోవటం, వాళ్లను పెంచే ఆయాలు సునుపెక్కటం జరుగుతుంటుంది ఈ విషయాన్ని గ్రహించిన ఉద్యోగిని ఉద్యోగంకోసం బయటకు వెళ్లినా ఆమె మనసంతా యింటిమీద, పిల్లలమీద ఉంటుంది. దాంతో ఆమె చేసే ఉద్యోగం కోసం ఎక్కువ శ్రద్ధ చూపకపోవటం, రోజల్లా పిల్లలని గురించి ఆలోచిస్తూ మానసికంగా కృంగిపోవటమూ జరుగుతుంది ఆడవాళ్లు సాధారణంగా ఉద్యోగంలో ఏఫిషియెన్సీని చూపకపోవటానికి వారిని వెన్నంటే గృహ బాధ్యతలే కారణమని చాలామంది గ్రహించరు.

అందుకే ఉద్యోగినుల పిల్లలను స్కూలుకు వెళ్ళే వయస్సువరకు పెంచటానికి, తల్లిదండ్రులు నిశ్చింతగా వారి బాధ్యతలనుంచటానికి 'నర్సరీ'లను స్థాపించాలి. ఈ నర్సరీల స్థాపన అటు ప్రభుత్వం నుండేకాక ప్రైవేటు యాజమాన్యంలో కూడా జరగటం మంచిదే!

మన ప్రభుత్వ కార్యాలయాల్లో నాల్గవ తరగతి ఉద్యోగినులకు 'మెటర్నిటీ లీవుకు' అర్హతలేకపోవటం నిజంగా బాధపడవలసిన విషయమేకాక స్త్రీ ప్రగతిని చూసి సిగ్గుపడవలసిన విషయం కూడా. కనీసం యీ మహిళా సంవత్సరంలోనైనా ఉద్యోగినుల సమస్యలను గురించి పరిశీలించి, పరిష్కార మార్గాలను కనిపెట్టటం ప్రభుత్వంయొక్క, పురుషులయొక్క కర్తవ్యం.

---

ముదితల్ నేర్వగ రాని విద్యగలదే ముద్దార నేర్పించినన్!

---

# నేటి సాంఘిక జీవనంలో మహిళల స్థానం

ఇల్లిందల సరస్వతీదేవి

నేటి సాంఘిక జీవనంలో మహిళల స్థానమేమిటన్ని ప్రశ్నించు కుంటే పైకి కనబడటానికి ఘనంగాను, అనుభవంలో గగన కుసుమంగాను ఉన్నదని చాలామంది మహిళల అభిప్రాయము అంటే నేతిబీరకాయలో ఉన్నంత నెయ్యి ఉన్నదని భావము

స్త్రీల పరిస్థితులు ఈ శతాబ్దారంభములో ఉన్నట్లు ఇప్పటికీ అలాగే ఉన్నాయా అంటే లేవనే చెప్పాలి. చెప్పుకో తగినంతగా స్త్రీల పరిస్థితి మార్పు చెందింది మనదేశంలో ఆచారం పేరిట– పాతివ్రత్యం పేరిట-చనిపోయిన పెనిమిటితో సజీవంగా దహనం చేయబడుతున్న నారీలోకానికి రాజారామ్ మోహన్‌రాయ్ సంఘాన్ని ధిక్కరించి–శాసనం చేయించి ఆయుర్దాయాన్ని పెంచాడు ఈ పరిష్కారంలో మరొక సమస్య ఉత్పన్నమయింది ముక్కుపచ్చలారని పసిబాలికలను కూడా పెనిమిటి పోగానే కడుపుమాడ్చి బలవంతపు సన్యాసం అంటగట్టి అత్తింటా పుట్టింటా వెట్టి చాకిరీ చేయించింది సంఘం. అటువంటి అభాగ్యురాండ్ర జీవితాలలో సౌభాగ్యాన్ని నింపి పునర్వివాహాలకు తలపెట్టి, వారికి ప్రత్యేకంగా శరణాలయాలను స్థాపించి విద్యాప్రాప్తి కలిగించాడు కందుకూరి వీరేశలింగం పంతులు కన్యాశుల్క వరశుల్కపుటాచారాలను రూపు

## పదునైన కలంతో సంఘాన్ని ఎదిరించాడు గురజాడ

మాపి స్త్రీల జీవితాలను మెరుగు పరచాలని పదునైన కలంతో సంఘాన్ని ఎదిరించాడు గురజాడ ముక్కుపచ్చలారని బాలబాలికలకు తల్లిదండ్రులు తమ ముద్దు ముచ్చటల కోసం పెళ్ళిళ్ళు చేసి వాళ్ల జీవితాలను దుఃఖభాజనం చేస్తున్నారని హరబిలాస శారదా బాలికకు 14 సంవత్సరాలు, వరుడికి 18 సంవత్సరాలు నిండితే గాని వివాహం తలపెట్టకూడదని శాసనం చేయించాడు

### అంతో యింతో అభివృద్ధి

సంఘ సంస్కర్తలూ దేశనాయకులూ ప్రబోధం చేయగా చేయగా బాలికలకు కూడా ప్రత్యేక పాఠశాలలూ, కళాశాలలూ ఏర్ప



డ్డాయి కొంతవరకూ ఉచిత విద్యకూడా అనుగ్రహింప బడ్డది సాహిత్యంలో ప్రవేశం కల్పించుకుని కవయిత్రులుగా రచయిత్రులుగా పేరు ప్రఖ్యాతులు తెచ్చుకుంటున్నారు స్త్రీలు. కనకాభిషేకం చేయించుకున్న వారు, ఎకాడమీ అవార్డులను పొందినవారూ ఉన్నారు

భార్యకు భర్త ఆస్తిలో భాగం ప్రాప్తించింది దత్తతాధికారం స్త్రీకి లభించింది కుమార్తెకు తండ్రి ఆస్తిలో భాగం లభిస్తుంది స్పెషల్ మ్యారేజి ఆక్టు వచ్చింది వివాహబంధాలు చట్టరీత్యా సవరించబడ్డాయి భరించరాని వైవాహిక బంధాలు చట్టాన్ననుసరించి సడలించుకునే అధికారం లభించింది కుటుంబాలను కూల్చి వేస్తున్న వరకట్నాల నరికట్టటానికి పూనుకొని, రెండు వేలకు మించి పెళ్లి ఖర్చులు చేయరాదని అయ్యదేవర కాళేశ్వరరావు గారు శాసనం చేయించారు

మన రాజ్యాంగచట్టము పురుషుడితో పాటు స్త్రీకి అన్ని రంగాలలో సమానావకాశాలను కల్పించింది విద్యనేర్చిన స్త్రీలు పుర

షుడితో పాటు అన్నిరంగాలలోను స్థానం సంపాదించుకుంటున్నారు. వైద్యరంగంలో స్త్రీలు ఘనతను సాధిస్తున్నారు. ఉపాధ్యాయినులుగా పేరు తెచ్చుకుంటున్నారు. ఐ. ఏ. యస్ లో కూడా స్త్రీలు రాణకెక్కుతున్నారు. రాజకీయ రంగంలో స్త్రీలు ఉన్నతస్థానాలలో మంత్రులుగా, రాయబారులుగా, పార్లమెంటు, అసెంబ్లీ సభ్యురాండ్రుగా ప్రఖ్యాతి గాంచుతున్నారు. మనదేశాన్ని ఎదురులేకుండా పరిపాలన చేస్తున్నది ఒక స్త్రీ-ప్రధానిగా. సంఘసేవలో స్త్రీలదే పైచెయ్యి అని పించుకుంటున్నది. ఇతర దేశాల కంటే ముందుగా మన దేశంలోనే స్త్రీలకు ఓటుగు హక్కు వచ్చింది.

ఈ శతాబ్దపు ఉత్తరార్థంలో స్త్రీలకు అంతకుపూర్వము లేని సౌకర్యాలు వసతులు ఎన్నో అమర్చబడ్డాయి. రాజకీయాలలో స్త్రీలకు ప్రత్యేక స్థానాలు-కళాశాలల్లో సీట్లు ప్రత్యేకం-కమిటీలలో కొందరు స్త్రీల నియామకం-ఇలాంటి వెన్నో...

ఇదంతా తలుచుకుంటే "యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః" అన్న సూక్తి అక్షరాలా మన సమాజంలో ప్రతిబింబిస్తున్నదా? నారీలోకమింత పురోగమించిందా? స్త్రీలు ఉన్నతోద్యోగాలు చేయటం-అధిక సంఖ్యలో పట్టభద్రులూ-పోస్టు గ్రాడ్యుయేట్లు పి ఎచ్. డి.లూ కావటం చూస్తే విదేశాలకంటె కూడా మన దేశంలో స్త్రీలు ఒకడుగు ముందుకు వేశారా? అని అనిపించక మానదు.

## స్త్రీ జనాభివృద్ధి

కాని-పట్టణాలలో నగరాలలో స్త్రీ జనాభివృద్ధి నాగరీకుల మధ్య మెరుపు మెరుపుగా కంటికి మిరుమిట్లు గొలుపుతూ ఘనంగా చెప్పుకోవటానికి ఉపయోగపడేది మాత్రమేనని ప్రతి సామాన్యుడికీ తెలిసిన విషయము. ఇది నూటికి నాలుగు వంతులు జరిగిన అభివృద్ధి.

నేటి సాంఘిక పరిస్థితులలో మధ్యతరగతి ప్రజానీకానికి ఆడపిల్ల పుట్టిందనగానే ఇంకా-ఇప్పటికీ—"అమ్మో!" అన్నట్టుగానే ఉన్నది తల్లికి ఇంట్లో చిన్నపనీ పెద్దపనీ చేసిపెట్టి- "పెళ్ళికుదిరేవరకూ" అని చదువుకున్న ఆడపిల్లకు తగిన సంబంధం కుదరటంలేదు. బాహాటంగానూ చాటుమాటుగాను కట్నాల సమస్య తల్లిదండ్రులను బాధిస్తూ ఆడపిల్లలను అవమానపరుస్తూనే ఉన్నది. చదువుకున్నందుకు ఉద్యోగం చేసి తన కాళ్ళమీద తాను నిలబడగలుగుతాననుకుని ఉద్యోగంచేసినా ఆ సంతృప్తి ఆడపిల్లకు మిగలటంలేదు. ఉద్యోగినికి తగిన ఉద్యోగస్థుడు భర్తగా లభించటం అరుదుగా ఉన్నది. ఆమె చదువుకూ ఆమె ఉద్యోగానికీ మేరేజి మార్కెట్టులో విలువలేదు. సంపాదించే కూతురిమీద ఆధారపడ్డ తల్లిదండ్రులు కుమార్తె సుఖ సంతోషాలను గమనించటంలేదు. ఉద్యోగంచేసే భార్యమీద ఉండవలసిన [illegible]వం భర్తకు ఉండటం చాలా అపురూపంగా ఉన్నది. [illegible]ద్యోగంచేసే పురుషుడికి కలిగే ఆత్మ సంతృప్తి పెద్ద ఉద్యోగం చేసే స్త్రీకి కలగటం చాలా తక్కువగా ఉన్నది. ఈనాటికీ స్త్రీ పదిమంది పురుషులు పనిచేసే ఆఫీసులో ధైర్యంగా నిర్భయంగా పనిచేయలేక పోతున్నది. తాను సంపాదించుకుంటూ కూడా ఆర్థిక స్వాతంత్ర్యాన్ని అనుభవించలేక పోతున్నది.

దిగువ తరగతి స్త్రీలను మరొక రూపంలో సమస్యలు క్రుంగదీస్తుంటాయి. ఎంత నీతి నియమాలతో జీవితం సాగించినా వైవాహిక జీవితంలో భద్రతలేదు. నీతిగా బ్రతికే హక్కులేదు. త్రాగుబోతు భర్తలతో సంసారంలో సుఖమూ శాంతీలేదు. కార్మిక స్త్రీలకు సమాన వేతనాలు లేవు. ప్రసవానికిగాను తీసుకున్న సెలవులో (నిండు) జీతాలు లేవు.

ఇటువంటి సమస్య లెన్నో కోకొల్లలుగా మన సంఘంలో స్త్రీలను బాధిస్తున్నాయి. చదువుగాని-ధనంగాని-ఉద్యోగంగాని-వివేకంగాని-స్త్రీని సంఘం యొక్క పక్షపాత బుద్ధినుండి రక్షించగలుగుతున్నవా? చట్టాలవల్లగాని-సూక్తులవల్లగాని-ఉపన్యాసాలవల్లగాని దేశంలో స్త్రీల పరిస్థితి ఎంత మేరకు మెరుగయింది?

## స్త్రీ అంటే ఎవరు ?

దీని కంతకూ ప్రధానమయిన కారణం—మూలకారణం ఒకటే ఉన్నది.

స్త్రీ అంటే ఎవరు? సంఘం ఏమనుకుంటున్నది? స్త్రీ అంటే బలహీనురాలు—అబల. పురుషుడికి భోగ్యవస్తువు—అదొకజాతి—అదొక కులం—అదొక వర్గం—అదొక మతం—అనుకుంటోంది సంఘం. కనుకనే ఆమె మంచిచెడ్డలు-ఆమె అభివృద్ధి—ఆమె కష్టసుఖాలు సంఘం సానుభూతిని పొందలేకపోతున్నాయి. అబల కనుక ఆమెను దిగలాగాలనుకుంటుంది భోగ్యవస్తువు కనుక ఆ దృష్టితోనే చూడాలనుకుంటుంది. వెక్కిరిస్తుంది హేళనచేస్తుంది. సమయం దొరికితే పతనంచేస్తుంది. ఎందుకు ?

స్త్రీ ఎవరో అని అనుకుంటున్నది కనుక. స్త్రీ పురుష సంబంధం మిల్లు యజమానులకూ కార్మిక వర్గానికీ మధ్య ఉన్నటువంటిదా ? పాలకులకూ పాలితులకూ ఉన్నటువంటి సంబంధమా ?

బలవంతుడికీ బలహీనుడికీ మధ్యవున్న భేదమా ?

జ్ఞానికీ అజ్ఞానికీ మధ్యఉన్న తేడానా ? స్త్రీ పురుషులు కలిస్తేనే గాని సంఘం కాదు గృహానికి స్త్రీ పురుషులు సమానహోదాగల యజమానులు వారిద్దరి సమిష్టిసహజీవనమే దాంపత్యానికి మూలము. సంఘానికి పునాది స్త్రీగౌరవము-పరువు-ప్రతిష్ఠ-అభివృద్ధి-విజ్ఞానము-వివేకము పురుషుడికి కూడా చెందుతాయి. అంటే సంఘానికి చెందుతాయన్న మాట. ఆమెకు అగౌరవం జరిగితే పురుషుడికీ తద్వారా సంఘానికీ చెందుతుంది. ఆమెకు అపకీర్తి అప్రతిష్ఠా కలిగితే అది తిరిగి తిరిగి పురుషుడికే చెందుతుంది.

స్త్రీ అంటే తల్లి-భార్య-కుమార్తె. ఈ మార్గాన ఆలోచిస్తే గాని స్త్రీ అంటే ఎవరో తెలియదు.

మనకు హక్కులూ చట్టాలూ రాకపూర్వము స్త్రీని పూజించాలి-స్త్రీని గౌరవించాలి అనే సంప్రదాయం ఉండేది. వారసత్వపు హక్కులేకపోయినా స్త్రీని కుటుంబంలో అనేక విధాలుగా ధన కనక వస్తువాహనాలతో సత్కరించే ఆచారం ఉండేది ఎవరింటికి వెళ్ళినా నూతన వస్త్రాలతో పసుపు కుంకుమలతో పండు తాంబూలాలతో సాగనంపే సంప్రదాయం ఉండేది. పగవాడి భార్య ఇంటికి వచ్చినా సకలమర్యాదలూ చేసి గౌరవంగా సాగనంపే పద్ధతి ఉండేది. బద్ధవైరం పురుషుల మధ్యనే గాని స్త్రీలపట్ల చూపేవారు కాదు.

( తరువాయి 48వ పేజీలో )

మహిళాలోకంలో...

# వెలుగు రేఖలు

యల్లాప్రగడ సీతాకుమారి

"ఈ తేనె మాగాణి ఈ తెలంగాణము
నా తల్లియని పాడవే చెల్లెలా"
రాయప్రోలు



తేనెమాగాణియైన తెలంగాణా సీమలో ఎన్నో ఉద్యమాలు నడిచినాయి ఆ అన్ని ఉద్యమాలలోనూ మహిళలకు గూడా విశిష్టమైన స్థానం ఉన్నా చిట్టచివరి ఉద్యమమైన రాజకీయ పోరాటంలో వారి పాత్ర ప్రత్యేకమైన స్థానాన్ని సంపాదించుకున్నది

ఏ దేశంలోగాని ప్రజలకు కష్టాలూ ఒత్తిడీ చిక్కులూ అధికమైనప్పుడు ఆ దేశంలోని ప్రజల ఆవేదన అనేక ఉద్యమాల రూపంలో మొలకలెత్తడంలో ఆశ్చర్యం లేదు ఆనాడు హైదరాబాదు రాష్ట్రంలో ప్రజలకు ముఖ్యంగా స్త్రీలకు ఉన్న అవరోధాలు అసంఖ్యాకమైనవిగా వుండేవి. ఆనాడు అల్ప సంఖ్యాకులైన శ్రీమంతులు. దొరలు, నవాబులు, రాజులు అంతులేని విలాసాలలో భోగాలలో ఓలలాడుతూ దక్కను నాగరికతనూ వైభవాలనూ గురించి బంగారు పుటలలో వర్ణించుతూ వుంటే మరొక వైపున అధిక సంఖ్యాకులైన నిరుపేదలు జొన్న అంబలి త్రాగుతూ అవిద్య, అనాగరికత, నిర్బంధపు వెట్టిచాకిరీలతో భగవంతుడే తమకు దిక్కుగా ఆకలిమంటలతో కాలం గడుపుతుండేవారు ఇక స్త్రీలకు-నగరంలోనే విద్య వికాసాలు తక్కువగా నుండే ఏవో ఒకటి రెండు ఉరుదూ పాఠశాలలకు చీలవన్‌లు కట్టిన పెట్టె బండ్లలో బాలికలను తీసుకు పోతుండే వారు తెలుగు పిల్లలకు పాఠశాలలే లేవు మొగ పిల్లలు ఉదర పోషణ కోసం ఆ ఉరుదూనే చదివేవారు గాని బాలికల విషయం ఏం గావాలి?

## తొలి వెలుగు రేఖలు

తెలుగు హృదయాలలో కరడు గట్టిన విచారం మాడపాటి ప్రభృతులను కదిలించి వేసింది పందొమ్మిది వందల ఇరవై ఎనిమిది ప్రాంతాల్లో స్థాపింప బడ్డ ఆంధ్రబాలికోన్నత పాఠశాల ఈకొరతను కొంత నివారించి ఈ నాటి మాడపాటి హనుమంతరావు పాఠశాలగా రూపొందింది తరువాత అక్కడ హైదరాబాదు లోనూ వరంగల్లు, ఖమ్మం, గద్వాల, వనపర్తిలలోనూ తెలుగు బాలికా పాఠశాలలు స్థాపించు కొనడం మహిళాలోకానికి మొట్టమొదటి వెలుగు కిరణం

తెలంగాణాలో హిందూ స్త్రీలు గూడా పరదాను, ఘోషాను పాటించడం వారి అభివృద్ధికి ఆ రోజుల్లో పెద్ద ఆటంకంగా వుండేది అంతేగాదు మాట్లాడితే మత కలహాలూ, మలేరియా ప్లేగు వంటి వ్యాధులు పీటలు వేసుకొని వుండేవి

అనారోగ్యకరమైన ఆనాటి సాంఘిక విధానం వల్ల గూడ ఆడ పిల్లలు ఎదుగూ బొదుగూలేక కృంగి పోయ్యేవారు చాల చిన్న పిల్లలకే పెండ్లిండ్లు చేసి అత్త వారింటికి పంపడమూ అనాగరికులైన ఆ అత్తలు ఈ చిన్న పిల్లలను అంతు లేని కోడరికము బెట్టి చిత్ర హింసల పాలుచేయడము సమిష్టి కుటుంబాలలోని మొగ పిల్లలు తల్లితండ్రుల మాటలను ఎదిరించ లేక పోయేవారు కొంచెం డబ్బుంటేవాలు, పటేళ్ళు, వతన్ దారులు మొదలి వాళ్ళు గూడా రెండు



మూడుపెళ్లిళ్లు చేసుకునేవారు. బహిరంగంగా వేశ్యలనుపోషించే వారు. ఆడ పిల్లలు ఈ కష్ట నిష్ఠూరాలనన్నింటినీ భరింపక తప్పేదిగాదు.

అవి సాంఘిక సంబంధమైనవి. ఇవి గాక మత సంబంధమైనవీ రాజకీయ సంబంధమైనవీ చిక్కులు గూడా అసంఖ్యాకంగా ఉండేవి.

క్రొత్త దేవాలయాలు నిర్మింప గూడదు పాతవి బాగుచేయింపగూడదు. ప్రైవేటు పాఠశాలలు పెట్టగూడదు. ప్రభుత్వం పెట్టదు.

ఇవిగాక గష్టీటిప్పన్ అనే ఏభైమూడవ సర్క్యులరు ఒకటి ప్రజోద్యమాలకు గొడ్డలిపెట్టులాగా ఉండేది. స్త్రీల సభల్లో గూడా గూఢాచారిదళంవారు వచ్చి రిపోర్టులు వ్రాసుకొనే బెడద తప్పేది గాదు.

ఇట్లాంటి కష్టాలను ఎదుర్కోవడానికి ప్రారంభం అయిన ఆంధ్రోద్యమంతోపాటుగానే మహిళోద్యమం గూడా ప్రారంభం అయింది. సామాన్యప్రజలంతా కష్టాలను భరించుతూ ఓర్పుతో కాలం బుచ్చుతూ వచ్చినా కొందరు యువజనుల హృదయాలలో రగిలిన స్వాతంత్ర్యజ్వాలలే ఈ ఉద్యమాలకు కారణం అవుతూ వుంటాయి. ఈ ఉద్యమం మొట్టమొదట గ్రంథాలయోద్యమంగా ప్రారంభింపబడినా, ఏనాటికైనా ఈ పీడిత ప్రజలకు రాజకీయవిమోచనం గలిగించి ప్రజాపాలనం స్థాపించాలి అనేదీ వారి ప్రధాన ధ్యేయం.

సూర్యాపేటలో జరిగిన మొట్టమొదటి గ్రంథాలయ సభలతోపాటు స్త్రీల సమావేశాలు గూడా జరుగుతూరావడము నగరంలోని కొన్ని భాషానిలయాలలో జరిగే సభలలో వెదురుచాపలు అడ్డుగట్టిన కొంత స్థలాన్ని స్త్రీలకోసం ప్రత్యేకించడమూ ఈ ఉద్యమంలో ప్రారంభబీజాలు.

## సాంస్కృతిక విజ్ఞానం

1925 ప్రాంతంలో "ఆంధ్రసోదరీ సమాజం" అనే స్త్రీల సంస్థ ఒకటి సుల్తాన్‌బజారులో నెలకొల్పబడది. నడింపల్లి సుందరమ్మ, మాడపాటి మాణిక్యమ్మ, పంdిటి వీరరాఘవమ్మ, లోకనంది జానకమ్మ మొదలైన మహిళలు దీన్ని నిర్వహించుతూ వుండేవారు. ఇంచుమించు ఈ రోజుల్లో స్థాపింపబడిన నూతన కన్యాసమాజం అనే సంస్థ కేవలం గణపతి నవరాత్రులు జరుపుతూ చిన్నపిల్లల ఆటపాటలతో కాలక్షేపం చేస్తూ స్త్రీలలో సాంస్కృతిక విజ్ఞానాన్ని కలిగించుతూ వుండేది.

1929లో జరిగిన ఆంధ్ర మహాసభలతోపాటు మహిళా సభ కూడా పెద్దఎత్తున జరగడంతో ఈ మహిళోద్యమం మరొక్క మెట్టును అధిరోహించింది. ఆంధ్రోద్యమం పేరుతో జరుగుతున్న ఈ సభలు రాజకీయమైన తిరుగుబాటు చెయ్యడానికి జరుగుతున్నట్లుగా ప్రభుత్వం భావించి ఈ సభలకు ఎన్నో చిక్కులు కలిగించుతూ వుండేది. ఈ మహిళాసభలకు వరుసగా ఈ క్రింది మహిళలు అధ్యక్షులుగా నున్నారు.

1929 (జోగిపేట) నడింపల్లి సుందరమ్మ
1931 (దేవరకొండ) టి. వరలక్ష్మమ్మ
1934 (ఖమ్మంమెట్టు) యల్లాప్రగడ సీతాకుమారి
1935 (సిరిసిల్ల) మాడపాటి మాణిక్యమ్మ
1937 (షాదునగరం) బూర్గుల అనంతలక్ష్మీదేవి
1938 (నిజామాబాదు) నందగిరి ఇందిరాదేవి
1940 (మల్కాపురం) ఆర్. యోగ్యశీలా దేవి
1941 (చిలుకూరు) రంగమ్మ ఓబుల్‌రెడ్డి
1942 (వరంగల్లు) రంగమ్మ ఓబుల్‌రెడ్డి
1943 (హైదరాబాదు) సీతాకుమారి
1944 (భువనగిరి) ఆరుట్ల కమలాదేవి
1945 (హైదరాబాదు) రాణీలలితాదేవి

ఈ సభలు మొదట మహా సభలతోపాటుగా జరిగినా చివరి సభలు విడిగా స్త్రీలే జరుపుకున్నారు. అయినా క్రియాశీలులైన మాడపాటి, బూర్గుల, సురవరం వంటి ఈ నాయకులు రాజాబహద్దూరు వెంకట్రామారెడ్డి వంటి మహనీయులు ఈ మహిళోద్యమాన్ని ఆదరించి సభలూ, సమావేశాలు, పాఠశాలలూ, కాలేజీలు నిర్వహింపజేసి తీగలల్లుకొనేటట్లు చేశారు.

ఈ సమయంలోనే రాష్ట్రంలో మరికొన్ని మహిళా సంస్థలు కూడా వెలిసినాయి. నగరంలోని సుప్రసిద్ధమైన సంస్థలలో హైదరాబాదు ఉమెన్సు అసోసియేషను ఒకటి ఇది 1916 నుండి పని చేస్తున్నది. దీని ముఖ్యస్థాపకులలో సరోజినీదేవి, లేడీ హైదరీ, రుస్తుంజీ మొదలైనవారే గాక సుప్రసిద్ధ సంఘ సేవకురాలు కజిన్సు సతి గూడా ఒకరు. చాలా కాలం ఈ సంఘం అధికారవంతులైన మహిళల చేతుల్లోనే ఊగులాడింది గాని స్వాతంత్ర్యానంతరం ప్రజలలోకి ప్రవేశించి జాతీయభావాలను నింపుకుంటున్నది. అఖిలభారత మహిళా సభకు ఆంధ్రశాఖగా మారిన ఈ సంస్థకు ప్రస్తుతము సరోజినీ యస్. యన్. రెడ్డి అధ్యక్షురాలుగాను, కస్తూరీ కృష్ణం రాజు కార్యదర్శిగాను సేవచేస్తూ ఈ సంఘ కార్యక్రమాలను విస్తృతపరచి సామాన్య స్త్రీలకు మరింత దగ్గరికి చేర్చడానికి ప్రయత్నం చేస్తూ వుండడం గమనార్హం. లేడీహైదరీక్లబ్బు, రిక్రియేషనుక్లబ్బు, మహిళా నవజీవన మండలి గూడా స్త్రీల అభ్యుదయానికి పని చేస్తున్న సంస్థలే.

## నూతన ఉత్తేజం

1935 సంవత్సరంలో ఆంధ్ర యువతీ మండలి స్థాపనతో నగరంలోని నారీలోకంలో మరొక్క కాంతికిరణం ప్రజ్వరిల్లింది. ఈ వ్యాసరచయిత్రి, మరికొందరు మహిళలచేత నెలకొల్పబడిన ఈ సంస్థ ఆనాటి యువతరానికి ప్రాతినిధ్యం వహించి అధునాతనమైన కార్యక్రమాలతో మహిళాలోకంలో సంచలనాన్ని గలుగజేసింది. చాలాకాలం వెనుకబడిపోయి పరదాలతో జీవితం గడిపిన తెలంగాణా మహిళలకు నూతనమైన ఉత్తేజాన్ని ఉత్సాహాన్ని కలుగజేసి తమ సభలకు పురుషులను గూడా ఆహ్వానించి అభ్యుదయ పథంలో పురోగమింపగలిగింది. స్వర్గీయ రంగమ్మ ఓబుల్‌రెడ్డి, ఇల్లిందల సరస్వతీదేవి, బూర్గుల అనంతలక్ష్మీదేవి, ఎ. శ్యామలాదేవి, రాణీ సరళాదేవిగార్లు ఈ సంస్థద్వారా చేసిన సేవ అమూల్యమైనది.

భారత దేశంలో జాతీయోద్యమం ప్రారంభం కాగానే హైదరాబాదులో గూడా దాని నీడలు ప్రసరించినాయి. 1929లోనే కుమారి పద్మ జానాయుడు ఆధ్వర్యంలో స్వదేశీ ఉద్యమమూ దానిలో స్త్రీల విభాగమూ ఏర్పడి ప్రత్యేక సమావేశాలూ ప్రచార సాధనాలూ ప్రారంభం అయినవి. దీనిలో అనేకమంది మహిళలు జేరి నూలు వడకడమూ, ఖద్దరు ధారణ, ఖాదీ విక్రయమూ చేస్తూ జాతీయోద్యమాన్ని బలపరుస్తూ వుండేవారు. కలువకుంట సరస్వతి, పురం రుక్మిణమ్మ, గుండా వీరమణి, వీరందరూ ఆనాటి నుండి సేవ చేస్తున్నవారే.

రాష్ట్రానికి సంబంధించిన జాతీయ కార్యకలాపాలలోనే గాక నిషేధింపబడిన స్టేటు కాంగ్రెసు కార్యకలాపాలలో గూడా ఈ రచయిత్రితో పాటు మరికొందరు మహిళలు గూడా సముచితమైన పాత్రను నిర్వహించుతూ వుండేవారు.

1946-47 ప్రాంతాలలో హైదరాబాదు రాష్ట్రంలో రాజకీయపు సంరంభం ఎక్కువయింది. భారత దేశంలో హైదరాబాదు చేరడమా మానడమా అన్న సమస్యతో హాలాహలం ఉద్భవించింది. వేల కొద్దీవున్న అధిక సంఖ్యాకులు అనేక విధాలుగా దోచుకొనబడి హింసింపబడ్డారు.

కరుకు తనమే గాని చురుకు తనము లేని ఆనాటి పాలకులు స్త్రీలను గూడా అనేక విధాలుగా హింసింపడానికి ప్రయత్నం జేశారు ఆ సందర్భంలోనే నల్లగొండ జిల్లా అక్కునూరు, మాచిరెడ్డిపల్లి అనేగ్రామాలలో స్త్రీలను దుర్భరంగా అవమానించారు ఆనాటి పోలీసులు. నగరం నుండి కొందరు మహిళలు ఈ రచయిత్రతో సహా అక్కడకు వెళ్లి ఆవిషయాలను వెలుగులోకి తెచ్చి వారికి తగిన అండ దండలనిచ్చి ఆదుకున్నారు. అనేక మహిళా సంఘాలు ఈ సంఘటనను ఖండించినాయి గూడాను. ఆనాటి పోలీసు బలమంతా ఒకే వర్గానికి జెంది ఉండడం వల్లగూడా మరింత అరాజకం వ్యాపించి పోవడం జరిగింది.

## స్వాతంత్ర్య పోరాటం

క్రమంగా రాజ్యంలో అత్యాచారాలు ఎక్కువై పోయినాయి. రజాకారుల దుండగాలు అధికమైనాయి. ఆసమయంలో ఒక్కొక్క మహిళ ఒక్కొక్క రుద్రమదేవిలాగా విజృంభించి కష్టాలు తప్పించుకున్న ఘట్టములు గూడా గలవు. దోపిడీ కారులైన రజాకారుల కళ్లల్లో కారాన్నీ, ఇసుకనూ జల్లి గృహోపకరణాలనే ఆయుధాలుగా చేసుకొని తప్పించుకుపోయిన వీరవనితలను గూడా ఎందరినో చూచాము ఆనాడు.

అట్లాంటికల్లోల సమయంలో మహిళా సభ పక్షాన దాని అధ్యక్షురాలు రంగమ్మగారు ఒక సమావేశం ఏర్పాటు చేశారు. అన్ని జిల్లాల నుండి ప్రతినిధులను రప్పించారు, అంతా గలిసి అక్రమమైన ఈ పోలీసు పరిపాలన అంతరింపజేసి రాష్ట్రంలో శాంతి భద్రతలను రక్షించవలెననీ, స్త్రీజాతికి ఏమాత్రం అన్యాయం జరిగినా సహింప బోమనీ వెల్లడించుతూ ఒక నిరసన తీర్మానాన్ని ఆమోదించి ప్రభుత్వానికి పంపించారు. కార్యదర్శులుగా నిమ్మగడ్డ సత్యవతీ ఈ వ్యాసరచయిత్రి సంతకాలతో ఈ తీర్మానాన్ని పత్రికలకు విడుదల చేశారు. ఈ సందర్భంలోనే మహిళాసభ కార్యదర్శినీ నిమ్మగడ్డ సత్యవతిని అరెస్టు చేసి రెండు సంవత్సరాలు చెరసాలలో బెట్టడం గూడా జరిగింది. ఆమె ఇప్పుడు స్వాతంత్ర్యయోధురాలుగా గౌరవభృతి తీసుకుంటున్నారు.

తరువాత దుండగాలు మితి మీరిన రోజుల్లో రంగమ్మ లక్ష్మీబాయమ్మ, సుమిత్రా దేవి, ఈ రచయిత్రి, మరికొందరు స్త్రీలు దురంతాలు జరిగిన చోట్లకు తిరిగి స్త్రీల కష్టనష్టాలు విచారించి వారికి ధైర్యము జెప్పవచ్చేవారు వీరిని చూడగానే ఆ స్త్రీలకు కొంతంత ధైర్యంవచ్చేది. ఇట్లా దాదాపు రెండు సంవత్సరాలు. దోపిడీలు అవమానాలు, హత్యలూ, గుండాగిరీతో జరిగిన ఈ భయోత్పాత పరిస్థితులలో ఈ స్త్రీలు అన్ని కష్టాలనూ సహనంతో ఎదుర్కొని ఉద్యమానికి అనేక విధాలుగా అండదండలనిచ్చి జాతిపునరుజ్జీవనానికి కారణ భూతులైనారు.

చిట్టచివరకు హైదరాబాదు భారత దేశంలో విలీనంచేయబడ్డది, స్వాతంత్ర్యాన్ని బొందిన తరువాత తెలంగాణాలో మహిళోద్యమం అనేకవిధాలుగా విజృంభించింది. మహిళల కోసం అనేక సంఘాలు విద్యాలయాలు, పారిశ్రామిక సంస్థలు, లలిత కళా కేంద్రాలు శరణాలయాలు, రక్షణ గృహాలు ఏర్పడినాయి.

వీటిలో సంగంలక్ష్మీబాయమ్మగారు 1953 లో స్థాపించిన ఇందిరా సేవాసదనము ఆనాటి కష్టజీవులైన మహిళలకు పెన్నిధిలాగా తోడు బడ్డది. సేవావ్రతురాలైన లక్ష్మీబాయమ్మ తన సర్వస్వాన్నీ ఈ సంఘానికే సమర్పించి దీనులైన మహిళలకు చిన్నబిడ్డలకు అమూల్యమైన సహాయం చేశారు.

## ఆంధ్ర ప్రదేశ్ అవతరణ అనంతరం

ఆంధ్రప్రదేశం అవతరించిన తరువాత మహిళాలోకంలో ప్రసరించిన మరొక్క వెలుగు రేఖ ఆంధ్ర మహిళాసభ హైదరాబాదులో గూడ స్థాపింపబడడము. క్రియాశీలురాలైన దుర్గాబాయి దేశముఖ్ తన అపారప్రజ్ఞా విశేషమూ, ప్రతిభా సంపత్తి చేత స్త్రీలోకానికి అనేక రంగాలలో సహాయం చేస్తూ అభ్యుదయ మార్గంలో నడిపించారు. విద్యా శాలలు, వైద్యశాలలు, చేతిపనుల కేంద్రాలు, నర్సింగు కోర్సులు ఇట్లా ఎన్నో విధాలైన నిర్మాణ కార్యక్రమాలు ఏర్పరిచారు. కాలేజీలు స్థాపించారు. గాంధీ శతాబ్ది భవనాలు నిర్మించారు. హైదరాబాదులోనేగాక సంగారెడ్డి, మహబూబు నగర్, షాదునగర్‌లలో గూడ మహిళాసభలను, బాపూ సేవామందిరాలను నిర్మించి సేవచేస్తూవున్నారు.

ఈ నాడు నగరంలోను జిల్లాలలోనూ ఎన్నో మహిళా సంఘాలు మలక్‌పేట, తార్‌నాకా, ఎర్రమంజిల్ మహిళా సమాజాలు, ప్రమదామండలి, ఇవ్వన్నీ స్త్రీలకోసం కొన్ని కొన్ని స్కీములను నడుపుతూ విద్యా సాంఘిక రంగాలల్లో సేవచేస్తూవున్నాయి. రాష్ట్ర సాంఘికసంక్షేమ శాఖ వీరందరికీ అండ దండలు ఇచ్చి ప్రోత్సహించడము గమనింపదగినది.

మరొక్క మాట. ఈ నలభై ఏభై సంవత్సరాలల్లోనూ రాష్ట్రంలో ఎన్నో విపరీత సంఘటనలు జరిగినాయి. కరువు కాటకాలు, వరదలు, భూకంపాలు, యుద్ధాలు ఇట్లాంటి సంఘటనలలో

రాష్ట్రంలోని మహిళలు ధనధాన్యాలను, వస్త్రాలను, బంగారాన్ని ప్రోగుచేసి పంపి తోడ్పడ్డారు. చైనా భారతయుద్ధంలో తమ బంగారాన్ని త్యాగంచేసి దేశాన్ని దక్కించుకున్నారు.

ఈనాడు ఈ తెలుగు మాగాణిలో ఎందరో ఉన్నత విద్యావంతులు డాక్టర్లు, లెక్చరర్లు, రచయిత్రులు, కవయిత్రులు, శాసనసభ్యులు ప్రకాశించుచున్నారు.

ఒకానొకనాడు వేదసూత్రాలు రచించి మహాతపస్వినులైన ఈ మహిళలు, రాజ్యాలు పాలించి దేశాన్ని రక్షించిన ఈ వీరనారులు ఈ మధ్య కాలంలో, పరాయిపాలనలో అనేక కష్టనష్టాలు పొందారు. శక్తులన్నీ లాగివేయబడినాయి. రెక్కలన్నీ విరిచి వేయబడినాయి. అంతఃపురాలలో బంధింప బడ్డారు. బాల్య వివాహాలకు వృద్ధవివాహాలకు, బహుభార్యాత్వానికీ పాల్పడ్డారు అగ్నిజ్వాలలకూ, కేశఖండనాలకూ లోబడి విధవలుగా జేయబడ్డారు. వంట ఇంటి బానిసలుగా, పురుషుల విలాసాలు తీర్చే బొమ్మలుగా వుండి పోయినారు.

ఈనాడు తెలుగు నారి ఈశత సహస్రబంధనాలను వదిలించుకొని, ముందుకు ముందుకు వచ్చి తన వ్యక్తిత్వాన్ని పెంపుచేసుకుంటున్నది భారతీయ మహిళాలోకంలో మహోజ్వల నక్షత్రంలాగా ప్రకాశించుతూవున్నది. మరొక్కమారు వేదకాలం నాటి తన ఆధ్యాత్మిక శక్తులను పెంపొందించుకొని మహోన్నతదశను అందుకొనగలదనడంలో సందేహం లేదు. *

## నేటిసాంఘిక జీవనంలో మహిళలస్థానం

(44 వ పేజీనుండి)

స్త్రీలలో మంత్రద్రష్టలూ—శాస్త్రకోవిదులూ పండితురాండ్రూ—విద్యావతులూ అనేకమంది ఉండేవారు. చర్చలు చేసేవారు పండితులను ఓడించేవారు. రాజులచేత, సంఘంచేత గౌరవింపబడుతూ ఉండేవారు. సలహాలు ఇస్తూ ఉండేవారు. మనదేశంలో స్త్రీని స్త్రీగా కాకుండా మాతగా గౌరవిస్తారన్నది ఖండఖండాంతరాలకు ప్రాకిపోయిన సత్యము.

### సృష్టికి మూలం

స్త్రీ ఉంటే గాని సృష్టిసాగదు నవమాసాలు మోసి కని స్తన్యమిచ్చి పోషించేది స్త్రీ. పురుషుడి ఇహ పరసుఖాలకు ఆటపట్టయి అతడి ప్రశాంత జీవితానికి మూలమయినది స్త్రీ. పురుషుడిలో అర్ధభాగము స్త్రీ. స్త్రీ లేనిదే పురుషుడులేడు. వారిద్దరినీ విడదీసి ప్రత్యేక పద్ధతులలో అభివృద్ధిని సాధించాలంటే సాధ్యము కానిపని. స్త్రీ పురుషులను ఏ ఒక్క విషయంలో విడదీసినా వారి బ్రతుకులు విడి అయిపోతాయి. మనసులో ధృవాంతర భేదాలు వచ్చి తిరిగి కలవవు. విడివిడిగా అభివృద్ధి పథకాలతో ముందుకు నడిపించినా సహజీవనములో ప్రశాంతత కుదరదు. కనకనే అభివృద్ధి మార్గాలన్నీ సమిష్టిగా సాగాలి.

దీనికి మన సమాజము యొక్క ఆలోచనా సరళి మారాలి. స్త్రీ కుటుంబానికీ సంఘానికీ జీవగర్ర—ప్రాణవాయువు. ఆమెను గౌరవించి గౌరవము పొందాలన్న భావం సమాజంలో కలగాలి. మనసులలో మార్పురావాలి. మన సమాజంలో సంస్కార భావాలు సహజంగా ఉత్పన్నం కావాలి. మనసులో సంస్కారం లేక పోయిన తరువాత ఎన్ని చట్టాలు, శాసనాలు చేసినా ఉపయోగానికి రావు. మేధావులూ, రచయితలూ, సంఘసంస్కర్తలూ, రాజకీయ వేత్తలూ ఈ సత్యాన్ని గ్రహించాలి.

## భావ సమైక్యత

ఈనాడు మనము ఎక్కడ చూసినా ఎక్కడ విన్నా భావ సమైక్యత—జాతీయ సమైక్యత అనే గంభీరమైన పదాలు వింటున్నాము. వీటివల్ల సర్వజనులకూ సుఖశాంతులు కలుగుతాయని అందరూ కాంక్షిస్తున్నారు. భావసమైక్యతను పెంపొందించుకుంటే జాతీయసమైక్యత కలుగుతుందని ఆశిస్తున్నారు. కాని—ఈ భావ సమైక్యత అనే గంభీరమైన పదము ఎక్కడనుండి ఉద్భవించాలి? దీనికి కుదురు ఏది?

భావసమైక్యతకు ఒకరి కష్టసుఖాలు ఒకరు అర్థం చేసుకోవాలి. ఒకరికొకరు సహాయ సానుభూతులను అందించుకోవాలి. ఒకరి సుఖసంతోషాలను మరొకరు కాంక్షించాలి. ఇటువంటి భావసమైక్యత మొట్టమొదట—దంపతులలో—స్త్రీ పురుషుల మధ్య జనించాలి. ఆ తరువాత దేశమంతటా మల్లెపందిరలా వాసనలు విరజిమ్ముతూ పాకిపోవాలి.

పురుషుడికి తన సంసారంలో—తనతల్లి— తన భార్య—తన కుమార్తెపట్ల కలగని భావసమైక్యత మరెక్కడా కలగదు హృదయ వైశాల్యమూ, సంస్కారమూలేని చదువులతో సమాజము ఆరోగ్యవంతంగా ఉండలేదు. అనారోగ్యసమాజంలో వ్యక్తులందరూ రోగులు గానే ఉంటారు. ఆరోగ్యకరమైన సంతానం కలగటం దుర్లభమవుతుంది.

తానొక్కడూ విద్యావంతుడై అభివృద్ధి చెందుతూ లోకమంతా తనవలెనే ఉన్నదనుకునే పురుషుడు తన ఆలోచనా సరళిని సంస్కరించుకుని—స్త్రీని కూడ కలుపుకొని ముందుకు సాగిననాడే మానవాళికి నిజమైన అభివృద్ధి. ఒక్క పురుషుడికి అభివృద్ధి అది ఒక అభివృద్ధి అనిపించుకోదు. సర్వతోముఖమైన అభివృద్ధే ఈనాడు సమాజానికి కావలసినది.





ప్రెసిడెంట్ శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ హైదరాబాద్‌లో సెప్టెంబర్ 1వ తేదీన ఇందిరా నేషనల్ పార్కుకు శంకుస్థాపన చేశారు. గవర్నరు శ్రీ ఎస్. ఓబుల్‌రెడ్డిని, ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావును కూడా చిత్రంలో చూడవచ్చు.



ప్రెసిడెంట్ శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ సెప్టెంబర్ 2వ తేదీన కమర్షియల్ కాంప్లెక్సు భవనానికి శంకుస్థాపన చేసిన అనంతరం భవనం నమూనాన్ని తిలకిస్తూన్న చిత్రం. ఇందులోనే ముఖ్యమంత్రి, గవర్నరు, మునిసిపల్ పరిపాలనాశాఖ మంత్రి శ్రీ చల్లా సుబ్బారాయుడులను చూడవచ్చు.

## నగరంలో..!



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఆగస్టు 15వ తేదీన సికిందరాబాద్‌లో సైనిక కవాతు ప్రదర్శనను తిలకిస్తూన్న చిత్రం.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఆగస్టు 15న రైన్ బజార్‌లో సూపర్ బజార్ విభాగాన్ని ప్రారంభించారు. ఇందులో పరదా ధరించిన మహిళలు సరుకులను విక్రయించే స్టాలును సందర్శించారు.



విద్యుచ్ఛక్తి శాఖ మంత్రి శ్రీ జి. రాజారాం ఆగస్టు 9న రైన్‌బజార్‌లో తుండలతయారీ శిక్షణకు ప్రారంభోత్సవం చేశారు.

# వార్తావాహిని

—స్వరాజ్యలక్ష్మి

## అంతర్జాతీయ మహిళాసంవత్సర ఉత్సవాలు

రాజధానిలో జూలై 30 వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు అంతర్జాతీయ మహిళా సంవత్సర ఉత్సవాలను ప్రారంభించారు. కుటుంబ నియంత్రణ రాష్ట్ర విభాగానికి చెందిన 24 స్వచ్ఛంద మహిళాసంస్థల ఆధ్వర్యంలో యీఉత్సవాలు జరిగాయి. ప్రారంభోత్సవ సమావేశంలో మాట్లాడుతూ ముఖ్యమంత్రి ప్రస్తుత సంవత్సరంలో మహిళల హోదాను పెంచేందుకు కృషి జరగాలని ఉద్బోధించారు. భారతరాజ్యాంగం స్త్రీలకు సంపూర్ణ సమానత్వాన్ని యిచ్చింది. రాష్ట్ర ప్రభుత్వం స్త్రీసంక్షేమ సహకార సంఘాల ద్వారానూ, ఉద్యోగాలిచ్చి, ఉపాధికల్పించడం ద్వారానూ మహిళల స్థితిని ఆర్థికంగా మెరుగు పరిచేందుకు అనేక చర్యలను తీసుకుంటూంది అని అన్నారు. సాంఘికంగానూ, ఆర్థికంగానూ, స్త్రీ హోదాను విప్లవాత్మకంగా మెరుగు పరిచేందుకు స్వచ్ఛంద సంస్థలు ముందుకు రావాలని ముఖ్యమంత్రి కోరారు.

ప్రారంభోత్సవ సమావేశానికి విద్య, సాంస్కృతిక శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు అధ్యక్షత వహించారు.

మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీగోపాలరావు ఎక్బోటే, విశ్వవిద్యాలయ మహిళల ఫెడరేషన్ అధ్యక్షులు శ్రీమతి ఎం. ఎఫ్. జస్సువాలా, కుటుంబ నియంత్రణ రాష్ట్ర విభాగం అధ్యక్షులు శ్రీమతి ప్రేమలతాగుప్తా ప్రభృతులు ప్రసంగించారు.

## చిత్తూరు జిల్లాలో ...

చిత్తూరులో జిల్లాస్థాయి అంతర్జాతీయ మహిళా సంవత్సర ఉత్సవాలను ఆగస్టు 1 వ తేదీన మహిళా, శిశు సంక్షేమ శాఖ మంత్రిణి శ్రీమతి యం. లక్ష్మీదేవి ప్రారంభించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ శ్రీమతి లక్ష్మీదేవి మహిళల, ముఖ్యంగా వెనుకబడిన వర్గాల స్త్రీజనాభి వృద్ధి కోసం అనేక పథకాలు అమలు జరపడానికి రాష్ట్ర ప్రభుత్వ ఉత్తరువులు జారీచేయనున్నదనీ, పట్టణ పరిసర ప్రాంతాల్లోని స్త్రీలకే కాకుండా, పల్లెపట్టుల్లో నివసించే వారికి కూడా ప్రభుత్వపథకాలవల్ల లాభం చేకూరేటట్టు చూడాలనీ అన్నారు.

జిల్లా పౌరసంబంధాధికారిచే ప్రచురించబడుతోన్న మాసపత్రిక "అరుణోదయ" ను శ్రీమతి లక్ష్మీదేవి విడుదల చేశారు.

జిల్లాకలెక్టర్ శ్రీ ఎం. ఎస్. రాజాజీ జిల్లాలోని 19 పంచాయతీ సమితుల్లోను మహిళలకోసం ప్రత్యేకంగా సహకార సంఘాలు ప్రారంభించే ప్రతిపాదనగలదని వెల్లడించారు.

## వరంగల్లు జిల్లాలో....

కార్మికశాఖమంత్రి శ్రీ టి. అంజయ్య వరంగల్లులో నాలుగు రోజుల పాటు జరిగిన అంతర్జాతీయ మహిళా సంవత్సర ఉత్సవాలను ఆగస్టు 20 వ తేదీన ప్రారంభించారు. సులభంగా పని చేయడానికి వీలైన టైపిస్టు, స్టెనో, టెలిఫోన్ ఆపరేటరు మొదలైన ఉద్యోగాల్లో కొన్నింటిని మహిళలకు ప్రత్యేకంగా కేటాయించాలనే ప్రతిపాదనను రాష్ట్ర ప్రభుత్వం పరిశీలిస్తున్నట్లు యీ సందర్భంగా శ్రీ టి. అంజయ్య ప్రకటించారు. వ్యవసాయరంగంలోను, ఫ్యాక్టరీల్లోను పనిచేసే స్త్రీ కార్మికులకు అంటు వ్యాధులకు గురి కాకుండా అన్ని చికిత్సా సౌకర్యాలతో నిర్బంధ ఆరోగ్య పరీక్ష అవసరమని అన్నారు. జిల్లాకలెక్టర్ శ్రీ సమర్ జిత్ రే స్త్రీల సమస్యలను సమీక్షించుకోడానికి యీ అంతర్జాతీయ మహిళా సంవత్సరం అవకాశం కల్పించిందని అన్నారు. జిల్లాపరిషత్ అధ్యక్షులు శ్రీ బి జనార్ధన్, శ్రీమతి కనకరత్నమ్మ, శ్రీమతి విమాలాదేవి, శాసన సభ్యుడు శ్రీ పి ఉమారెడ్డి, హన్మకొండ పంచాయతీసమితి అధ్యక్షులు శ్రీ సత్యనారాయణ, పంచాయతీరాజ్ విభాగం స్టేట్ ఛాంబర్ అధ్యక్షులు శ్రీ యతిరాజరావు ప్రభృతులు ప్రసంగించారు.

## ప్రత్యేక మహిళా కళాశాలలు

రాష్ట్రంలో మహిళలకు ప్రత్యేకంగా నాలుగు డిగ్రీ స్థాయి కళాశాలలు, నాలుగు జూనియర్ కళాశాలలు యీ విద్యాసంవత్సరంలో పనిచేయడం ప్రారంభించాయి. ఇట్లాగే ఒక రెసిడెన్షియల్ కళాశాలను స్థాపించే ప్రతిపాదన వుంది. రాష్ట్రంలో మహిళల వసతి గృహాలను యింకా నిర్మించాలనే ప్రతిపాదనను కూడా రాష్ట్ర ప్రభుత్వం పరిశీలిస్తూంది.

## జాతీయస్థాయిలో మహిళాసంక్షేమ ప్రణాళిక

జాతీయ స్థాయిన తక్కువ కాలవ్యవధిలోను, ఎక్కువ కాల వ్యవధిలోను నిర్వహించే కార్యక్రమాలకు సంబంధించిన మహిళా సంక్షేమ ప్రణాళికను సాంఘిక సంక్షేమ శాఖ రూపొందించనున్నది. అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా పరిగణింపబడుతోన్న యీ సంవత్సరాంతానికి ప్రణాళికను సిద్ధంచేస్తారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పదిలక్షల రూపాయల ఖర్చుతో మహిళల కోసం ఒక ఆర్థిక సంస్థను స్థాపించారు. ఈ సంవత్సరంలోనే జాతీయ స్థాయిలో బాలికల ఆటల పోటీలను నిర్వహించనున్నారు.

## జంటనగరాల్లో మహిళా సూపర్ బజార్లు

హైదరాబాద్‌లో ఆగస్టు 15 వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు నాలుగు మినీసూపర్ బజార్లకు ప్రారంభోత్సవం చేశారు. యీ నాలుగు సూపర్ బజార్లలోను సిబ్బంది అంతామహిళలే. స్త్రీలు నిర్వహించే మినీసూపర్ బజార్లు రాష్ట్రంలో అక్కడక్కడ ప్రారంభమౌతున్నాయి యాకుత్‌పురా సూపర్ బజార్‌లో స్త్రీలకు సరుకులమ్మేందుకు బురఖా ధరించిన స్త్రీలను నియోగించారు

## మహిళా సిబ్బందితో పనిచేసే పోస్టాఫీస్

అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా ఆగస్టు 15 వ తేదీన హైదరాబాద్‌లోని ఆర్. ఆర్. లాబ్స్ ఆవరణలో ఒక పోస్టాఫీసు ప్రారంభించబడింది ఇందులో సిబ్బంది అంతా మహిళలే. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మొదటిసారిగా నెలకొల్పబడిన యీ పోస్టాఫీస్‌ను రీజినల్ రీసెర్చి లేబొరేటరీస్ డైరెక్టర్ డక్టర్ జి. యస్. సిధు ప్రారంభించారు. ఇది ఉదయం 9 గంటల నుండి సాయంత్రం 5 వరకు పనిచేస్తుంది. ఇందులో తంతి సౌకర్యాలు మినహాయించి అన్నితపాలా వ్యవహారాలు నిర్వహిస్తారు.

ప్రారంభించబడిన మొదటిరోజున యీ కార్యాలయం రూ. 125 ల స్టాంపులను విక్రయించింది సుమారు 560 ఉత్తరాలను బట్వాడా చేసింది. కొద్ది కాలంలో యిటువంటి పోస్టాఫీసులను యింకా తెరువనున్నామని పోస్టమాస్టర్ జనరల్ పి. యస్. రాఘవాచారి వెల్లడించారు.

## స్త్రీపురుషులకు సమానవేతనాలు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వ్యవసాయరంగంలో పనిచేస్తున్న కూలీల కనీస వేతనాలను సవరించారు. దీనికి సంబంధించిన ముసాయిదా ప్రకటన 1975 ఆగస్టు 8 వ తేదీనాటి అసాధారణ గజెట్‌లో ప్రకటించారు. రాష్ట్ర కనీస వేతనాల సలహా సంఘంతో సంప్రదింపులు జరిపిన తరువాత ప్రభుత్వం వారు యీ వేతనాలను అమలు జరుపుతారు. యీ ప్రకటనలో అతి ముఖ్యమైన విషయమేమంటే పురుషులకు, స్త్రీలకు సమాన వేతనాలు యివ్వాలని సూచించడం.

సవరించిన వేతనాల ననుసరించి వయోజన కూలీలకు వ్యవసాయరంగంలో, పనిచేసే ప్రాంతాన్ని బట్టి రూ. 900 నుంచి 1400 వరకు గిట్టుబాటవుతుంది. రోజు కూలీ రూ. 3 నుంచి రూ. 5 వరకు యిస్తారు. వ్యవసాయ కూలీ వేతనాలు నిర్ణయించేందుకు రాష్ట్రాన్ని మూడు మండలాలుగా విభజించారు.

వ్యవసాయానికి బాలబాలికలను నియోగించే పక్షంలో వారికి కూలీక్రింద పయోజనులకిచ్చే వేతనంలో 50 శాతం యివ్వాలి

## నెల్లూరు జిల్లాలో...

నెల్లూరు జిల్లా వెంకటాచలం పంచాయతీ సమితి ఆధ్వర్యాన 29-7-75 నుండి 1-8-75 వరకు అంతర్జాతీయ మహిళా సంవత్సరం 1975 సందర్భంగా బ్లాకు స్థాయి మహిళా సమావేశాలు వెంకటాచలంలో జరిగాయి

29-7-75 ఉదయం 10 గం॥ లకు ప్రారంభమైన సభకు మహిళామండలి అధ్యక్షురాలు శ్రీమతి ఎం. విద్యావతి గారు అధ్యక్షతవహించారు. సమితి అధ్యక్షులు శ్రీ రామిరెడ్డి దశరథరామిరెడ్డిగారు మహిళా సమావేశాలను ప్రారంభిస్తూ పురాణ కాలం నుండి భారతమహిళకున్న గౌరవస్థానాన్ని మరచి, నేటి నవ నాగరికత పేరుతో పరాయిపాలన పోయినప్పటికీ, పరాయి వ్యామోహాలతో మునిగిపోతున్న మన దుస్థితిని పోగొట్టి మన భారతీయ సాంప్రదాయాలను పాటించవలసినదిగా ఉద్బోధించారు

జిల్లా హరిజనసేవా సంఘాధ్యక్షురాలు శ్రీమతి అల్లాడి అన్నపూర్ణమ్మగారు తన ప్రారంభోపన్యాసంలో అనాదిగా స్త్రీలకున్న గౌరవస్థానాన్ని చైతన్యంతో కాపాడుకోవాలన్నారు.

శ్రీమతులు గిరిజారెడ్డి, వి. కమలమ్మ, స్త్రీ, శిశు సంక్షేమ శాఖాధికారిణి లలితాబాయి, పద్మావతి ప్రభృతులు ప్రసంగించారు. సమావేశా నంతరం మహిళల చర్చాగోష్ఠులు, వివిధ పోటీలు నిర్వహించారు.

## ఆదోనిలో కార్మిక విద్యా కేంద్రము

అంతర్జాతీయ మహిళా సంవత్సర ఉత్సవాలను పురస్కరించుకొని, స్థానిక రాయలసీమ మిల్స్‌లో ప్రవేశపెట్టబడిన కార్మిక విద్యాకేంద్రానికి ఆంధ్రప్రదేశ్ స్త్రీ, శిశు సంక్షేమ శాఖ మంత్రిణి శ్రీమతి యం లక్ష్మీదేవి గారు ఇటీవల ప్రారంభోత్సవము గావించారు. ఈ కేంద్రము ఆంధ్రప్రదేశ్‌లో మొట్ట మొదటిది. ఇందులో 20 మంది మహిళలకు శిక్షణ ఇవ్వబడుతుంది.

మంత్రిణి తమ ఉపన్యాసంలో కార్మిక స్త్రీలు అధికోత్పత్తి సాధించడంలో పురుషులతో సమానంగా కృషిచేసి దేశాన్ని ఆర్థికంగా పటిష్టం చేయాలనీ, పిల్లలకు విద్యాబుద్ధులు గఱపి, క్రమశిక్షణతో మెలగు భావి పౌరులుగా తీర్చిదిద్దాలనీ, పొదుపు పద్ధతుల ననుసరించాలని ఉద్బోధించారు.

మిల్స్ డైరెక్టరు శ్రీ యం. నారాయణప్పగారు సభకు అధ్యక్షత వహించిరి.

స్థానిక శాసనసభ్యుడు శ్రీ హెచ్. సత్యనారాయణరావు, విద్యాశాఖాధికారి శ్రీ యల్. రామచంద్రప్ప, శ్రీ సిద్దయ్య ప్రసంగించారు.

అదే రోజున ఏర్పాటు గావింపబడిన మైనారిటీ మరియు బలహీనవర్గాల ఫెడరేషను సమావేశమునందు మంత్రిణి 14 మంది హరిజనులకు ఇళ్ళస్థలా పట్టాలను పంచిపెట్టారు.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఆగస్టు 1న
బహదూర్ గూడాలో అంతరిక్ష ఉపగ్రహ బోధనాత్మక
టెలివిజన్ ప్రయోగానికి చిహ్నంగా ప్రత్యేక తపాలా
బిళ్ళను విడుదల చేశారు. ఆ గ్రామంలోని
దంపతులకు తపాలాబిళ్ళల ఆల్బంను
బహూకరిస్తున్న చిత్రం



యాత్రికశాఖమంత్రి శ్రీ సి. హెచ్. దేవానందరావు ఆగస్టు 1న
హార్స్లీకొండలలో మీటిరియోలాజికల్ అబ్జర్వేటరీని
ప్రారంభించారు



## వార్తా చిత్రాలు

ఆరోగ్యశాఖమంత్రి శ్రీ కె. రాజమల్లు సాలూరులో ఆగస్టు 8న
లెప్రసీ మిషన్ ఆసుపత్రిలో న్యూడోర్ ఫర్ వార్డును
ప్రారంభించారు



మధ్యతరహా నీటిపారుదలశాఖ మంత్రి శ్రీ వి. కృష్ణమూర్తినాయుడు
ఆగస్టు 21న మక్కువలో ప్రాథమిక ఆరోగ్య కేంద్ర భవనానికి
శంకుస్థాపన చేశారు



నిజామాబాద్‌లో అంతర్జాతీయ మహిళా సంవత్సర ఉత్సవాలు
జరిగాయి. మహిళా, శిశుసంక్షేమశాఖ మంత్రిణి
శ్రీమతి యం. లక్ష్మీదేవి ఉత్సవాలలో పాల్గొన్నారు

రిజిస్టరు నెం. హెచ్/హెచ్. డి. 81

## ప్రజల మద్దతు

అత్యవసర పరిస్థితికి ప్రజలు పూర్తి మద్దతు ప్రకటించారు. ఎందువల్ల? అంతర్జాతీయ రంగంలోని సంబంధాలలో, బలాబలాలలో అతి సున్నితమైన మార్పులు జరుగుతున్న యీ సమయంలో ప్రతిపక్షాలవారు విశృంఖలంగా ప్రవర్తించి దేశాన్ని బలహీనపరుస్తున్నారని వారు మనస్ఫూర్తిగా నమ్ముతున్నారు.

ప్రతిపక్షాల వారు తమ గొంతు తామేవిని, కొన్ని వార్తా పత్రికల వ్యాఖ్యలు చూసి అదంతా ప్రజాభిప్రాయమని భ్రమ పడ్డారు. చివరకు యిప్పుడు నిరాశా, నిస్పృహలతో కూలిపోయారు.

—లోక్‌సభలో ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ